దేవదానవుల్ । ఘనతరబాహుశౌర్యమెసఁగ న్దదనంబొనరింప నప్పుడున్ । వసుజబలంబుమించెవి బుధవ్రజమంత పరాజయంబుచేఁ । గనకమహీధరోర్ధ్వముననంగామువిరోధి మయుండు గెల్చినన్ ॥ తే॥గీ॥ అచటికమరుల బాధింప నరుగ దేర । మాకుఁడువీక్షించి కోపవిస్ఫురణ మీఱ । నసురుల శపించెవిరోధదురాత్ములార । శరణుఁ బొందుచు సురలువహెత్సన్నిధికిని ॥ క॥ వచ్చినవారికిఁ గ్రొవ్వున । నిచ్చటబాధింప రాఁగ నిదిపౌరుషమే । సచ్చరితమారులగుచున । నిచ్ఛపరాజయము మీరు నిక్కముగనుఁడీ ॥ ఆ॥వె॥ యజ్ఞభాగములకు నర్హతిలేకింత । నుగ్రకర్ములగుచు నుర్విలోన । విప్రవరుల మిమ్ముజేమాలునిందింప । నఖిలధర్మమారులగుచుమిగుల ॥ క॥ కనకాద్రియూర్ధ్వభాగము గనుపట్టగు మీకునెప్పుడుఁ గనుపట్టుటఁగ । ల్గిన నొకచో నధికోహము । మొనరింపఁగ బలముతోయుండున్ మీకున్ ॥ వ॥ అనియుఁజియును ॥ తే॥గీ॥ ఇదిమొదలునస్మదాజ్ఞనీమహామనగము । దైత్యదానవరాక్షసతండములకు । నూర్ధ్వభాగమగమ్యమై యొప్పనెపుడుఁ । బూజ్యులగుదురు దేవతల్ భువనములను ॥ వ॥ మఱియు యజ్ఞభాగంబుల ననుభవింపుచు యజ్ఞంబులుచేయుచుఁ బరాజయంబును బొందక గాయత్రీచ్ఛందంబున భూమియు నంతరిక్షంబును, త్రిష్టుప్ఛందంబున స్వర్గంబును జగతీచ్ఛందంబున దిక్కులనువిక్రమించుచు సకలశత్రుజయంబును గాంతురనుచ్చాసనంబిడియు ॥ క॥ అమరలలోపల నెవ్వఁ । డసదృశతరభక్తి నన్ను నారాధించున్ । వసుమతి జేతయంతడగుఁ । బొనఁగు నెయ్యతరులకు నెల్ల భువనజయంబున్ ॥ క॥ అనిహరుడాజ్ఞాపించుటఁ । గనకమహీధరము దేవగణములకిరవై । దనరుచును మఱియుటఁగల్గిన । దనుజాలభయముచటలేదు దైవతతతికిన్ । మా॥ విన మాతో కృతులకు శౌనకాదులభినందించుచుటయు ॥ మా॥ స్ఫురదాభోగకటీజటీమ్మనుపటీ భూతాశభూతాశనం । స్మరణీయాంఘ్రివినూత్నరత్నకటకచ్ఛక్రీశ చక్రీశ భ । ద్యరహోదారకటాక్షవీక్షణసముగ్రీశగ్రీశ భా । స్వరకోదండవిఖండితో న్మదపురా సత్రాస సత్రాసమా ॥ క॥ వారణవాచక గర్వని । వారణమోదితగళోర్ధ్వవారణసరితా । వారణ వైభవగరిమా । వారణముఖజనకటాధవారణదక్షా ॥ కవిరాజవిరాజితము ॥ కలుపవిఘాల నభిచ్చరపాలన కాముదశీలన సర్వవిదా । కలితదుకూల నవోడుపలీల నఖదుర్గజాల నయాంఘ్రియుగా । అలఘునిటాల నటచ్ఛిఖిలనకావనలావన భూరిగుణా । విలసితశీతనగేష్వనమోశన విశ్వనిమీలనకృత్యచణా ॥

గద్య॥ ఇది శ్రీమదిందుధరసుందర పాదారవిందార్పిత వ్యాప్తభృతపత్రసకలసు
కవిజనానుగ్రహపాత్ర సుగుణగణస్తోత్ర పవిత్ర చరిత్రి కాశ్యపస
గోత్ర కొడూరి యెల్లనార్యపౌత్ర శంకరామాత్య లక్ష్మాం
బికాతనయ వినయవిధేయ బాలసరస్వతీ నామాంక
వెంకటాచలకవి ప్రణీతంబైన శ్రీస్కాందం
బను మహాపురాణాంతర్గత శివరహస్య
ఖండంబున సంభవకాండమం
దుప్రథమాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ

# శివరహస్యఖండము

## సంభవకాండము

ద్వితీయాశ్వాసము.



క॥ శ్రీరాజితగిరిరాజ వి । హార విరాజితభుజంగహారా నిజసేవారత మురువాసుకు భాగీరథమణిమనోజ్ఞధ్రుంగ శ్రీశివలింగా ॥ వ॥ అవధరింపుము మఱియు శౌనకాది మహామునీంద్రులకు రోమహర్షణి యిట్లనియె ॥ క॥ అంత నవంతుఁ డవ్విధిసురాధిపులంగని పల్కెఁ జిత్తమం । దెంతయు యుక్తరాగమున జేను నెఱింగినవాఁడనై గుహా । భ్యంతరవాసము న్విడిచి యాత్రపురంబిది చేరఁగంటి దే । వాంతకు బాధకల్గునపుడాగిరి కంధరమాశ్రయించెదన్ ॥ క॥ కావున మనబాహాబల । ప్రావీణ్యమెకింతయైనఁ జాటిల్లసివో । దేవారి శూరపద్ముఁడు । జావిక్రమ శక్తి ప్రబలల సంగరమందున్ ॥ క॥ పురములు మూటిని గూల్చిన । పరశివ గడుసాత్రిలోకశంకరుఁడగు శంకరుఁడున్నాకను మాకుం । దరమే దనుజతయంబు నర్పనుపంపన్ ॥ క॥ మనలన్ రక్షించుటకై । ఘనతరకృపతోఁడ నీవగరకము ద్రిమింగన్ । మునునతిని మహామహిమము । ఘనతోద్భవకొమరికైనవకనెంయున్నన్ ॥ తే॥గీ॥ శూరపద్ముని తేజంబు జూరఁగొనఁగ । సింహవక్త్రుని విక్రమస్థితిపడఁపఁ । దారకాసురు దర్పంబు ధరణిఁగూల్ప । శంకరుఁడుఁ దక్కనన్యుఁడు జగతిఁగలఁడె ॥ క॥ అపరమేశ్వరుభజనం । బేపట్లను మనకు ముక్తిమిష్టకరము న । ర్వాపన్నివారకంబై । జాపట్టువటంచుఁ గాతిపి సురతతికిన్ ॥

బ్రహ్మవిష్ణ్వాదిదేవతలు శంకరుంగూర్చి తపంబొనరించుట.

వ॥ అప్పుడప్పద్మలోచనుండగు నారాయణుండు బ్రహ్మాది దేవగణంబులతోఁడ నియమంబులొప్పద వృకనాంబర పాంశుదండంబులు కెలంక భస్మోద్ధూళనధవళిత దేహుండును, త్రిపుండ్రాంకిత ఫాలుండును, రుద్రాక్షమాలికాలంకృత కంఠుండును నగుచు త్ర్యక్షంబగు పంచాక్షరీ శతరుద్రీయంబులు జపించుచు శివచరణారవింద ధ్యాననిష్ఠాతత్పరుండై యేకాగ్ర చిత్తంబునఁనుండె నవ్విధంబున బ్రహ్మేంద్రాది సకలదేవతలును బరమేశ్వర సేవా పరాయణులై యుండ బహుకాలంబు సనిరు నంత యీశ్వరం కంఠభాగమునందు గాలకూటచ్ఛట లింద్రనీలద్యుతులొసఁగుచుండఁ జూటంబుందు భువనటాజూటంబునందను గంగాతరంగసంగములు గదలఁ । గమనీయమ్మునతర గజచర్మచేలంబు గటితటినందమై కానుపింప । నహిరాజభూషణా యఖిఫణామణిరుచుల్ నిర్తలబుగు మేనసంధికైలయ । మహిమ దనరంగ శారేందుముకుటమొప్ప । మందహాసాంచిత ముఖారవిందుఁడగుచు నంది వైదండఁగొనుచు సానందముల । సాంబశంకరుండిట్లు సాక్షాత్కరించె ॥ క॥ ఇట్లు బ్రత్య

ను। ద్భటమూర్తి పరంపరలన్ భవుని డెందంబున్విదారింపడే। చటులోద్దండ భుజప్రతాపుఁడు మనోజాతుండు దుర్వారుఁడై ॥ మ॥ గరితుం జక్కెరవింట సూనశర సంఘాతంబు సంధించె। మరు మారుండెద నాట నేయ రజనీమాణిక్యముల్ శైలజ। బరిరంభింపఁగఁ గోరడే, యధరబింబంబును గ్రోలదేనియల్। పగరంగ్రోలి రమింపడే బహుతరభ్రాంతిన్ భవుండెంతయున్

పార్వతీపరమేశ్వర యోగఘటనకై మన్మథుని బ్రహ్మవిష్ణ్వాది దేవతలు ప్రార్థించుట.

తే॥గీ॥ ఆత్మనిష్ఠాగరిష్ఠుఁడై యల పురారి। యురుతపస్ఫూర్తినుండెను నుండుఁగాక। సంగమొనరింపఁ బార్వతీశంభులకును। బంచబాణుని శీఘ్రంబ పంపనలయు ॥ వ॥ అనినిశ్చయింపు మహారిబ్రహ్మేంద్రు లరవిందబాణునిం దలఁచిన ॥ క॥ కాంతామణి సహితుండై। కంతుఁడు శరచాపపాణి కవచియునగుచుం। జెంత వసంతుఁడు గొలువఁగ। సంతసమున వచ్చె దేవసన్నిధి కలమిన్ ॥ క॥ వచ్చి ప్రణామము చేయుచు। నచ్చట హరిముఖ్యదివిషదావళి కెల్లం। బచ్చనివిల్తుఁడు బల్కెన్। మచ్చికఁ దనరన్మరంద మంజులఫణితిన్ ॥ ఉ॥ ఏల నమందలంప జగదీశ్వరులార నిజంబు మీరలే। తెలుప గింకరుండనయి చేగఘటింతు సమస్తకార్యముల్। మేలుగఁ జెప్పు జగతి మిక్కిలి బాకు నసాధ్యమున్నదే। చాల భవత్కృపామహిమ చక్కఁగ నాయెడఁ గల్గియుండఁగన్ ॥ వ॥ అనిన హరియిట్లనియె ॥ క॥ మరువపుప్పశరాసన। చక్కఁగఁబలికెదవి నీకసాధ్యముగలదే। యొక్కఁడవైనం జగమున। నిక్కము సురహితముఁగూర్చ నేర్పుదలిర్పన్ ॥ క॥ స్త్రీపుంసవిరహమునుచును। బాపట్టినవిశ్వమిష్టసౌంపుదలిర్పన్। స్త్రీపుంసయోజనంబునఁ। గాపాడఁగవలయు నీవు గరుణానిధివై ॥ క॥ సవ్యాపసవ్యాత్మకతం। భవ్యములగు మాతృజనక భావంబులసం। భావ్యంబగు నిజ్జగమ్ముల। కవ్యయుఁడై యిందుమౌళి యఖిలాత్మకుడై ॥ క॥ జననీ భాగంబెంతయు। ఘనముగ నగతనయ యగుదుఁ గడు హిమశైలం బాయన భూరితపస్ఫురణను। దనతారను బ్రీతిచెలఁగఁ దలనకుమదిలోన్ ॥ క॥ ధరణీయు జనకభాగమును। హరుఁడా కైలాసమున్దు వ్యగ్రోత్కటలం। బరదారసాశ్రయింపుచుఁ। బరమజ్ఞానైకనిష్ఠఁ బరగుంత్రేమన్ ॥ క॥ తారకపురమను యోగము। వారక ఘటియించి నేని వనటఁ దొలంగన్। సారెకు నీ జగమంతయు। తారయ బహువీర్యవంతమై మనమెనుచున్ ॥ క॥ కుసుమముల చేత నర్చనఁ। జేసెఁగంగాఁ జేసినట్లు మరహితమీవు। గుసుమాస్త్రంబులు నింపుము। గుసుమాయుధ నీదు బటిమఁ గొనియాడనగున్ ॥ చ॥ కుసుమకోదండ పటుప్రతాపమహిమన్ బాపట్టి నీవిప్పుడా। బ్రమథాధ్యక్షుఁ మహాతపస్స్ఫురణ నాపాలాక్షు నాసాగ్రసం। ఘమున్మన్మథుదిగాడ నేని గిరిజాకాంతాపరిరంభసఁ। భ్రమలోలుండగఁ జేయు మాకుహితమున్బాటిల్ల నెంతేనియున్ ॥ వ॥ అని పంచాయుధుండు వచించిన బంచశరుండిట్లనియె ॥ శా॥ ఎవ్వని సత్కృపామహిమ నేనుజయంబున గాంతునాశివ। న్నెవ్వగఁబొందఁజేసి శరనిష్ఠురతన్గడు ద్రోహి నాదునే। యెవ్వడు స్వామిపట్ల మదిన్ సత్ద్రోహము బూనువానికిం। దవ్వు బరంబులేను మంగళత్వముగా నిహలోకసౌఖ్యముల్ ॥ వ॥ అదియట్లుండనిమ్ము ॥ మ॥ నిటలాక్షుం డిసమాన రౌద్రుఁడు సముద్యద్రప్రతాపోజ్జ్వలుం। డక్షగూత్తేక్షణుఁ బాడ నాక్షణమునందాఖిలమై పర్వత। చ్చటులోగ్రాలికవిస్ఫురద్ధగధగజ్జ్వాలాచ్ఛటవ్యాప్తి నే। నెటులం దాళుదు నీకుతో నెదురఁగానెవ్వారిన్ శక్యమే ॥ సీ॥ బంధురరకలిత



బాతెంచ ధరమీదఁ బాఱునే నాపద్మబాణమిదియు। భాస్వరప్రౌఢిమ భాస్వన్మహానిమీద దూరనే సాకల్యతూపు వేగ। భూరివిస్ఫురణను భుజగభూషణుమీఁద బరగునే నామంద పవనరథము। చండతరస్ఫూర్తి దండధరారిపై వనరునే నా లసద్ధర్మపటిమ। ప్రణుతిమందారు నీశ్వరుఁ బ్రతిఘటింప। నెంతవాఁడను నాకది హితముగాదు। శంకరునిఁదక్క నితరుల జగతిగెల్తుఁ। బంపు మెచ్చటికయినను బద్మనాభ ॥ తే॥గీ॥ పుష్పబాణంబు విడుచుట పూజలోఁడ। సరియటంచును బలుకంగఁ జనునె మీకు। నురుదయాంబుధి యిందుశేఖరుఁడు గానునె। భావవర్జితమైనట్టి ప్రసవమిలను ॥ క॥ సూనంబేనియు క్షీరం। బేనియు శంభునకుదియొ యభీష్టకరంబు। స్థానేరదు భోభావది। హీనంబుగ జగతినెన్నఁడేని నణంగున్ ॥ క॥ ఈవసుమతి తృణగుల్మల। తావలియైనను బ్రబలమైనను గానీ। దేవునకుఁ బ్రీతిఁ జేయును। భావపురస్సరముగాఁగ భక్తుఁడొసంగన్ ॥ తే॥గీ॥ తొల్లి ధేనుగణంబులు దోరముగను। భానరహితంబులగుచును బాలుగురియ। హరునకు ప్రియంబులై యాక్షణంబ। గోగణంబుల నాపదఁ గుందఁజేసె ॥ వ॥ అనుడు మీనకేతనువచనంబులువిని విబుధులావృత్తాంతంబెట్లని యడిగిన నతండిట్లనియె ॥ మ॥ ప్రణుతుల్ సేయ మరుద్గణంబులునటింపన్ రుద్రకన్యాప్సరోగణముల్ నందియు భృంగి చెంగటఁ జెలంగన్ లోకమాతన్ శివన్। మణిభూషాన్వితఁ జేసి వేడుకనుమున్ మంథాద్రిభోగింద్రకం। కణుఁడుండెన్మణిభద్రపీఠిగొలువై కాతూహలంబొప్పఁగన్ ॥ వ॥ ఆసమయంబున ॥ క॥ వెంబడి రా దితియదితియు। నంబుజసంభవ కుమారుఁడల కశ్యపుఁడి। ష్టంబుగఁ బ్రార్థితుఁడగుచును। నంబుగ వరుణాలయంబునకుఁ జనుదెంచెన్ ॥ క॥ చనుదెంచి కూర్మితో నా। తని సంప్రార్థించెఁదనవు దశగోనువులన్। ఘనమతి నాతండొసఁగెను। గొన్నమని బహుధేనుతతులఁ గోరికమీఱన్ ॥ వ॥ అంత ॥ క॥ వనితాయుతుఁడై పద్మజ। తనయుండు బయస్వినీధేనుతతులను దండం। బునఁ దోలుకొనుచు మెల్లన। జనలోకముదాయఁ జనియెసంతసమెసఁగన్ ॥ వ॥ అట్లు జనుసమయంబునగోవ్రాతంబులు పక్షసమేతంబులై స్వైరవిహారంబుల నింగిం జెలంగుచుఁ బయోధరధారల వర్షింపనూలోకంబున నదీనదతటాకంబులు బరిపూర్ణంబులయ్యె మఱియు నమ్మంథరంబున నున్నమహేశ్వరుని మీదక్షీరవర్షంబులు గురిసిన నది యప్రియంబులుగాఁ దలంచి కోపవీక్షణంబునం గనుంగొనిన నాక్షణంబున గోసంఘంబులు భస్మీభూతంబులై కూలెనది కావున నీశ్వరుండు క్షీరాభిషేకప్రియుండని మునులు వచించుట మాత్రంబుగాని భావపూతంబుగానిది యతనికి హితంబుకానేరదు. భావపూతంబు నేని చండకోదండతాడనంబైనను బ్రియంబగుచుండు ॥ క॥ కావునఁ ద్రిపురాంతకుపై। భావవిహీనంబుగాఁగఁ బ్రసవంబునుప। న్నేవెఱతుఁ దప్పునైపుఁడు। మీవచనంబిప్పుడు నాకు మీఱఁగవలసెన్ ॥ వ॥ అనిన బంచాస్త్రునిఁజూచి విరించియిట్లనియె ॥ మ॥ చలమా సూనశరాస లోకహితమై సర్వామరప్రీతముల్। బలుమాఱున్ హరియున్ మనోజ్ఞఫణితిం బ్రార్థింపఁ గర్వస్థితిం। దలపంబూనవు కూలిధర్మవిధుఁడే దండించునేనిన్ను నీ। విలఁజేతోఁజుఁడవయ్యె నార్థితయుఁ లేంతేలఁ గానన్యమున్ ॥

మన్మథుఁడు నిజపరాక్రమము బ్రహ్మకుఁ దెలిపించుట.

వ॥ అనిన విని పద్మజుబలుకులకుఁ బద్మబాణుండిట్లనియె ॥ క॥ అసమాంబకుమీఁదనునా

యసమాంబకరతులు బఱపదె నా తరమా। సురాసురమగు భువిని। ననద్యశముగ గెల్తుఁగాని యద్భుతమొప్పన్॥ వ॥ వినుడు సకలాండజ స్వేదజోద్భిజ్జ జరాయుజ జంతుజాలంబులందు మచ్చరాహతిఁ గుందనియది లేదది యట్లుండనిమ్ము॥ సీ॥ దారుకావనిలోనఁ దాపసాళిని మోహిణీసక్తిఁ జేసితి నేనె కాదె। మురవైరికిని జలంధరకామినీ కేళి నిరతిఁ గావించితి నేనె కాదె। వసుదేవసూనుని వ్రజవధూటీకామిగా నొనర్చితిఁ బ్రేమ నేనె కాదె। వరుణునికాంతపై వలపుఁ బుట్టించితి నెమ్మది నగ్నికి నేనె కాదె। సంజ్ఞతోఁ బలె ఛాయతో జలజబంధుఁ। బొందఁ జేసితి నూఱేండ్లు పొసఁగ నేనె। కాదె యంబరీషుని కన్యఁ గవయ హరిని। నిశిత శరహతుఁ జేసితి నేనె కాదె॥

క॥ సురముని మునుపర్వతముని। వరు నెన్నం చింప భువనవర్ణవిలాస। స్వరగుణ స్పృంజయుకన్యన్। వరియింపఁ జేసె మచ్చ రాఘువారితుఁడగుచున్॥ వ॥ మఱియును॥ సీ॥ అవలీలగా నహల్యకావిఁ జేయనే పరఁగఁ బులోమజా ప్రాణవిభునిఁ। గడు బృహస్పతిపత్నిఁ గామింపఁ జేయనే బెదరించి కుముదినీప్రియుని మున్నుఁ। దాసకన్యాసక్తిఁ దనరారఁ జేయనే యల్ల పరాశరు నంతవాని। మేనకారతికేళి మిగులఁ దేలింపనే మహిని విశ్వామిత్రమౌనివరుని। మఱియు నిన్నును నా శౌర్యమహిమ మీఱఁ। బుత్రికను గూడఁ జేయనే భూరిలీల। మఱి నితో పద్మభవ చంద్రమౌళి దక్షశాకసాధ్యుఁడు గలఁడె యుల్లోకములను॥ క॥ జగములకుఁ గర్తభర్తుఁడు। దనభర్తయు భర్తయతఁడె దైవంబతఁడే। యగు భయమాతనిపై తెగఁ। దెగుదున్ జిఱయేరినైనఁ ద్రిభువనమందున్॥ వ॥ అనినననంగజుని యనంగీకార వచనంబులకు నంతరంగంబున గోపంబొదవ మఱియు నలువయిట్లనిరి॥ క॥ లోకహితంబుగఁ దలిపిన। నీకేల హితంబుగాదు నిర్మలహృదయుల్। లోకోపకార మహిమను। జేకొందురు కీర్తి జగతిఁ జెన్నలరారన్॥ క॥ అస్థిరమవు తనువందుల। నాస్తను వర్జించి ధీరులర్థులకు ఘనస్వస్తతఘటింతురెంతయు। సుస్థిరతరకీర్తి దేహశోభితులగుచున్॥ క॥ అర్థిజనంబులు వేడిన। నర్థప్రాణంబులొసఁగి యనఘాత్ములమున్। సార్థకజన్మతఁ గాంచరె। ప్రార్థించిన నేలవినవు బరహితమిదియున్॥ సీ॥ వాసవుఁడడిగిన వజ్రాయుధము గా వెన్నెముక నొసంగఁడే యలదధీచి। కడుఁ గపోతము వేఁడ నొసఁగ మాంసముఁ గోసి శిబిరాజు దానంబు జేయలేదె। వామను వేఁడ్కింప వారక భువనంబులెలమిఁ గొమ్మని బలియియ్యలేదె। కానీనుఁ డెంతయు కవచకుండలములు ప్రేమతో వ్రక్కలింపలేదె। ధరణి మఱియొందఱేని యాదార్యగుణులు। బరహితంబును జేతురావదలనైన। నేలనీకింత కృపణతయిపుడు బొడమె। జాత్మలజ్జయువారి ప్రఖ్యాతివినియు॥ క॥ స్మరనీకు సమంబగును। స్మరునిన్నెన్నెందుఁ గాన జనులకునీవు। స్వరమ ద్వేషివి మొదలనె। పరహితకరునైక బుద్ధి పరగునె నీకున్॥ క॥ గిరులున్వనములు ధరణికి। భరములుగావర్థి వచ్చి ప్రార్థించినచోఁ। బరహితమొకింతఁ జేయకఁ। బరగెడు వాఁడొకఁడు సుమ్మె భారము మిగులన్॥ క॥ తెలుపంగవచ్చు నజ్ఞునిఁ। దెలుపందరముగు విశేషధీశాలినిలం। దెలిసియుఁ దెలియని కుమతినిఁ। దెలుపఁగ నెవ్వానివశము త్రిభువనములలోన్॥ వ॥ అని బహువిధంబులం బరుషతర భాషణంబులాడు భాషారమణుని వారించి పంచసాయకుని జూచి నారాయణుండిట్లనిరి॥ క॥ పరుగురికి నెద్దిహితమగు। నదియుం జేయంగ మెత్తురది చేయనిచో। పరుగురు నిందింతురుగద। మదవాయిది తెలిసి మదిని మఱినడువఁదగున్॥ క॥ నీకేల భయము మదిలో। శ్రీకరముగఁ గూర్పు శివుని



శితాద్రిజతోఁ। జేకూరు నభీష్టంబులు। నీకుం దత్కారుణచేత నిజముగ వినుమా॥ వ॥ అనిన గరుడధ్వజుండు మొదలైన త్రిదశులెందఱేనియుం దెలియఁ జెప్పిన నంగీకరించక పంచసాయకుండిట్లనియె॥ క॥ సర్వప్రకారములచే। సర్వేశ్వరుమీఁదఁ జూప సాహసమేనున్। గర్వాన్వితుఁడయి సకలసు। పర్వులబాధించు తారకాసురుని పైనన్॥ క॥ భ్రాతృయుతంబుగఁ గాంతా। వ్రాతంబులతోడ నతని వరశస్త్రహతుం। జేతురణ కేళిలోపల। నాతని బాధలకుఁ గాదె యల్పుండిదియున్॥ క॥ సర్వగురున్ సర్వేశ్వరు। సర్వజ్ఞుని సర్వసాక్షి జగదీశ్వరునిన్। శర్వునిలక్ష్యము సేయక। దోర్వీక్షణమ్మారిఁ జూపదురితము వడయున్॥ వ॥ అనిన నుగ్రుండగుచు లేచి యప్పద్మగర్భుండు గోపస్ఫురితాధరుండగుచు రూక్షేక్షణంబులఁ గర్ణపుటంబులకుఁ గటువులుగాఁ బలుకుచు శపింపం దలంచెనప్పుడు॥ క॥ దివిషత్తతి కోలాహల। రవములు దిక్తటులనిండెఁ బ్రతిధ్వనియై యా। ర్ణవఘనఘోషంబులకున్। భువిజనములు మూసెఁ గర్ణపుటయుగళంబుల్॥ వ॥ అంత బ్రహ్మశాపంబునకు భయపడి యంగీకరింపుచుఁ గంతుండు ప్రియకాంతయగు రతికి తద్వృత్తాంతంబెఱింగించిన॥ క॥ రతి సుదతియపుడు మనమున। నతిచింతాభరముఁ దోప ననియె విభునితో। క్షితిధర కోదండునిపై। ప్రతిభటత జయింపఁ బోవఁ బాడియె నీకున్॥ క॥ పురహరులకు నెదుట నిలుచుచుఁ। దరుణులు మాటాడఁ దగదు దగు నొకచోను। తత్తరమియ్యఁగ నెయ్యంబున। సరసత వినవేని విభుఁడు జవ్వనిపలుకున్॥ మ॥ సరసీజాసను శాపభీతి మదిలో సంధిల్ల పోబూనితే। హరునిస్త్యాగ్యనసీవు ఫాలతల దివ్యజ్వాలజాలంబు బరి। స్ఫురితోదార తపస్సురంధరుని నేర్పున్ మీఱ సాధింప నీతరమే దుష్కర కార్యభాగమిది యుక్తంబే నినుం బంపఁగన్॥ క॥ పరశక్తి నాత్మశక్తియు। నరయకఁ బరమేశు భర్గు నలికేక్షణు నే। కరణి జయించెదు దావక। సురదిరభుజ విక్రమంబు జూపుచు నెదుటన్॥ క॥ అవసానము గలదంబుజ। భవుఁడొసఁగెడు శాపమునకుఁ బరికింపఁగడున్। శివచరణ ద్రోహంబున। కవసానము లేదు సుమ్మె యనసీస్థలిలోన్॥ క॥ శివునకు నఖిలజగత్పతి। కవమానముఁ దలఁచినట్టి యతఁడు శుభంబుల్। భువిలోఁ గాంచఁగ నేరఁడు। వివిధ విపద్గ్రస్తుఁడగుచు వేగనశించున్॥ వ॥ అనినఁ బ్రియకాంతపలుకులకు లతాంతబాణుండిట్లనియె॥ క॥ తరుణీ సత్యము నీపలు। కరయఁగ నేమైన మేలె యర్థించినచో। సురకార్యంబిది చేయుట। ధరలో యుక్తంబుగాక దక్కవయగునే॥ క॥ అల్పమతి నస్మచేతను। గల్పాయువుఁ బొందుగంటేఁ గాలాంతకుచే। నల్పాయువైన మేలగు। జల్పాతిశయంబిఁ కేల సాధ్వి వినుమా॥ క॥ నాయందభిమానముచే। నేమొసలను గోపబుద్ధి నీశ్వరునంతుఱ। జేయుకు ముందఱ మనకున్। శ్రేయంబు ఘటిల్లుఁ జెవ్వె శీతాంశుముఖీ॥

మన్మథుఁడు సురాజ్ఞఁ గొని శివునిపై వెడలసన్నాహమొందుట.

వ॥ అనిరతిమారడించి పంచబాణుండు ప్రయాణోత్సుకుండగుచు హరి బ్రహ్మాది నిలింపగణంబులకు నమస్కరించి కృతాంజలియగుచు నిట్లనియె॥ క॥ మీయాజ్ఞ మీఱలేనను। బోయెద మాకొన్నెద నేగఁ బురహరుతోడన్। మీయాశీర్వాదంబులు। నాయందు ఫలించుఁ గాక నయమున రారన్॥ క॥ త్రిజగన్నాథను దేవిని। భుజగవరాభరణు మోహ మొందఁగఁ గూర్తు। న్వ్యాజయంబగు మీ కెంతయు। నిజమిది నా ప్రొద్దివినుఁడి నిర్జరులారా॥ మ॥ గిరిబాణాసనుఁడైన సాయకము లక్ష్మీ

వల్లభుండైన న। యీశ్వరగాఢ్యత్ముఁడు నూర్వియైన సవిపోవో యిక్షుచాపఁబూన। స్వేమయల్కాలీ మధులిగ్గుణధ్వనులు శీవిన్మి అ నిర్జింతు నా। హరిసన్ శ్రీమము నాశోసంగడు సముద్యక్రత్పైవముఁ దాంబూలమున్ ॥ క॥ తగనొప్ప నిశాతత్వము। బగలు జయించుట సరోజబాణము మతీసా మగటిమికిఁ గొదువ కలదె। యగజాశంభులను గూర్తు నంపుడు వేగన్ ॥ వ॥ అనిసమీనధ్వజాని వచనంబులకు మెచ్చి యచ్చతుర్భుజ చతుర్ముఖ నిఖిలామరగణంబు లభినవమందార మాల్యా దివ్యాంబరాభరణ సత్కారంబుల నాలింగనాదుల బహూకరింపుచు సంతృప్తునింజేసి పంచిన నతండు ప్రదక్షిణపూర్వకంబుగా నంపఁబడు నమస్కరించి సకలదేవతలు మునులు జయజయశబ్దంబుల దీవనలొసంగ జైత్రయాత్రోత్సాహ కలితుండగుటయు ॥ క॥ దివిజానీకము హరుపై। ధవునిం బంపుటయుఁ జూచి తాళక మదిలో। వివిధవ్యథలం బొందుచుఁ। బువువిల్తుని రాణి చిన్నఁబోవుచు నుండెన్ ॥ వ॥ అంతనక్కుసుమాయుధుండు మణికుండలాలంకృత కర్ణయుగళుండును, గనకకోటీర భాసుర శిరస్కుండును, ముక్తాహార విలసిత వక్షస్థలుండును, నవరత్నవిరాజిత కంకణకేయూరుండును, సుగంధసార చర్చావిరాజమాన దేహుండును, సంభృత కవచుండును, కౌస్తుభ కట్యాబద్ధ కటితటుండునునై నిజసౌందర్యాతిశయంబునంపఁబడు నయనారవింద నందకరంబగుచు వెలయుచుండు ॥ సీ॥ పొన్నపువ్వుకటారిఁ బూసఁగ వాడియొనర్చి చిగురునే బాణరాచికీలిఁ జేసి। కన్నెకేతకి శాఖ మిన్నగాసవరించి మరునంపు పూముల్కి సూటుపఱచి। మల్లెపూజముం జాలి మొల్లమిగావించి సంపెగ యడిదంబు సొంపమర్చి। విరితూపు పొదులును వెలయంగధరియించి కాలుకసింగాణి నై చెల్లఁగిఘూవి। పనరమధుకర శింజిని ధ్వనులు మిగుల। మొనసి యంచలు యలగోలు మోహరింప। వీరబృందంపు డెందముల్ వికలముగను। బంకజశరుండు శౌర్యనిశ్శంకుఁడగుచు ॥ ఉ॥ సన్నుతలీలఁ బత్మరుచి జాలముబర్వులునింపదిక్కులం। బన్నగమొప్పిల రాచిలుక పట్టపుతేజి వయాళిమించ తో। కన్నటియింపప వెంట రతికాంతిదయఁ రాఁగ వసంతయుక్తుఁడై। సన్నపుగాడ్పు తేరుపయి సంతసమెప్పఁగ నెక్కి సొంపుగన్ ॥ సీ॥ సస్తహూరాహార చటులోత్తికా ధ్వనుల్ రణభేరికా ధణంధణలు గాఁగఁ। గలకంఠకులకంఠ కాకలీస్వరములు బటుతర కాహళార్భటులు గాఁగఁ। బ్రకటిత మధుకరీపటల ఘూరితములై మల్లికాశంఖముల్ పెల్లుమ్రోయఁ। పాటలీకుసుమముల్ బలుసాగ సరములై మురవొప్పఁ దేంట్లచే మ్రోయుచుండ। మేటిజగడాలుఁ దులకించు మీనుడాలు। మేఘమండలమంతయు గ్రమ్మి నిగుడ। శారికా కీర కేకి మయూర హంస। జాలకోలాహలంబులు సందడిల్ల ॥ వ॥ ఇవ్విధంబున మీనకేతనుండు దక్షిణాభిముఖుండై కౌతుకధురీణుండగుచు వెడలి॥ మ॥ కనియెన్నిస్తులతుంగ శృంగము మరుద్గంధర్వ సిద్ధాప్సరో। జనవిద్యాధర సంకులంబును, ఋతివ్రాత సంసేవితం। బనుపానాతిరు మాన సౌరభ యుతంబున్ సర్వలోకైక పా। వన మిష్టార్థకరంబు నందుమనుటాఁ బాసంబుఁ గైలాసమున్ ॥ వ॥ కనితత్సమీపంబునఁ జేరఁబడిగ్గి యగ్గిరికిఁ బ్రదక్షిణంబుఁగావించి పంచబాణుడు పత్నీసమేతంబుగా నమస్కరింపుచుఁ బాదచారియై యయ్యుమేశ్వరం బధిరోహించెనంత ॥

వసంతఋతువర్ణనము.

ఉ॥ కాంతి దలిర్ప నంత రతికాంత నితాంత దురంత విక్రమా। క్రాంత వియుక్తకాంత



మతికాంత నగాంత లతాంత సౌరభా। క్రాంత వియద్దిగంతము నిరంతర కూజదనంత బంధురాక్రాంతము చానికాంతసమదంతము మించె వసంతకాంతయున్ ॥ సీ॥ గండుకోయిలలకుఁ బండుగకజ్జంబు మాధవస్వామి కెంబట్టుగొడుగు। విరహిణీ తతినేచు విస్ఫురజ్జ్వాలిక తరుమహీధర శకద్ధాతురక్తి। వనదేవతాంగనా కరశోణవసనంబు కాముని పద్మరాగంపు మాలి। సమయతాపసశిరస్థఘుసృణజడగుంపు కొమ్మదిద్దియ దాల్చుకుంకుమంబు। శ్వేతనీలప్రభాన్వితభృంగపటలి। గగనలక్షిత సాంధ్యరాగంబనంగ। సొంపుఁదళుకొత్తఁ జిగురాకు జొంపమపుడు। బలుగఁవనసీమ నరుణిమ భాసిలంగ ॥ లయగ్రాహి॥ అందమగు మావముల జిందుమకరందములు తుందములనించుచు నమందతరలీలం। గందళిత ఝంకృతులఁ గ్రందుకొని వీనులకు విందొనరఁజేయుచు మిళిందవతతులాడన్। ముందరను కందరను బొందుగను దాల్చిన పురందర మణిద్యుతుల చందము రహింపన్ మందపవమానుఁ డరవింద నవకుంద సుమబృంద శుభగంధ భరతుందిలత వీచెన్ ॥ మత్తకోకిల॥ లోకమందు వియోగియావత లోకమాత్మనిరంతర। స్తోక భీతివణంక నైంతియుఁ శ్రోత్రయుగ్మకఠోరమై। పాంథకప్రసవాయుధాహవ భవ్యకాహళులో యనం। గాకలీరవముల్ జెలంగఁబికంబులెల్లెడ భాసిలెన్ ॥ పంచచామరము ॥ సెరాసిరాచిరంగుసొంపు నింపు కెంపుముక్కుటన్। మెరించ పచ్చడాలు మిన్నుమానికంబు పేల్। మరాళమై మెఱుంగు గుల్కుముద్దులొల్కు పల్కులన్। విరాళిఁజేసె చిల్కగుంపు వేగ పాంథరాజికిన్ ॥ మ॥ అలరంజెంత వసంతకాంతుఁడు నితాంతామోదమింపొందఁగా। లలితోదార లతాంతాంగుల సులీలప్రౌఢిమబ్బొందుచో। వెలయన్మొగ్గలపేర గుబ్బలను తీవిన్నించు కస్తూరికా। దళరేఖావలి నాఁ జెలంగె నళిబృందంబుల్ వనాంతంబులన్ ॥ క॥ ఘనతరముగ రతికేళిం। బెనగుచు వనికావధూటి మేనవసంతుం। డునుచు నఖక్షతములు నా। దనరారె పలాశముకుళ తండంబులొగిన్ ॥ చ॥ స్థిరముగ నీశ్వరాంఘ్రి సరసీరుహభావనఁజేయు దాపసో। త్కరములఁ దక్క సర్వమృగతండము పై సకలద్రుమాళిపై। స్ఫురణఁదలిర్పఁ జూపయిన మాబళరంబును గూర్చియేసె న। మ్మరుఁడు సమస్తజంతువుల మాటికిమోహముఁనొందఁ జేయుచున్ ॥ సీ॥ మొగడుచన్నుల నిగ్గుమురువుగుల్కనటించెఁ బాటలియామోద భరితయగుచు। సరసాళిపాడఁగా వరుసపల్లవరక్తి మాధవియామోద మహిమవెలసెఁ। జిలుకపల్కులఘుఁ జెలువుగుల్కరహించెఁ బుష్పిణియగుచును బొగడకొమ్మ। కలకంఠగానంబు గౌతుకంబుఘటింప లలితరసాలవల్లరి చెలంగె। గరిమ లతలూనలెల్ల నుత్కలికలొప్పఁ। గలిత పున్నాగయోగంబు గాంచిమించె। బంధురంబుగ విటపసంబంధమలర। కరముశోకంపు కొమ్మరాగంబుఁదనరె ॥ క॥ మామగ రాగబలంబున। మానసములు నిల్పరపుడు మహనీయాత్మ। ధ్యానపరిష్ఠతఁ జెలఁగుచు। మానులుచలియింప కతను మార్గణతతికిన్ ॥ సీ॥ కిన్నరకిన్నరీ కేళీవిహారంబు గింపురుషద్వయీ క్రీడనంబు। శుకశుకీ భాసురసురతప్రసంగంబు పికపికీమండలి ప్రేమభరము। ప్రకటకేకీకేక పరిరంభగమకంబు మృగమృగీ బంధురమేళనంబు। సమదభృంగీభృంగ సరససల్లాపంబు సారససారసీ సంభ్రమంబు। సిద్ధమిథున మనోజాతచేష్టితంబు। జనితగంధర్వదంపతీస్మరవినోద। మఖిలవిద్యాధర ద్వంద్వమదవిలాస। మగుచుఁ దిలకింపఁబడెఁ దద్వనాంతమపుడు ॥ తే॥గీ॥ అంతనంనీశ్వరుఁడు నేత్రమర్త్యుఁడగుచు। దండను జరింప ప్రమథ బృందములఁజూచి। చపలతను మానుఁడనుచుఁ గైసన్నఁ

జేసి। కరముశిక్షించెఁ గోపవిస్ఫురణ మీఱ॥ వ॥ తచ్చాపసనంబున నిష్కంపభూరుహ నివహంబును, నిశ్శబ్ద మధుకర నివహంబును, మూకాఖిల శకుని కులంబును, భ్రమిత మృగప్రచారంబును నై యవ్వనంబంతయుఁ జిత్రలిఖిత వనంబు కరణినయ్యెనంత॥

మన్మథుఁడు నందీశ్వరునకు నిజాగమన కారణంబు నివేదించుట.

క॥ తనశరము విఫలమగుచును। ఘనతరమగు లజ్జతోడఁ గందర్పుఁడు దా। మనమున భయపడి నందినిఁ। గనుఁగొని యతివినయభక్తి కలితుండగుచున్॥ వ॥ తత్పాదాంబుజంబులకు నమస్కరింపుచు నిట్లనియె॥ క॥ గోవిందుఁడు విధిమొదలుగ। దేవతలందఱును దేవదేవు మహేశున్। సేవించి కూరపద్మని। చే శేధయుఁ దెలుప విను మిపుఁడిట్లనియెన్॥ క॥ సురలార వినుఁగు జెప్పెదఁ। బరమస్థిరభక్తి కూరపద్ముఁడు నన్నుం। జిరతరమారాధించిన। కరుణన్ మన్నించి వాని కామితమొదవన్॥ తే॥గీ॥ జగతినష్టోత్తర సహస్రసంఖ్యఁ దనరు। పద్మజాండములకు నాథపత్యమొసఁగి। పెక్కునిండోక వరమును వేఁడుమనుడు। హర్షమిగురొత్త దానవాధ్యక్షుఁ డపుడు॥ శా॥ నీకుంబుట్టినవాఁడు దక్కదివిజానీకంబు చే హానియున్। రాకుండన్ దయచేయుమంచు వరమున్ బ్రార్థింపఁ గావించితిన్। నీకిం కేటికి శౌర్యసంబుపదిలో వీరోక్కసిద్ధింప న। స్తోకప్రాభవు బాహులేయుఁ దనయున్ సొంపొందఁ గల్పించెదన్। తే.గీ॥ అతనిచేతను దనుజాన కీకుమవాని। స్వస్థతను బొందిమీరలు జనుఁడటంచుఁ। బలికి యంతర్హితుండయ్యె భర్గుఁడంత। వేల్పులెల్లరునన్నును వేగఁ బిలిచి॥ తే॥గీ॥ చిద్విలాసంబు గనుపట్టి శివుఁడుదాను। మునులకెల్లను దక్షిణామూర్తియగుచు। నాత్మవిజ్ఞాన మపదేశమలరఁ జేయు। సంతతంబును గైలాసశైలమునను॥ క॥ దేవియు హిమవన్నగమున। భావంబున విభుని పాదపద్మద్వయమున్। సేవింపుచుఁ జిరభక్తినిఁ। బావనముగ భూరితపము బాయక సలుపున్॥ క॥ గిరిజాసంయోగంబా। హరునకు ఘటియింపుమనుచు నంపుటవిటకే। సురకార్యార్థము వచ్చితి। శరణాగతు నన్ను బ్రోవు సత్కృప తోడన్॥ క॥ గురువుగ దైనంబీవె। పరఁగఁగ దలివంద్రుఁడీవె భాగ్యంబీవె। కరుణఘటింపఁగఁ జేయుము। తిరుగేండువతంసు సన్నిధానము నాకున్॥ క॥ అని సుకుమారుఁడు మారుఁడు। వినయంపుర స్వరముగాఁగ వేఁడిన నంతే। విని కరుణ నందికేశ్వరుఁ। డనిరొం దలపోసి యీశ్వరాజ్ఞను మదిలోన్॥ క॥ నాకంబెఁ బ్రియుండ వెన్నఁగ। శ్రీకంఠునకీవు పొమ్ము శివసన్నిధికిం। జేకూరు దేవకార్యము। శ్రీకరసుకుమార మార చెప్పెద వినుమా॥ క॥ పడమటివాకిలి దారిఁ। దడఁబడకన్నుం డుము సావధానము గాఁగన్। మృడునిమతీమయధామముఁ। గడుఁగన్నులపండువుగను గనుమాతేగన్॥ వ॥ అని నందియానతిచ్చినఁ దద్వచనప్రకారంబునఁ బంచశరుండు దక్షిణద్వారంబు దాటి దివిజులడుగడుగునకుఁ గన్నునాశీర్వదింపుచు దివి విలోకింపం బడమటిద్వారంబునం బరమేశ్వరభవనంబు బ్రవేశించి యందు॥ సీ॥ యోగీంద్రవంద్యుఁడై యొప్పుచుండెడువాని। వీరాసనంబున నెలయువాని। స్ఫటికమణిప్రభా స్వచ్ఛదేహమువానిఁ। బన్నగభూషణావళులవాని। వరయోగపట్టంబు బరఁగదాల్చినవాని। వ్యాఘ్రచర్మోత్తరీయంబువాని। నాసాగ్రమున దృష్టి నాటియుండెడువాని। వాగగోచర వైభవంబువాని। నిస్తరంగసముద్రాభు నిగమవేద్యు। నిత్యు సత్యు చిదానందు నిర్వికల్పు। స్వప్రభాభాసిత కృశానశశిదినేశు। సర్వకర్తను సర్వజ్ఞు సర్వగుణయుని॥ మ॥ భుజగోన్నద్ధజ



టాశితో సువిలసన్మూర్తి ప్రభాదోత్సన్నతో। గజచర్మాంబరదీప్తితో జలదరేఖాశ్యామ కంఠంబుతో। నిజనిష్ఠన్ వెలుఁగొందు నిందుధరునిన్ వీక్షించి కంపింపుచున్। భుజవిస్రస్తశరాసనాంబకుఁడు నా తప్పస్త్రీఁ దత్యంతమున్॥ వ॥ మఱియు నిట్లూర్పులు జనియింప నిర్వేణ్యుండయ్యె నప్పుడప్పతినిఁ గని రతికాంత చింతాక్రాంతయగుచు నాత్మగతంబున॥ ఉ॥ నాటినదుర్మతి న్వినక నా పలుకెంతయు లచ్చిరజ్జియి। ల్లోటికివచ్చె మార్గమున నీశ్వరుమాఱొక్కన దీనసేసుము। న్నాటిలునే జముండితని పాలయి పోవఁగ నేమిలెక్కమా। బోటులు దల్లికిం గణియుగఁ బుట్టుట యిందు శుభంబు బొందినన్॥ వ॥ అని తనపగువమిగుల వగలఁ బొగలఁ జిగురువిలుకాఁడు మగుడిసంజాతచేతన్యుండై వేపమానతనుండగుచు ధనుర్బాణంబులు పాణిపద్మంబున గీలించి సవిధప్రదేశంబున భాసిల్లునమేరు భూరుహావనంబున నణంగి॥ మ॥ శ్రవణాంతఃప్రకటీకృతైక్షవధను ర్జ్యాన్యూష్టిఁ గావింపుచుం। బువిల్తుండు సమగ్రబాహాబలమున్ బొల్పొంద సమ్మోహనా। స్త్రవరంబున్ గొని యోగిపఙ్క్తికి నలక్ష్యంబై విరాజిల్లు నా। శివునిన్ లక్ష్యము జేసి యేయుతఱినిం జింతాకులస్వాంతుఁడై॥ మ॥ సుర బృందంబులు బంపఁగా నగుసె యిట్లొచ్చెనున్న శాకేల నీ। గురితప్రక్రియ వామభాగమునఁ దోడ్తో బాహువు స్నేత్రముం। గ్ఫురితంబై పలుదుర్నిమిత్తములొగిం జూపట్టె నేమఁబునే। కరణింబొందుదు నీకుతోనిపుడు సంగ్రామంబుఁ గావింపుచున్॥ మ॥ అదియట్లుండఁగ నిమ్ము జింతనిఁక నీయన్ బాదుమే లైనను। దుదిసేమైనను మందిదే శివునినిందుస్నేను నేత్రోత్సవం। బాదవస్థాంచితుఁ బాలు జూకిదియె ధన్యుండన్ని జంతేసు.స। త్పదవిన్ బొందితి నంచుఁ దా నిమిషమాత్రంబున్ బ్రహృష్టాత్ముఁడై॥ వ॥ మఱియు నవ్వీరుండు సమ్మోహనమహామంత్రంబు జపించుచుండె నప్పుడు హరివిధిప్రముఖ సురగణంబులు గాముసకు స్వస్తియగును గాక యని సారెజపింపుచుండిరా సమయంబున॥

శివఫాలనేత్రానలంబున మన్మథుండు దగ్ధుండగుట.

మ॥ క్షితిభృచ్చాప నిటాలనేత్రహుత భుక్కీలంబు దుర్వారమై। ప్రతికూలించి నమేరు భూరుహావనిం భాసిల్లు నక్కుండలీ। కృతకోదండుని పుష్పకాండుని పయిన్ దీపించు సఁధిల్ల న। య్యతనుం డప్పుడు భస్మమై పడియె దుర్వ్యస్తాన సౌకఃక్రియన్॥ క॥ పడిపడిన మోహవశతన్। రతి మూర్ఛను బొందెఁ గర్పూరద్యుతిధూమ। ప్రతతులు దెసలనునిండెను। హతవాంఛులు నగుచు స్రుక్కిరమరులునింగిన్॥ క॥ ఇదియొండు తెలియకంతయు। మదమున సనకాదిదివ్యముని సంఘములో। విదితముగ యోగనిష్ఠను। గదలక శంభుఁడు యథాప్రకారము నుండెన్॥ వ॥ అంత హరివిరించి ప్రముఖ నిఖిలదేవగణంబులు కైలాసగిరిశిఖరంబధిరోహించి పరమేశ్వరునకు నమస్కరింపుచు మూర్ధతటంబుల నంజలీపుటంబులు ఘటించి సర్వకర్తయు, సర్వకారణుండును, సర్వజ్ఞుండును, గామారియుఁ గామితార్థప్రదుండును నైనయమ్మహాదేవుని యిట్లని స్తుతించిరి॥ ఉ॥ ఎవ్వనివల్లఁబుట్టు జగమెల్లను సంతతిమున్ బ్రవర్ధనం। బెవ్వనివల్ల లీనమగు నెవ్వనియందు ధృవంబనుగ్రహం। బెవ్వనివల్ల సర్వమిది యెవ్వనివల్లఁ దిరోహితంబు నా। నవ్విభు దేవదేవు నిను నార్థభజించెద మేము భక్తితోన్॥ క॥ అంధక మదికిన్వ్యాకుల। కంధక జ్ఞానేంద్రియములకందఁగఁ బరమా। నందంబై తగునెవ్వఁడు। వందనమగు నట్టినీకు వాంఛితమొదవన్॥ క॥ అతనుఁడు నిజాయుధంబులు। వితథములై స్మరణమాత్ర విషయుండయ్యెన్। క్షితినెవ్వరిచే నా నిను। సతతం

బు భజింతుమయ్యా సద్భక్తిమదిన్ ॥ క॥ జ్ఞానమనంతము సత్యం। బానందమటంచుఁ బలుకఁగా నగము శిఖలన్। మానుగనెవ్వనినిరతం। బానీశునమస్కరింతుమయ్య మహేశా॥ క॥ నానాగమ మూలంబును। నానాగమసారమైకనంబడు నెవ్వాఁ। డానీలగ్రీవుని నిను। మానసమునఁ దలఁతుమయ్య మానితభక్తిన్.॥ సీ॥ బ్రహ్మస్వరూపమై భాసిల్లు నెవ్వాఁడు భూతాత్ముఁ డెవ్వాఁడు బొలుపుమీఱ। సర్వజంతువులకు సౌహార్ద మెవ్వాఁడు విశ్వాధికుండునై వెలయు నెవ్వఁ। డఖిలనియామకుండరయంగ నెవ్వాఁడు సన్మాత్రమెవ్వాఁడు సన్నుతింప। జన్మలయంబులు సంతోషములు గాంచు గరిమ నెవ్వనిచే జగంబులెల్ల। నట్టి పరమాత్ముఁ బరమకళ్యాణనిధిని। నిన్ను భజియించెదము నీరనిధివిషేపు। శికరములుసురాసురశ్రేణి యరయ। నార్తులనుమమ్ము రక్షింపవయ్య దేవ॥ వ॥ అనియిట్లు బహువిధంబుల శ్రుతి లక్షణంబులైన స్తుతులం బొగడుచు సురలు బహిర్ద్వారంబాశ్రయించి యున్నంతనంతఃపురగతుండై శివుండిదియేమి కోలాహలంబనిన నందికేశ్వరుండిట్లనియె ॥ శా॥ దేవా విష్ణు పురోగముల్ సురలు మీదివ్యాంఘ్రిపద్మద్వయీ। సేవన్గోరుచు వచ్చినారిపుడు గాసింజెంది దైతేయుచే। భావంబందు గృపారసంబు దనరన్బాలింపుమీ వేల్పుల। న్నీ వేడిక్కనినమ్మినారు మదిలోనిక్కంబు లోకేశ్వరా॥ వ॥ అనినంబీశ్వరుండు విన్నవించిన నిందుశేఖరుండానందంబున॥ క॥ శైలాది! సురలనిలుసగ। నేలాహో తెమ్ము వేగమిచ్చటి కనుడున్। శైలాదియుంత నిర్జర। జాలంబును దోడితెచ్చె సన్నిధి కపుడున్ ॥ వ॥ ఇట్లు శివసన్నిధానంబుఁ జేరి కృతప్రణాములైన యా దేవతలను నమ్మహాదేవుండనలోకించి భవదీయస్తవంబులఁ బ్రీతుండనైతి మీకభీష్టంబెయ్యది వేడుడని యాదరించి మీరుజేసిన యీస్తవంబత్యుత్తమంబు దీనిపఠించిన వికలకల్మషులగుచు మనుజాలు మర్గ్యధంబులునైన కామంబులం బొందుదురనిన నిలింపులు బ్రహృష్టాంతరంగులగుచున్న శ్వేశ్వరునకుఁ బునఃపునఃప్రణామంబులు జేసి దేవా పూర్వమందు మీరానతిచ్చిన ప్రకారంబునం దనుజబాధ నివారకుండగు సేనానిం గటాక్షింపుడని ప్రార్థించిన॥ క॥ వరహాసమొప్పనిట్లను। హరుఁడా దివిజులనుజూచి యగుమీకనుస। త్వరముగఁగోరిన యదిమీ। కరయుదుకొన్నాఁ శ్ర్యవలవదార్తత మదిలోన్॥ వ॥ అనిసుధామధురోక్తుల నాదరింపుచు సుధాకరశేఖరుండును వేల్పుల వీడ్కొనియె నాసమయంబున త్రిపురహర ఫాలానలహవ్యంబైన వశిష్టానక రతికాంతయత్యంత చింతాక్రాంతస్వాంత యగుచు॥

## భర్తృవియోగంబున రతీదేవిశోకించుట

క॥ హా నాథ హా సుమాయుధ। యీనేలను నీకు వ్రాసెనో విధియకటా। యేనెందుఁ జొత్తునవ్వి। నేనుం శరియింతు శోకనిధి నిపుడున్ ॥క॥ నామాట వినకఁ బోయితి। నీమగటిమి హరు నెదిరింగుట నిలుచునె యహహా। యేమందు నీదుబుద్ధికి। నోమదనా నిన్నుఁ బాయనోర్తునె క్షణమున్ ॥క॥ కోకిలలకుడిగె బీరము। గేకిశదంబకము వీడెఁ గీరములోడెన్। రాకాచంద్రవసంతులు। జీకాకై పోయిరింతఁ జేసితె నాథా ॥క॥ ఉపమింతురు నీయందం। బెపుడును ఘనసుమారవర్గు



కిజ్జగయున నీ। వపగతదేహుండవగునో। నుపమానంబెవ్వరింక నొగినర్థింపన్ ॥సీ॥ నాశేయుదప్పేమి నను బాయు నుచితమే తల్లియు దండ్రియో తనకునిపుడు। దిక్కెవ్వరింకను దిక్కునీవనియుంటిఁ బడితి వేయీశ్వర ఫాలవహ్ని। నీటఁబాసిన యట్టినీరజంబునుబోలె నే నెట్లు జీవింతు నిన్నువిడిచి। దర్శనంబీయవు దయ తప్పె నేనీకు తోడింకగతియగు నేఁడు నాథ। నీవుబోయిన చోటికి నేను వత్తు। నిన్నుబాసి సహింతునే నిమిషమైన। నేలయీజన్మ మీరూప మేలయింక। హా మనోనాథ హా హా రతియధీశ॥మ॥తనకర్ణోత్పలతాడనంబు భవదాత్మస్నేరమైతోచెనో। తనయుత్సంగముఁ బాయు నత్తరి సముద్యస్తేమలోద్దామబం। ధనముం జేయుట తప్పుగాఁ దలచితో తన్నేలఁ బాయంగ నీ। వనమాత్మాక్షమియింపు సత్కృపను నాయజ్ఞాన కృత్యంబులన్ ॥ క॥ ఏయెడల నీవునన్నుం। బాయక వసియింతునను దు మదినమ్మినఁ బోయె నసత్యంబై తగు। నా యెద్దియు సత్యమంచు నమ్మనునింకన్ ॥ క॥ పరభృత కేకి కులంబును। బరగన్ రతిదౌత్యము నమ్మఁబంపుదు వకటా। సురుచిర వైఖరి నిపుడున్। స్మర యాదేశింపవేల చయ్యన వానిన్ ॥ క॥ మైనీవలంకరించిన। నూనంబులు వాడలేదు కుసుమసాయక యీ। లోననె పోయితె పురహర। మానితనిటలాగ్ని దహ్యమానుఁడవగుచున్ ॥ చ॥ పరసుతు నిన్ను నాయమరు పంపఁగ వారణకర్తవైనయీ। సురలకటా యగాధ పరిశోధన కైవడి నొంటిబిడ్డచే। సరసిజగర్భు శాపభయసంగతి నాపలుకింతయైన యీ। దరమునఁజేర్ప వైతి చెవి దైనము జేసెనె యింతకార్యమున్ ॥ క॥ తలపడిన చోటఁ బావము। నిలుచును నీదంవ వినవ నేరని కేనుం। జెలువుఁడ నాపలుకొండెను। దలఁపకఁ బోయితి శుభప్రదంబని మదిలోన్ ॥ క॥ దైవవశంబని మాధులు। భావింపలోకింత బాహుబలదర్పముచే। భావజుఁడు ద్రుస్తైననే। నేవిధినిన్ నైపనేర్తు నీకఁ బ్రాణేశా॥ వ॥ అని బహువిధంబుల విలపించుచు॥ మ॥ తనువల్లిస్ఫూర్తి కంద నేలఁబడి నిద్రా చెక్కుటద్దంబులం। దును వైవర్ణ్యముదోప కుంతలములు న్దూలంగ ఫాలస్థలిం। గనునీరున్ వలిగుబ్బదోయిఁ దొలుగంగా నేడ్చె విద్యాధరి। జనహాస్యాబ్జ విపంచికా రవ సుధాసారాను సారంబుగన్ ॥ వ॥ ఇట్లతి రోదనంబున నాతీదనంబునొందుచు నాత్మగతంబున॥ మ॥ దనరన్ రుద్రుఁడు సర్వజంతువులదయాంతర్యామియై యుండ నా। తని సంకల్పవశంబునన్ జగములత్యంతంబు భాసిల్లు నా। ఘనతేజోనిధి యాజ్ఞలేకఁ దృణము న్గంపించునే వన్ననా। ధను శంభుండె కటాక్షదృష్టి మనుచుం దథ్యంబు చింతింపగన్ ॥ తే॥ గీ॥ అతఁడు దల్లియుఁ దండ్రియు నన్న యతఁడె। శరణుఁ జొచ్చెద నామొగు చరణయుగము। దేవుఁడాతఁడు నన్నుఁ బొందించుఁ గాక। పతియుఁ బొందిశయాగతిఁ బరమకృపను ॥ వ॥ అట్లుఁ జేయుండేని ॥ ఉ॥ ఆర్తశరణ్యుఁడీశుఁ డఖిలాత్ముఁడు మత్ప్రియవల్లభుంబున। ర్మూర్తినిఁ బొందఁజేసి శుభముప్పడయన్గుణియింపడే జగ। త్కర్తయు భర్తయుం దలపఁ దానయి కర్తుమకర్తుమన్యథా। కర్తుమధీనశక్తియును గాథలు తద్విషయంబులే కదా ॥ వ॥ అనియీశ్వరచరణారవిందంబులం దలంచుచు మొఱయిడిన నప్పుడా పరమేశ్వరుండప్పతి పరివేదనం బాలించి యిదియేమినిమిత్తంబని నంబీశునడిగిన నతండు గృతాంజలియగుచు నిట్లనియె॥ క॥ భామామణి సహితుండై। కాముఁడు నీకోప యోద్ధుకాముండగుచున్। వేమారు సురలపనుపునఁ। దామసమున నిటకువచ్చి దగ్ధుండయ్యెన్ ॥ క॥ ఆదికారణమున మన్మథ। సుదతి విలాపంబుబొం

దు శోకాన్వితయై । సదయారసవీక్షణమున । విదితంబుగ దానిఁ బ్రోవవిహితం బిపుడున్ ॥వ॥ అని
యానంగేశ్వరుండయ్యరవిందబాణ సుందరి దోడ్కొని సన్నిధానంబునకు వచ్చిన ॥క॥ దీనానన
యై కచభర । మానసమున్నప్పఁ గంపమొందఁగ మేనున్ । మానిని మ్రొక్కిన కృపన । స్నానింపుచు
హరుఁడు బలికె మానుల మ్రోలన్ ॥క॥ తనయా శోకింపకు మీ । తనయుండై నివిధుండుదనకుం
ద్రోహం । బును జేసెధరణిఁ గూలెన్ । మును జేసిన కర్మమిపుడు మోసము దెచ్చెన్ ॥క॥ నాతి వి
సుమింక నేని । పాతివ్రత్యంబునకును భావంబునసం । ప్రీతుఁడనైతినిఁ దానక । చేతోభీష్టంబు
దనరు శీఘ్రము గాఁగన్ ॥క॥ పునరుజ్జీవితుఁ జేసెద । మదనుని నీ ప్రాణనాథు మహనీయగుణుం
జననీ కతిపయదినములు । జన నీమదినటఁదల్లఁగ సౌఖ్యము గనుమా ॥వ॥ అని యివ్విధంబునం
గంగాధరుండత్యుత్కంఠరాణిని సుధామధుర వచనంబుల ననునయింపుచు సనకాదిమునులం గనుం
గొని మిగుల నిరంతర ధ్యాననిష్ఠాగరిష్ఠుండై పరతత్త్వంబు భజింపుచేను దేవకార్యార్థంబరిగెదనని భ
వుండంతర్ధానంబునొందె. నాసమయంబున॥

శివుండు శివాతపస్థలంబున కేగుట.

ఉ॥ పార్వతి లోకమాతనప ప్రస్థదశాయుత నేత్రభక్తితో । సర్వజగన్నియామకుని శంక
రుఁ గూర్చి తపంబు సల్పుచుం । బర్వతభాగమందునొక పర్ణగృహంబున నిష్ఠనుండఁగాఁ । బర్వత
కాంత నిర్మల విభాసురదేహుఁడు శంభుఁడాత్తలోఁ ॥వ॥ అంతనమ్మహాదేవి భక్తిఁ బరీక్షింపం
దలంచి ॥మ॥ పలితస్వచ్ఛ శిరోజము ల్వెలుఁగఁగాఁ బల్ జీర్ణమై మేనునుం । వళులు న్వెల్గఁగఁ
గంపమొంద శిరమున్ వక్త్రంబు నిర్దంతమై । వెలయన్ భూరి జరాతిభారమునఁ బర్వేభూతుఁడై సా
శ్రుప । స్ఖలదంఘ్రిద్వయుఁడొప్ప గద్దదికమించన్ వృద్ధ విప్రాకృతిన్ ॥ సీ॥ మహనీయరుద్రాక్ష మాలి
కల్ మెడఁ దాల్చి భసితత్రిపుండ్రాళి భాసిలంగ । ప్రతతిచ్ఛటల్ దాల్చి వసుధా ధరము వోలె బ్ర
హ్మసూత్రంబులు బరగ మేనఁ । గావిధోవతిఁ జక్కఁ గటికేటి గీలించి యామీద నుత్తరీయంబు దనరఁ ।
దర్భపవిత్రంబుఁ దవిలించి వ్రేలున వేదఘోషంబులు విస్తరిల్ల । వేణుదండంబుఁ గేలుఁబూని వింత
మీఱ । దేహమెంతయు శరదిందు దీప్తిమెఱయ । మందగతులొప్పనయ్యింద్రు మకుటుఁ డప్పు । డ
ద్రిజనుజాహనానంద మతిశయిల్ల ॥వ॥ వచ్చి నానాతరుకుసుమ పరిమళ భరితంబును, సకలశుకపి
కనికర కలకలారవ మనోహరంబును మందమలయాభిరామంబును, నిర్వైర విహారమాణ సింహ గజప్ర
ముఖ పరస్పర విరోధ జంతుజాలంబును నై చెలువొంది నిరంతరంబును గృతసపర్యులగుచు
జను మునిగణంబులును, సందర్శనార్థంబరుదెంచు దపోనిష్ఠులం గనుపట్టు నగ్గిరికన్యకాశ్రమ సవి
ధంబుఁ జేరిన ॥క॥ కని యావృద్ధమహీసురు । వినయంబునఁ బిలిచికొనుచు వేగంబ సఖి । జనము
లు గొంచఁ బర్ణ । ఘనపర్ణగృహంబునకును గడునో తేరన్ ॥వ॥ అప్పుడప్పర్వతరాజపుత్రి ప్రత్యు
త్థానంబు నేయుచు నర్ఘ్యపాద్యాదులొసంగి పీఠంబిడి యత్యంత వినయంబున ॥మ॥ వణఁకన్ స్రాటిక లేఁత
కాను విలసద్వక్షోజభారంబునం । బ్రణయంబొప్పఁగఁ జేర్చి ఫాలకళతో భాసిల్లహస్తాబ్జముల్ ।
వణికించేసెను వృద్ధవిప్రునకు నప్పద్మాక్షి మాధ్వీరజః । కణికల్ జింవఁగ నీలకుంతల మిళత్కల్ప
పుష్పనావళిన్ ॥వ॥ మఱియు మధురతర ఫలోపహారంబుల నుపచరింపుచుఁ దాలవృంతానిలంబుల
శ్రమాపనోదనంబు జేసిన సంతుష్టహృదయుండగుచు నవ్వృద్ధభూసురుండు గిరిరాజకన్యకం జూచి



మూహాపరవశుండగుచు ॥క॥ మీ లేకనుఁగవ దరనిభ । మీ లేమ గళంబుగగనమీ లేగొనుం । బా
లేందు రేఖతో సరి । బాలేయుగు నార సుకరుబాలామణికిన్ ॥క॥ పలుకా కపురపు పలుకే । పలు
కెంపుల జిగి నుతింప భళిమై తళుకా । తిలుకారు మె బపు జెలితో । తుల తోఁ జయవవనలలనఁ దొ
లుకం గలదే ॥సీ॥ సుందరి కేశంటఁ జూచిన నచ్చోటఁ బండువెన్నెలలు జూపట్టునిండె । భామిని
ముద్దుగాఁ బలికిన నావంకఁ జిలుకపల్కురలు వర్షించు జాలఁ । బడతి దోర్మూలముల్ బ్రకటించు నాచాయ
బంగారు రాసులై ప్రస్ఫురిల్లు । నబ్జాక్షి తిన్నఁగా నడుగుఁ బెట్టిన దారిఁ గురువింద ములురాలు గొల్లల
గుచు । నారయి నేత్రధావళ్యం బయారె । యిమ్మృదూక్తులపైఁ ఖరి యెంతవింత । యీ భుజాల
తాదీధితి యొచటనైనఁ । గలదె యీపదాంభోరుహ కాంతి తలఁప ॥సీ॥ తొలుతఁ బద్మగులపై
తూణీరములుబుట్టెఁ దూణీరములమీఁద దోచెనటు । లనటులపై బొల్చెనరుదారఁ జక్రంబు జక్రం
బుమీఁదఁ గేసరి చెలంగె । నమరఁ గేసరి మీద హస్తికుంభంబులు కుంభస్థలుల మీఁదఁ గులికె దవశు
దరముపై కనుపట్టె ధవళాంశు బింబంబుధవళాంశు మీదను దనరెనిరులు । నార యజాఁడింద్రజాల
కుండగుచు నవని । నీ వినోదంబు గల్పించె నేమొ తనదు । సృష్టిచాతురిఁ బ్రకటింప నిట్టనుగుచు ।
సకలజనులకు మదికెనాశ్చర్యముగను ॥వ॥ అని యభినందింపుచు నవ్వృద్ధ వసుంధరా బృందారకుం
డయ్యిందువదనతో మకరందబిందు సందోహంబులు జింద నిట్లనియె

పరమేశ్వరుండు పార్వతీ తపశ్చర్యాకారణంబడుగుట

శా॥ కాంతారంబున నొంటిగాఁ దపము చేఁ గాయంబు శోషింపుచుం । గాఁతా యుండఁ
గ నేలనిట్లు నీచటంగళ్యాణమే నీకునీ । చెంతంబాయని యీసఖీజనములున్ నేమంబె వర్ణింపన ।
త్యంతంబున్గిరిరాట్తపఃఫలము నీవబ్జాక్షి సత్యంబుగన్ ॥సీ॥ కీరంబులిచటనీ కెంపు వాతెఱఁ జూచి
పీడించ రావె బింబీఫలాళిఁ । బరభృతంబులు నీదు వాణిస్వరుల్గాంచి మెసవఁదలంచవె కిసలబుద్ధిఁ ।
గలహంసతతులు నీఘనభుజాలతలను గమ్మవేకమల నాళమ్ములనుచు । మధుపసంఘము నీదు మధురా
ననంబును శైత్యానిఁ బ్రమోయవె పద్మకాంక్ష । సంకుమదగంధి వాటనో జడియ వీవు । జగతి రామాఖ్య
వాటనో సరకుగొనవు । జలదవేణికవగుటనో యలుకవింత । కనకనాసవు గనుకనో కనలుభీతి॥
మ॥ మునినృత్తింగ్రహియింప నేలఁ దనువున్ శోషింపు ధర్మ్యకనా । ధనమీదేహము గాయహీనతేఁ
బ్రిమోదంబెట్లు సిద్ధించనే । ఘనలోకంబున శీతలాంబువుల నిర్భాస్నానమెట్లొప్పు నీ । ఘన
వాతాహతి పర్ణధామవసతి న్గావింపనీకెట్లగున్ ॥మ॥ కరమాశ్చర్యకరంబు జూడ నిదిలోకంబందు
నెవ్వారల । స్థిరమౌ దేహము నమ్మికోరరుగదా శ్రేయంబు నీవున్నిరం । తరముగ్గోమల భాసురాంగి
వయి యెన్నంబిన్న ప్రాయంబునం । బరమోదార తపోగరిష్ఠత వసింపం జూచితౌ మానినీ ॥తే.గీ॥
ధర్మవృద్ధులు గావున తథ్యయుగను । దేవగణములు మానులు దివదివంబు । భజనసేతురు నిశ్చలభ
క్తితోఁ నఁ । దావకాంఘ్రి సరోజముల్ ధవళనయన ॥ఉ॥ ఇక్కడ నీ తపోగరిమ నీవిక గావిల నేల
యాగరి క । మిక్కిలి నీకు నే పురుషు మీఁదను వాంఛ జనించు దెల్పుమా । నిక్కముగాఁగ లోకము
న నేర రసత్యము లాడసజ్జనుల్ । చక్కఁగ సత్యభాషణము సార్థముగా మది నెంతు రెందయున్ ॥
ఉ॥ నీ యభీష్టమరయ నేనిట వచ్చితి । సిగ్గుఁ బడఁగ నేల చెలువ నీవు । నన్ను వమ్మ గాఁ నయ
మున భావించి । యే రహస్యమైన నెఱుఁగఁ బలుకు ॥క॥ అని గ్రుచ్చి గ్రుచ్చి యడిగిన । ఘనమతి

నావృద్ధవిప్రుఁ గనుఁగొని లజ్జా । వనతాననాబ్జ యగుచుం । గినుక వొడమ నణఁచుఁ గొనుచుగిరి సుత మదిలోన్ ॥క॥ తానొంటిగ వినుపింపఁగ । బూనిన బహుచపలుఁడితఁడు బోనీయక నెం। తేని యు నడుగందొరకొను । దానం గలహంబుబుట్టు తథ్యంబనుచున్ ॥క॥ తనసఖులఁ బిలిచి భూసు రుఁ । డనవధికప్రేమతరళుఁ డతని యభీష్టం । బొనరఁగఁ దనవృత్తాంతము। వినుపింపుఁడు సఖియలార విశదముగాఁగన్ ॥వ॥ అని జయవిజయాభిధానలగు వయస్యల నియోగించెనని చెప్పిన విని శౌన కాదులవ్వలికథఁ దెలుపుమని సూతునడుగుటయు ॥ఉ॥ భావభవస్ఫురన్మదవిఫాలక ఫాల కరాళ వహ్నికీ । లావళి భాస్వదాస్య కభయానక యానకవాద్యఘోష శో । భావహతాండవైక గణపా కన పావన పాదపద్మసం । భావన వజ్రపాటిత విపన్నగ పన్నగరాజభూషణా॥ పాదాది పాదాంత పద్యాంత ముక్తపదగ్రస్తము ॥క॥ మారాతి మదవిదారా । దారాశ్రితవామభాగ ధర్మవిహారా హారాయిత ఫణిహారా । హారావృత చటులమకుట వరసుకుమారా॥

తోటకవృత్తము॥ నతకామద కామద నాకధునీ । సితధామ విభాసిత శీర్షతటా । లలనా గ మదాగమ దావశిఖీ । ప్రతిమాప్రతిమాన విరాజమహా॥

గద్య॥ ఇది శ్రీమదిందుధరసుందర పాదారవిందార్పితహృన్నళినపత్ర సకలసు
కవిజనానుగ్రహపాత్ర సుగుణగణస్తోత్ర పవిత్రచరిత్ర కాశ్యపస
గోత్రకోడూరి యెల్లనార్యపౌత్రశంకరామాత్యపుత్త్రలక్ష్మాం
బికాతనయ వినయవిధేయ బాలసరస్వతీ నామాంక
వేంకటాచలకవి ప్రణీతంబైన శ్రీస్కాందం
బనుమహాపురాణాంతర్గతశివరహస్య
ఖండంబునసంభవకాండము
దుద్వితీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# శివరహస్యఖండము.

## సంభవకాండము

### తృతీయాశ్వాసము.

---

ధీశ్వర హరి । వాగీశ్వరవంద్యపాద వాహీకృతస। ర్వాగమ పరిపాలిత మూ ర్తీ । నాగకుమృప శంభులింగ వనిధినిమంగా ॥ వ॥ అవధరింపుము శౌనకాదిమహామునులకు సూతుండిట్లనియె॥ క॥ అలగట్టురాజ కూతురు । తెలుపెంతయుఁ గపట విప్రశేఖరుతోఁడం । బలికి రి వినయంబొప్పఁగ । సలలిత మకరంద మధుర సమ్యక్ఫణితిన్ ॥ క॥ వినవయ్య భూసురోత్తము । ఘనముగ నీదేవి దివ్యకథనఖిలంబున్ । వినుపించెద మిప్పుడు । దనయులవాక్పటిమ మెచ్చి దయసేయవగున్ ॥ మ॥ హిమశైలేంద్రుని ముద్దుపట్టి యనిమీకిచంద్రబింబాస్య జ । న్మము మున్నె విదితంబు భూతలమునన్ మాణిక్యమే సుమ్మి యీ । కమనీయాంగి విలాసినీగణములో గాంభీర్యమా శీలమా । రమణీయంబగు రూపమా సుగుణమా రాజిల్లు నీ కాంతకున్ ॥ చ॥ పరుగుణయిమ్మగేస్తుణ భవాదృశులైన మహాత్మకోటిచేఁ । బరగనిరంతరంబు శ్రుతిపర్వముగా శ్రుతులున్ బురాణముల్ గురుచిర ధర్మశాస్త్రములజొప్ప నెఱింగినదై నితాంతమున్ । హరుఁ బరమేశు శంకరు నహర్నిశ మెంచుచు మానసంబునన్ ॥ మ॥ జగదారాధ్యుఁ ద్రిలోచను న్నయవవస్వాంవర్యతేజోనిధిన్ విగళజ్జన్మజరాత్యయుని శుభగుణుస్వీతాఘు మృత్యుంజయుం । జగతీమండలిఁ బెండ్లియాడుటకునై సంతోషమొప్పంగ నీ । యగరాట్పుత్రిక శైశవప్రభృతిగా ధ్యానించు సర్వేశ్వరున్ ॥ క॥ భోగంబుఁ బొంది యుండుట । బాగుగఁ దమపుట్టినింట కాలామణుతే । భోగంబేటికి గదు శెలి యుదిత రోగకుధాంభోధిఁ దేలచుండు నిగురున్ ॥ శా॥ తన్నామంబు జపించు సంతతము శ్రోత్రశ్రీతిగాఁ దత్కథల్ । చెన్నొందన్వినుఁ సారె తన్మయముగాఁ జింతించు నీవిశ్వయున్ । విన్నాణంబుగనాత్మలో వెలుఁగఁగాఁ విజ్ఞానదీపాంకురం । బన్నాళీకభవాదివంద్యు హరునై సాయుజ్యమింపొందఁగన్ ॥ సీ॥ నిట్టూర్పుపవనంబునిబిడమై జనియింప భుజగభూషాయయంచుఁ బొరలుఁజాల । బహుమోహ తిమిరంబు పైపైనఁగ్రమ్మిన శశికళాధరయంచు జాలిఁబొందుఁ । దనువల్లికెంతయుఁ దాపము గ్గలమైన హా నీలకంధరాయనుచు స్రుక్కు । ఘర్మాంబుపర్ణంబు కాయంబునిండిన నమ్మతాకుగయటంచునార్తిఁగాంచుఁ । బవలునొకవేళఁ శాయనుబర్ణశాల। నెపుడునాహారమందున నిచ్చపడదు విభవుమాత్రంబు రాత్రులునిదురఁబోదు। విరహవేదనచేత నీ సరసిజాక్షి ॥ క॥ ప్రతిరజని నసరరా

నకుపచ్చానంత॥ క॥ నందీశ్వరుని గాంచి, యిందుకళాధరుఁడు కౌతుకోద్భవుఁడై । బం ధువదనరేడు బంధుల । నందఱ నేఁబిలువుమనుచు నాజ్ఞాపించెన్ ॥ క॥ ఆనందీశ్వరుఁ డంతయు శానందితుఁడగుచు శంభునకుమతి నతుఁడై । మానసమందుఁ దలంచుచు । మానితముగఁ బిలిచె బంధుమండలి నెల్లన్ ॥ సీ॥ శాతమాహాలోక్య గణపాలకులఁ బిల్చె నింద్రాదిదివిజుల నెల్లఁ బిల్చె । సకలదిక్పాలక సముదయంబును బిల్చె నలినజ బ్రహ్మల నలరఁ బిల్చె । ద్వాదశాదిత్యులఁ దనరుఁగఁ బిలి చె నేకాదశరుద్రుల ఘనతఁ బిలిచె । వసువుల నెనమండ్ర నరుసతోఁ బిలిచెను బిల్చె విశ్వేదేవబృంద ములను । సాధ్యగణములఁ బిలిచె నుత్సాహ మొప్ప । యక్షగంధర్వతతిఁ బిల్చె నాక్షణంబ । సిద్ధ విద్యాధరోరగశ్రేణిఁ బిల్చెఁ । బితరులను బిల్చె నతిశయప్రేమ మీఱ ॥ క॥ గరుడధ్వజుని బిల్చెను బరఁగ దశావతారపఙ్క్తినిఁ బిలిచెం । గరముగ్ర చతుర్ముఖుడగు । బరమేష్ఠిం బిలిచె మునిని బ్రమదంబేసఁగన్ ॥ వ॥ మఱియుఁ బాతాళనివాసులైన యనంతవాసుకితక్షకాదిశేషాది మహాబల క ర్కోటక మహోరగ శంఖపాలమహానాగముఖ్యులను, ఘోరరూప మహావీరభద్రులను, మహాబ లమహాబాహు మధుపింగళ చతుర్వక్త్రాదులైన భూతగణాధ్యక్షులను, విరోచన బలి నముచి ధుం ధు మహాదంష్ట్ర హయగ్రీవ ప్రముఖదైత్యదానవ గణంబులను, హాటకేశ్వరప్రముఖులైన కూష్మాండగ ణముఖ్యులను, కరణ బాహుక పంచాస్యాశతముఖ సుకేశ కాష్టకూటకేతు మేఘవృష్ట్యావర్తరూపతా శకేతు శతానన ప్రముఖులైన యసంఖ్యాత ప్రమథగణాధ్యక్షులకును, కళాముహూర్తకాష్ఠ దిన తిథి పక్షార్ధమాస ఋతు వత్సరంబులను, గంగాదినదులను, సముద్రంబులను, సరస్సులను మఱియు ననృత్తంబును శ్రుతంబును నైన చరాచరాత్మకంబగు సకలజగంబును బిలిచె నంత ॥ క॥ తరుణేందు వతంసుఁడయిన । పరమేశునిఁ గింపంగదిశల శ్రవణోత్సవమై । పరఁగెన్ సంఙ్ఞావాద్యము । లురుతర ఘోషములవై భవోన్నతిమీఱన్ ॥ వ॥ అప్పుడు ॥ క॥ వేదమయుండైన శివుని । పాదంబున కె క్కి సైన్యములు గొలువంగ । శ్రీదయితా మణితోడను । నాదిమదంపతులఁ జూడ హరి సనుదెంచెన్ ॥ మ॥ చతురాస్యుండు మరాళవాహనము నుత్సాహంబుతో నెక్కి వాణీ సతితోడన్ని గమాగమం బులు రాగా మూర్తిమంతంబులై । కుతుకంబొప్ప నగేంద్రజా శిఖరిరాట్కాదంబ కళ్యాణము । ప్రతిమప్రౌఢిమఁ జూడవచ్చెను వసిష్ఠాదుల్ మునుల్ గొల్వఁగన్ ॥

సురాసురమానియత్తులాదిగ కైలాసంబునకరుగుట

మ॥ అమరేంద్రుండు బలారిముఖ్యజాతరణితో నైరావతారూఢుఁడై । రోమరోమంబున నుదెంచె దే వగణముల్ గొల్వంగ నావెంబడిం । గ్రమమొప్పంగఁ గృశానుదండి పలభుగ్వాయో ర్ధనదేశాసు రేశం । ద్రమహేశుల్ వెనువచ్చిరింపుమగుటోద్వాహంబు వీక్షింపఁగన్ ॥ క॥ ద్వాదశరవులశ్వను లే । కాదశ రుద్రులును సాధ్యగణముల్ సిద్ధుల్ । మోదమునవచ్చిరగరా । ట్కాదండుని వివాహ మునకు గొబ్బునఁ జూడన్ ॥ క॥ సప్తమరుత్తులు వసువులు । సప్తఋషులు పితరులఖిలసన్మునివర్యుల్ ప్రాప్తకుతూహలులై పర । మాప్తుం బరమేశుఁ జూడవరుదెంచిరి గెన్ ॥ తే.గీ.॥ అరయఁగ జరా చరాత్మకమందునుండు । నాత్మలంతరాత్ములం బరమాత్మలెల్ల । నరుగదెంచిరి సంతోషమతిశయిల్ల । జంద్రమకుటోత్సవముఁ జూడ సరదసముగ ॥ క॥ ఉత్తమశౌర్యంబులఁ దగు । కార్తికదగ నరువే దాలకోట్లసురారుల్ । చిత్రంబులలర వచ్చిరి । చిత్రజపరిపంథిఁ జూడఁ జెలువంబొప్పన్ ॥



శివితెంబిరసంతారులు । పాతాళనివాసులష్టపన్నగముఖ్యుల్ । చేతోమోదంబలరఁగ । శితాం శువతంసుఁ జూడఁ శీఘ్రముగాఁగన్ ॥ క॥ హరు కళ్యాణమహోత్సవ । మరయఁగఁ గాలాగ్నిరు ద్రుఁడరుదెంచె మహా । స్ఫురణత ననంతకోటులు । గరిమన్నిజసదృశరుద్ర గణములుగొలువన్ ॥ తే॥గీ॥ అలర ముక్తాత్ములైనట్టి యాత్మగణము । లబ్దదాయుతకోటి సంఖ్యలు చెలఁగఁగ । హాటకే శ్వరుఁడరుదెంచె హర్షమెసఁగ । హాటకాచలధన్వికళ్యాణమునకు ॥ క॥ ప్రమదంబలర విశాఖుఁడు గోమరొప్పఁగవచ్చె కోటికోటిమహాప । ద్మములుగొలువంగ గణములు । విముక్తకేశులు పురారి వే డుకఁ జూడన్ ॥ క॥ గణుతింప శతార్బుదములు । గణములుగొలువఁగను దన్ను ఘనముగ దేవ । ప్రణుతుండు బాణయుక్తుఁడు । గణముఖ్యుఁడువచ్చె శంభుఁగనుఁగొనుప్రేమన్ ॥ క॥ తిలకింప నాత్మ గణములు । జలనిధి శతకోటులొప్ప సత్వానుఁడు । జ్వలబలుఁడు గణాధ్యక్షుఁడు । జెలువొందఁగ వచ్చెఁ జంద్రశేఖరుఁ జూడన్ ॥ క॥ అరయంగ వీతరాగులు । గరము దీవనేక కోటిగణములుగొలువన్ । నిరుపమధృతివిక్రతాస్యుఁడు । బరగంజనుదెంచె భర్గుపరిణయమరయన్ ॥ క॥ లోకాలోక నివా సుఁడు । ప్రాకటఘనబాహుశౌర్యభాసురుఁడగు జ్వా । లాకేశుండరుదెంచెఁ బి । నాకి వివాహో త్సవంబునకుఁ జెలువొందన్ ॥ క॥ సమదగణ పరివృతుండై । సముఁడుండను గణవిభుండు సమధిక పటిమం । గుమదాప్తజూటు సన్నిధి । కమరఁగ జనుదెంచె మదినిహర్షంబలరన్ ॥ క॥ దుందుభి యనెడు గణాగ్రణి । దుందుభిఘోషములు సెలఁగఁ దోడ్తోడ నసం । ఖ్యందనరు గణంబులతో । నిందుకళాధరునిఁ జూడ నేతెంచెఁ గడున్ ॥ క॥ దాలిచి కపాలనామము । మేలిమిగ బరార్థసం ఖ్య మెఱయఁగఁ గణముల్ । పాలితనిర్జరపాలిక । పాలీశ్వరుఁడా కపాలి పాలికివచ్చెన్ ॥ తే॥గీ॥ కలుషవర్జితు లూర్జిత ఖ్యాతిఘనులు । కోటికోటిపరార్ధముల్ గొల్వగణము । నరిశయాహ్లాదమొ ప్ప సంహ్లాదుఁడపుడు । వచ్చెఁ దరుణేందుమౌళి వివాహమునకు ॥ తే॥గీ॥ రుద్రసన్నిభులైనట్టి రు ద్రగణము । లమరఁ గొలువంగఁ గోటిపద్మములు తన్ను । నందకుఁడువచ్చె మేరుకోదండధరుని । పరిణయముఁ జూడఁ గన్నులపండువుగను ॥ తే॥గీ॥ జంభశాసనసుతుఁ గాంచు శౌర్యనిధులు । కోటి కోటిగణంబులు కొలువఁదన్ను । కుంభకుఁడువచ్చె హర్షనిగుంభమెసఁగ । భావభవశాసి శంభు వైభవముఁ జూడ ॥ క॥ మునిముదప్రమథాధీశుఁడు । మనెకుఁడను శతకోటిగణసమన్వితుఁడగుచున్ విదితముగ మహామహిమను । మదనారిం జూడవచ్చె మానితభక్తిన్ ॥ క॥ కోటిపరార్ధగణంబులుఁ । గోటిగగొలువంగ శివమెఱయఁగ వేచ్చెం । గాటపముగ సన్తోముఁడు । జూటుకహిమకరకిరీటుఁ జూడం బ్రేమన్ ॥ క॥ నయధుర్యుఁడు ధగనేత్రుం । డయుతాయుతకోటి గణములలరఁగఁ గొలు వం బ్రమథము దలిర్పఁగ మృత్యుం । జయునిఁ గనుఁగొనఁగ వచ్చె సత్వరలీలన్ ॥ తే॥గీ॥ అపవంత మహాశేకులనఘ మహిమ । వీరపర్వతమందును విశ్రుతముగఁ । గొలిచి చనుదేర సాహస్రకోటిగ ణము । లరుగుదెంచిరి తరుణేందుధరునిఁ జూడ ॥ తే॥గీ॥ గణవరేణ్యులు పిప్పలకాకపాద । సన్నకా దులు వచ్చిరి సంభ్రమమున । గరిమమీఱు నసంఖ్యాతగణములొప్పఁ । జిత్తజారాతిపాదాబ్జ సేవకా ఖిల ॥ క॥ కొలువఁగ నసంఖ్యగణములు । సెలకొని మధుపింగళుండు నీలుండు మహా । బలుఁడన్ము ఖ్యులు గణపతు । లలరఁగ వచ్చిరి కపర్దివలోకింపన్ ॥ తే॥గీ॥ పూర్ణభద్రుఁడు వచ్చెను బోలు పెసంగ రహిచతుర్వక్త్రుఁడరుదెంచె రమణమీఱ । బహుగణంబులు గొలువంగ భస్మకడసు । వీరభూతగణం

చున్ శీతాంశురేఖాధరుం । డలమీసర్వేశ్వరాణికిట్లనియె భోగార్థంబు నీశాకుఁడవుల్ । గలుగుటగా వుత సర్వలోకులకనంగర్వంబు జూపట్టుచున్ । వెలయుంగన్న దుఃఖ గాకపాంగుఁడగుచున్, నీకుం బ రాజాననా ॥ క॥ అనిశంకరుండు కృపతో । తనప్రాణేశ్వరునొసంగ తద్దయుభక్తిం । ఘటింపుచు రతిసతి । ఘనమతి పతియోగసౌఖ్య ఘటవం దేలెన్ ॥ వ॥ అంత ॥ క॥ తనయుల తోడను నగపతి । ప్రణమిల్లి గిరీశుపాదపద్మంబులకుం । దనర మధుపర్కశేషము । వినియోగము జేయవిన్నవించెన్ భక్తిన్ ॥ క॥ హరివారిజభవులాదిగ । సురలెల్లను వేడిరంత సుముఖుండగుచున్ । గరుణించియొసఁగెవారికి । తరుణేందు ధరుండొసంగఁ దచ్ఛేషంబున్ ॥ తే॥గీ॥ ఆత్మశుద్ధ్యర్థ మప్పుడా యమరులెల్ల । శివునినిర్మాల్యముల్ గొనిచిత్తమలర । ధన్యతనుబొంది రద్ధరాధరవరుండు । తత్ప్రసాదంబు గొనికృతార్థత వహించె ॥ వ॥ తదనంతరబ యద్రీంద్రునను మతి చంద్రశేఖరుండు వృషభేంద్రారూఢుండై ప్రమథగణంబులుగొలువ దేవమునిగణంబులతోడ నాక్షణంబ కైలాసంబునకరిగి దివ్యతరంబైనభోగపురంబునందు నిజమందిరద్వారంబున నిలిచి కాలాగ్నిరుద్రుండాదిగాగల సకలదేవబృందములను, వశిష్ఠాదిమహర్షులను, సకలచరాచరంబులును భూరిసంజ్ఞను యథాస్థానంబుల కనుజ్ఞనొసంగి శీఘ్రంబవృషభంబుడిగ్గి నందిహస్తావలంబంబునుం గొనిదేవీసమేతంబుగాఁ బ్రవేశించెనప్పరమేశ్వరు గిరిజాకల్యాణంబు నెవ్వరేని సమాహితచిత్తులై పఠించిన సకలాభీష్టంబులు గాంతురు మఱియును ॥ సీ॥ కన్యార్థియగువాఁడు గన్యనువరియించుఁ బతికామి వరియించుఁబతిని వేడ్క । విద్యార్థిపొందును విద్యనుశీఘ్రంబ- జయకాముఁడొందును జయముచాల । పుత్త్రార్థిగాంచును బుత్త్రునిముదమొప్ప నాయుష్యకామి చిరాయువొందు । నర్థకాముఁడుబొందు నర్థంబునిండారఁ బశుకాముఁడొందును బశుసమృద్ధి । పూర్వమిదివిని లక్ష్మినిబొందె హరియు । పద్మగర్భుండు భారతిపరిణయించె । వాసవుఁడు బులోమజను వివాహమయ్యె । ధరనహల్యవరించె గౌతముఁడు ప్రీతి ॥ వ॥ అదిగావున పార్వతీపరమేశ్వరుల కళ్యాణమహోత్సవంబు సర్వకాలంబుల భక్తిపూర్వకంబుగాఁ బత్నీసమేతులై సకలజనులుమనోభీష్టసిద్ధికొఱకు నాకర్ణింపవలయు, నుపచరింపవలయునని మాతుండు చెప్పిన శౌనకాదులానందభరితులైరంతయు ॥ మ॥ అలఘుశ్రీ సుకుమారమారమణకాణ్యార్థతత్సంప్రార్థ్యని । ర్మలసేవామృతపూర పూరసురగర్వస్ఫూర్తి నిర్వాపణో । జ్జ్వలబాహాయుగసారసారసవిపత్సప్రపద్మ భూభృచ్ఛిఖా । లలితోదారవిహార హారకటకా లంకార దర్వీకరా ॥ క॥ కంధరశోభా మేచక । కంధరభక్తజననీల కంధరనర్తా । కంధర రణనిర్జితదశ । కంధరపూజితలక్ష్మరోధిఘనపవనా ॥ భుజంగప్రయాతము ॥ నిశాంతస్ఫురత్పద్మనీకాశనేత్రా । నిశాం[illegible]దికసాత్త్వమణీవాకుగాత్రా । నిశాంతాయితస్వచ్ఛనిశ్శేషసన్నా । నిశాంతాంతరంగాయనా[illegible] ॥

గద్య॥ ఇది శ్రీమదిందుధరసుందర పాదారవిందార్పితహృచ్ఛతపత్ర సకలసుకవిజ[illegible]గహృత్ప్రాత్రసుగుణగణస్తోత్ర పవిత్ర చరిత్రకాశ్యపసగోత్ర [illegible]యల్లనార్యపుత్ర శంకరామాత్యపుత్త్రిలక్ష్మాంబికారవయ వినయవిశేషబాలసరస్వతీనామాంక వేంకటాచల కవిప్రణీతంబైన శ్రీసాంబందంబనున్నకోరాణంబునందలి శివరహస్యఖండంబున సంభవకాండమందుతృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ రస్తు.

# శివరహస్యఖండము.

## సంభవకాండము.

### చతుర్థాశ్వాసము.

---

క॥ శ్రీమద్గిరిజామానస । తామరసధ్యానమధుప దారతభృంగా । శ్రీముఖవాగధిపపతీ । క్షేమనిధానాంతరంగ శ్రీశివలింగా॥ వ॥ అవధరింపుము శౌనకాదిమహామునులకు సూతుండిట్లనియె ॥ క॥ అంత శశాంకకళాధరుఁ । డంతఃపురమందు వేడుకలరఁగ గిరిజా । కాంతారత్నముతోన త్యంతము నవరత్నపీఠికాసీనుండై ॥ సీ॥ వెలదివేనలిజూచి వేరూరుహర్షించు ఘనసంపదలు నొందఁగనిన కరణిఁ । గలికిమోము తుగాంచి కౌతూహలమునొందు పరరాజలక్ష్మిచేకురిన రీతిఁ । బడతి పాలిండ్లను బరికించి ముదమందు దుర్గాధిపత్యంబు దొరికినట్లుఁ । గామినీకటినీమఁ గని సంభ్రమమునొందు చక్రమేల్బడిగాంచు చందమునను । గొమ్మకందోయి వీక్షించి పులకమందుఁ । బవేలయశ్రీలు మఱికొల్లగొనిన పగిదిఁ । గాంతశేగాను నరని యుత్కంఠమించు । పురహరుఁడనంతవిభవంబు బొంకుసరణి ॥ గీ॥ పురహరాభిన్నముయ్యెను బువ్వుబోణి । యద్రికన్యక దరహసమంకురింపఁ । బరగి వ్రీడానతానన పద్మయగుచు । నంతసఖులెల్ల మెల్లన ననునయించి ॥ శా॥ పున్నాగప్రతిమాన వైభవమునం బొల్పొందు నీనాభియుం । బున్నాగప్రతిమాన వైభవమునం బొల్పొందు నీవేణియుం । బున్నాగప్రతిమాన వైభవమునం బొల్పొందు నీయానముం । బున్నాగన్ బరమేశుఁ బొందుమదిలో పూబోణినిగ్గేటికిక్ ॥ మ॥ చెలువా వాతెర తేనెలియ్యగదవే శ్రీకంఠునాకంఠమున్ । దలిచేదల్లను మాన వాక్సుధలు కాంతానింపవే స్థాణువు । కృకిశక్ మీఱఁగ పల్లవింపునను[illegible] దవ్వంగుటన్ వేడ్కతో । బలుమారుకౌ బరిహాసముల్ సెలఁగఁగాఁ బ్రార్థింపుచున్ గన్యకన్॥ మ॥ తలుకుంబంగరు మేడలోపలను నిద్రావజ్రపుంజెక్కడం । బాల మెల్లంతలపట్టెలుం [illegible]కెంపుస్తుక్కలన్ గుల్కరా । జిలుకల్ దీర్చిన శోభయందములరన్ జెన్నొందు మంచంబు[illegible] । తలిరుంబాన్పునఁ బవ్వళించు ప్రియుచెంతన్ జేర్చి రథ్యాన్వితన్॥ క॥ అంగజమార్గ్వరవ[illegible] । నంగనమణి కంకణక్వణంబులు మెరయన్ । కెంగేలుపట్టి తిన్నగ । శృంగారవతిన్విభుం[illegible] సెజ్జపఁ జేర్చెన్॥ వ॥ అప్పుడు॥ మ॥ స్తనయుగ్మం బటిమర్దనాసహా[illegible]ణం గాంచునా । ననయుందాలమ కెంపువా తెరయుకెంత సారదంతక్షత । ఘనవాహావరిరంభ[illegible]దహోసాయం బునట్లయ్యె వే । ద్యానొసంగక శశిఖండమౌళి సవోధానసంగమంబెంతయున్॥ మ॥ లలితోద్యానమనిప్రదేశముల లీలారత్నసౌధంబులన్ । జెలువంబొప్ప గన్

జకేళికలనా శీతాంశుకోటీరుఁడు । తక్కిలికన్ మీఱ నవోఢయైన గిరిజాకాంతామణింగూడి సొం । పలరంగా బహుకాలమీక్రియ రహస్యక్రీడలన్ భాసిలన్ ॥ క॥ స్త్రీపురుష భావమెంతయు । జూపట్టి జగంబులందు సుదతీయుతుఁడై । యాపుష్పధన్వుఁడున్నతి । దీపించె జగంబెసంగ త్రిభువన మంగున్ ॥ మ॥ శివునాజ్ఞంజని యుత్సవాంతమున లక్ష్మీవల్లభుండాదిగా । దివిషద్బృందము తాపసప్రకరమెంతే శూరపద్మాసురేం । ద్రవిపత్తిన్నివసింపజాలక నిజస్థానంబులంబాసి మే । రువు శృంగాగ్రము నాశ్రయించి మదినాలోకించిరెంతేనియున్ ॥ క॥ దేవపతికృతాంజలియై । శ్రీవాణీవరుల కనియె చింతాపరతన్ । గోవింద వారిజోద్భవ । సేవకుఁడను మీకుమనవిఁ జేసెద వినుడీ ॥ క॥ శూరవరు శూరపద్మవి । దారు కుమారుని సృజించి తద్దయుజగముల్ । తారక్షింతు నటంచు ద । యారూషిన్ బ్రతిజ్ఞఁజేసె హరుఁడానాఁడున్ ॥ తే॥గీ॥ సత్యవాక్యుఁడు భావింప చంద్రమౌళి । చేసినప్రతిజ్ఞ నిట్లుపేక్షింపనేల । యింతయు తలంప మనభాగ్యమింతె కాక । నఖిలలోకేశు శంకరు ననఁగనేమి ॥ గీ॥ సురలు దైత్యులు దిక్పాలవరులు మునులు । నిశుచరణాంబుజ యుగంబు నెవ్వరేని । శరణుబొందుదు రాశ్రితులోసంతతంబు । భాగ్యవంతులు వారెపో ప్రస్తుతింప ॥ వ॥ అనిన నరవిందభవుండు పురందరాది బృందారకులకిట్లనియె ॥ క॥ దేవుఁడు జగన్మయుండగు । గావున సురలసురులాదిగను జగమెల్లన్ । స్థావరజంగమమయమిది । భావింప సమానమగును ఫాలాక్షునకున్ ॥ క॥ పరమదయాంభోనిధియగు । పరమేశ్వరుదివ్యపాద పంకజయుగమున్ । శరణముబొందెద మిప్పుడు । గరిమన్ మన్నింపు నతఁడు కరుణన్ మనలన్ ॥ క॥ నగజావధూటితోడను । సొగసొప్ప వినోదలీల శుద్ధాంతమునన్ । జగదీశుఁడు క్రీడాపరుఁ । డగుచున్నాఁడియుండి జ్యాడో యదియెట్లనఁగో ॥ క॥ వేవేగనొకని బనిపి యు । మావల్లభుకడకు నచటమతివృత్తాంతం । బేవిధమో యిది దెలిసిన । యావెనుకం జేయదగు ప్రయత్నముమనకున్ ॥

(శివాశివాంతఃపురంబునకు వాయుదేవుని నలువ పంపుట.)

వ॥ అనిన శతానందుని వచనంబులకు ముకుంద పురందరాది సకలబృందారకులు నభినందించిరంత వారలయనుమతి నప్పరమేష్ఠి పవమానునిం బిలిచి సంభావించి యందఱముందర బహుమానపురస్సరముగానిట్లనియె ॥ మ॥ వినుమా మారుత దానవాగ్రణులచే వేమారు నీయుస్తదా । దివిషత్ప్రజమెల్ల దుస్సహతరార్తింబొంది ధామంబులున్ । ధనముల్ సర్వము గోల్పోయి తనుమాత్రంబొప్పనున్నారహో । వ్వనికిం శక్యముగాదు సువ్వె జగతిన్ వారింపతద్గర్వమున్ ॥ తే॥గీ॥ పంచకృత్యపరుండు ప్రపంచమునకు । నూర్ధ్వరేతస్కుఁడీశ్వరుం డురునిరూఢి । పార్వతీసతియందును బదయుతలయు । శూరపద్మాపహారు కుమారువీరు ॥ క॥ చిరకాలముయ్యె నంతః । పురమందునుదేవిగూడి పురహరుఁడిపుడే । కరణిని నున్నాఁడో మతి । యరసివెసన్ రమ్ము పవన యస్మదనుజ్ఞన్ ॥ క॥ ప్రాణులకు నెల్లనెన్నఁగ । ప్రాణంబవు దేహమీవు భగ్నునకు జగ । త్ప్రాణ జగంబులకు సుర । శ్రేణికి శ్రేస్తుంబ హితము జేయుము కరుణన్ ॥ మ॥ అనినన్ బద్మజుతో సమీరుఁడను బాపో నేను శక్తుండనే । గన నంతఃపురమందునుండు విభునింగంజాతబాణుండు మున్ । వనితాసంయుతుఁడై యశేషదివిషద్వాక్యంబు లాలించితే । సనిభస్మీకృతుఁడైన వార్తవినవే సర్వంసహామండలిన్ ॥ వ॥ అనుడు ప్రభంజను వచనంబులువిని విరించి మఱియునిట్లనియె ॥ మ॥ వటమూలంబున నిల్చి మౌనీశ



తికిన్ వైరాగ్యమింపొంద వి । స్ఫుటలీలన్ నిగమాంతతత్త్వమెలమిం బోధించు నయ్యీశ్వరుం । గుటిలుండై కుసుమబాణుఁడద్రిసుతతో గూర్పంగఁ గోరన్ మహో । త్కటమౌ తద్దురితంబు బాని చెరిచెం దత్ఫాలకీలాహతిన్ ॥ తే॥ గీ॥ అష్టమూర్తికి నీవహో యిష్టమూర్తి । వార్యపూజ్యుఁడ పరయంగ నవనినిన్ను । నాశ్రయింతుము దేవకార్యార్థమిపుడు । ననిలదీనికి మారుమాటాడవలదు ॥ క॥ సురలకభీష్టంబుగ న । త్వరతన్ జనవలయుమార్గగతిని శుభంబుల్ । పరగఘటించు నటించున । సరసిజగర్భాది దివిజసంఘంబెల్లన్ ॥ వ॥ బహువిధంబులం బ్రార్థించిన నప్పవమానుండవేళ ప్రయత్నంబుల రజతాచలంబునకరిగి దక్షిణోత్తరంబులు పూర్వపశ్చిమంబులుం గలయమందమందగతులం సంచరింపుచు భోగపురంబుఁజొచ్చియందు దివ్యమాణిక్యఖచితంబును ననేకాదిత్యసంకాశంబును నభ్రంకషప్రాసాదంబును నక్షత్రప్రకరచోరకంబును నైనమహేశ్వరుసదనంబు ప్రవేశించి భయంకరులగుచు ద్వారంబులయందున్న గణాగ్రణులెవ్వరిచేత నలక్షితుండగుచు నంతఃపురాధికారియైన నందినికటంబునకుం జనిన ॥ శా॥ ద్వారస్థాగ్రణి నందికేశ్వరుఁడు దద్వాయుప్రచారంబు వే । మారుం గాంచి జనింప రోషము మదిన్ బల్కెన్ గభీరంబుగా । నోరీ మారుత నాకుఁదెల్పకనె గ । ర్వవ్యాప్తి నీవీగతిన్ । జోరత్వంబునఁ జంద్రమౌళిగృహముం జొత్తేరయుక్తంబొకో ॥ క॥ అనవుడు తద్వచనమువిని । యనిలుండవ్వలను జోకనతనికినతుఁడై । వినయమునఁ బల్కె నజ్ఞుఁడ । ననఘా కు । రలముపఁగాఁదదర్థంబిటులన్ ॥ క॥ అపరాధంబును జేసితి । కృపతో మన్నించి నన్నునీశ్వరుసమ్ముఖం । బిపుడుఘటింపుము నావిని । కుపితుండై నందిబల్కె కూరిరతరోక్తిన్ ॥ తే.గీ॥ చంద్రశేఖరు బొడఁగనసమయమిపుడు । దొరకనేరదు వచ్చినత్రోవఁబోగు । మవసరంబింత యొదవఁగఁగనలుగఁ । డించి । పద్మబాణుడు మునుబడ్డపాటు వినవె ॥ క॥ అనిన భయంపడి యనిలుడు । మనమునఁజింతించి విబుధమండలితోఁ దె । ల్పిన వారలెఱుంగుదురని । జనుదెంచెన్ మరల ఘనశైలంబునకున్ ॥ క॥ వచ్చిన యనిలునిఁగనుగొని । యచ్చటసురలెల్లనతుల హర్షముతోడన్ । మెచ్చుచు పవనా శుభముగ । వచ్చితివే యచట నేమి వార్తలు చెప్పుమా ॥ క॥ క్రీడాపరుఁడై శశిధర । చూడాభరణుండు శైలసుతతోడన యుం । న్నాఁడా తద్వృత్తాంతము । వేడుకవినుపింపు మేము వినియెదమిపుడున్ ॥ మ॥ అనిహర్షింపుచుఁ బల్కు దేవతలతో నావాయుదేవుండు ని । ట్లనియెన్నిర్జరులార మీరనుప సద్యత్త్వాధి రౌప్యాచలం । బునకుంబోయితి నందునందిసమయంబున్ గాదుపొమ్మంచుఁ బ । ల్కిన శంకింపుచు నవ్వలన్ జనఁగ శక్తింజాలకే వచ్చితిన్ ॥ క॥ అంతఃపురమున గిరిజాకాంతాయుతుఁడగుచునుండుకఱకంఠునివృ । త్తాంతము నే నెటులన్నిను । పింతుక్ ప్రభువులవిధంబు పృథివిన్నినమే ॥ తే॥ గీ॥ యింక మీకుమనోభీష్టమెట్ల నట్లు । చేయుఁడంచును వచియించె వాయుదేవుఁ । డంత విధివిష్ణుసహితులై యఖిలసురలు । ఖిన్నులగుచును గైలాసగిరికి బోయి ॥ క॥ అంచిత నిందువతంసుని । మందిరమును జూసి ద్వారమహిగాచినచో । నందీశ్వరుఁడరుదెంచిన । సుంద ప్రేమను గనేంద్రమంజలిగొనుచున్ ॥ తే గీ॥ అతనిఁగనుగొని సురముఖ్యులందరపుడు । ధనముచేరికి దౌకకు నిర్ధనులబోలె । పులుకమందుచు నర్పించిసుమములను । స్తుతిశతంబులనతని సంతుష్టిఁజేసి ॥ క॥ వినయమునఁ బల్కిరెంతయు । ననయమునిగా నిన్నుబడసి త్రైలోక్యగురుం । డనబడె మృత్యుంజయుఁ । డుం । పవనా నీమహిమమెన్నవలవియెమాకున్ ॥ తే॥గీ॥ విశ్వభర్తకు మాభారవిన్నవించి । లోకజం

దాదివిరి వరుసం । దనయులు ముద్దులు గులుకను । ఘనతరచేష్టలను గౌతుకంబు దలిర్పన్ ॥ మ॥ జననుల్ కృత్తికలార్వురు న్వరుసతో స్తన్యంబు లెంతేనియున్ । దనయశ్రేణికొసంగి వేడ్క చిగురొత్తన్ బద్మపత్రంబులం । దొనరంగా శయనించఁ జేసిరి కుమారోత్తంసులన్ సారె లా । లనమీలం గలకంఠనాదముల జోలల్ బాడుచున్ సొంపుగన్ ॥ వ॥ అప్పుడు ॥ ఉ॥ ఒక్కఁడు సుప్తినొందు మఱియొక్కఁడు నవ్వును సారె సారె వే । ఱొక్కఁడు రోదనంబిడును నొక్కఁడు గూర్చుం బదంబు బొట్నవ్రే । లొక్కఁడు కేలవక్త్రమున నుంచి హసింపుచు నేడ్చు నిద్రలో । నొక్కఁడు చక్కఁదోయిలి నొక్కని దిక్కునఁ జేర్చుముద్దుగన్ ॥ వ॥ మఱియు నిమిషాంతరంబున॥ సీ॥ ఉరమునఁ జరియించు నొక్కఁడు కరములజానుల నొక్కింత జరుగు నొకఁడు । నరుగుచు రెండుమూఁడడుగులుబడు నొక్కఁ డంఘ్రులఁ జనుదూర మవని నొకఁడు । జనని కైదండ గైకొని యాడు నొక్కఁడు । నడుచు బిట్టెగయుచుఁ బడుచు నొకఁడు । మఱి క్షణాంతరమున మహిఁ గంతులిడు నొక్కఁ । డర్ధపాదంబుల నరుగు నొక్కఁ । డేకపాదంబున గమించు నెలమి నొకఁడు । కెట్టిపగిది బెనగుచుఁ జెలగు నొక్కఁ । డొకని శిరమును దాడించు నొకఁడు వేడ్క । బాహుయుద్ధంబునకుఁ బూను బరగ నొకఁడు ॥ వ॥ ఇవ్విధంబునఁ బరబ్రహ్మంబు బాలభావంబునొంది క్రీడింప నాశ్చర్య విచిత్రంబులైన చేష్టలు చూచి తల్లులు విస్మయంబలర నత్యంతంబు సంతోషించిరి హరివిరించిప్రభృతులయిన దేవతలు వారియద్భుతచరిత్రంబులు గాంచి కృతకృత్యులగుచుం జెలంగిరి ॥ తే॥గీ॥ ఒక కుమారుని బొర్లింపుచున్న మనకు । బాలులార్వురు గలిగిరి ప్రమదమెసఁగ । వీర లతులితనిజభుజావిక్రమముల । గర్వమణఁగింతు రికలోకకంటకులను ॥ తే॥గీ॥ అనుచు నింద్రాది దేవతలాత్మలోన । శివకుమారుల నార్వుర చింతిదంబు । దనరఁ దలఁచుచు నధికమోదంబు నొంది । రీశుఁడు ప్రసన్నుఁడైనచో నేమికొదువ ॥ వ॥ అనిమఱియు సూతుండిట్లనియె ॥ క॥ రాజకిరీటుని కంటను । తేజములుదయింపఁ జూచి దిశలకు దివిష । ద్రాజి భయంపడి పాఱె స । రాజయమున నదితఁ గాంచి ప్రచురార్తినెయిన్ ॥ మ॥ పతియంకస్థలి వేగడిగ్గి కబరీభారంబు కాటంకరా । జితరత్నద్యుతిగప్పఁగొనుచుం గర్ణిక కుల్ పడన్ హారముల్ । తతమంజీరరవంబులుం జెలఁగఁ జిత్తం బుత్తలంబందఁ బా । ర్వతి పాదాబ్జయుగంబు ద్రొట్రిలఁగఁ జేరం బోయె శుద్ధాంతమున్ ॥ వ॥ అప్పుడద్దేవి చరణస్ఖలనంబున మంజీరఖచితరత్నంబులు దొరఁగి మార్గంబెల్ల నిరసనెంతయయె॥ క॥ తేజములు బాలురనుచుం । భ్రాజిల్లఁగ దేవగణము భయవిరహితమై । రాజిల్ల ప్రమోదంబున । నా జగదీశ్వరి రొఱింగి యావృత్తంబున్ ॥ క॥ కినుక న్విబుధగణంబును । గనుఁగొని కనుఁబాండు నాదు గర్భమునందున్ । జనియింపకుండఁ జేసిరి । దనపత్యతఁగనుఁడు మీర అ దోషమునన్ ॥ వ॥ అనుచు దేవతల శపించి హిమాద్రినందన మందస్మితాంచిత వదనారవిందయగుచు మగుడి ప్రియునంకపీఠంబున నధివసించె నంత ॥ తే॥గీ॥ చంద్రశేఖరు నుభయపార్శ్వంబులందు। నెరసి కనుపించు యున్న నవరత్ననివహమందు । ప్రతిఫలింపుచు గట్టు రావట్టియుపుడు । దశవిధంబులఁ [illegible] దళుకెసంగ ॥ శా॥ తత్తద్రత్నములందు నున్న ప్రతిమాతన్వంగులం గాంచి శా । తత్రక్తెకెలకేల శంభుఁడు సముద్యద్రత్నమతోఁ బిల్చుచో । తత్తద్రత్నసమాఖ్యలందనరి తత్తద్రత్నదీప్తుల్ దగన్ । తత్తద్రత్న సముద్భవాంగనలు మోదంబొప్ప నెంతేనియున్ ॥ చ॥ కలిక ను



లుంగు చెక్కులును గన్నవజేపసలు న్విలాసముల్ । గులికెడు మందహాసములు గొప్పచనుంగవ లంజెలంగఁగా । నిలిచి కురంగటం గుముదినీరమణాభరణున్ మహేశ్వరుం । బలుమఱు జూచి రందఱును భావములం దనురాగ పూరఁగన్ ॥ వ॥ అప్పుడప్పార్వతీబోఁటు లుత్ఫుల్ల కమలలోచనంబులును నాసాపుటంబును మణికుండలమండితంబును నకలంకశరచ్చంద్రచంద్రికావిరాజమానమందహాసాభిరామంబును నగు నీశ్వరుని దివ్యసుందరముఖంబు వీక్షించి గర్భంబులు ధరియించిరప్పుడు ॥ క॥ గిరిపుత్రి చూచి వారల । చరితము గోపంబుతోడ జన్యనులారా । ధర కాన్పు లేకయుండుఁడు । చిరకాలము గర్భభరముచేతను మీరల్ ॥ మ॥ అని శైలేంద్రతనూజ శాపమిడ నత్యంతంబుఁ దద్భీతిచే । ననువారంబు మణీవిలాసినుల సర్వాంగంబులన్ ముత్యపున్ । గమినుకుల్లుల్కఁజనించె ఘర్మకణముల్ నిండారజన్మించి రం । దనఘుల్ శూరులు ఖడ్గపాణులు గదాధ్యక్షుల్ మహాకోటులున్॥ క॥ భగనేత్రిహరుండగు నా । భగనంతుడు వారిఁజూచి భాసుర హాస్యం । దగుచు నియోగించెను గడు । జగదాధారుని కుమారుసన్నిధిగొలువన్ ॥ క॥ అలగౌరి శాపభయముల । నెలతల గర్భంబులందు నెలకొనితనయుల్ । తలఁచిరిజగదీశ్వరు పద । జలజంబులు చిత్తములను శరణాగతులై॥ తే॥గీ॥ హరుననుజ్ఞను పార్వతీకలమృగాక్షు । లలఘు భక్తిని పంచర్యసలిపి కెలమి । గర్భభరముల చేతను గడుఁగృశించి । సంతతంబును దుఃఖితస్వాంతలగుచు ॥ వ॥ అంత బహుకాలంబు పరిచర్య సలుప నప్పంకజాక్షులకుఁ బరమేశ్వర సమేతయై పార్వతి ప్రసన్నయగుచు నా సఖీజనంబులం బిలిచి జగద్ధాత్రి కోఱిన మీకిప్పుడు సుఖప్రసవంబగునని యనుగ్రహించిన ॥ క॥ ఆతరుణులంను తోష్మం । డాత్రితభుజబలులు గాంచి రావిర్భవముల్ । మాతృసమాన ద్యుతులం । ఖ్యాతిగ జగదేకవీరులగుచు ధరిత్రిన్ ॥

### వీరబాహూద్భవము.

క॥ పరువింద మణికిఁ బొడమిన । గురువింద లతాఖ్య సతికిఁ గొమరుఁడు బుట్టెన్ । నిరుపమశౌర్యకళానిధి । పరమదభంజనుఁడు వీరబాహుఁ డనఁగన్ ॥ తే॥గీ॥ ఘనతమౌక్తికమణియందు జననమైన । తరలవల్లికి బుట్టె నుదారమహిమ । సర్వవీరవరేణ్యుఁడు చారుమూర్తి । వీరకేసరియనఁగను విజయమెసఁగ ॥ తే॥గీ॥ పుష్యరాగప్రభూతియై పొలుపెసంగు । పుష్పవల్లికి నుదయించె భూరిమహిమ । ఘనుఁడు వీరమహేంద్రుండు ఖ్యాతిమీఱ । నఖిలవీరాగ్రగణ్యుఁడై యవనియందు ॥ క॥ గోమేధికమణిచయమగు । గోమేధికలతకు బుట్టె గురుతరశౌర్యో । ద్దాముఁడు వీరమహేశ్వర । నాముఁడు ప్రఖ్యాతి మీఱ నానాదిశలన్ ॥ క॥ ధారుణి వైడూర్యోద్భవ । నారీమణికిం జనించెన యపుదలిర్పన్ । వీరపురందరుఁ డనఁగను । వీరాగ్రేసరుఁడు లోకవిఖ్యాతముగన్ ॥ తే॥గీ॥ వజ్రమణి వల్లియందును వరగుణుండు । వీరరాక్షసుఁ డనఁగ నావిర్భవించెఁ । బుడమి మరకతవల్లికిఁ గడు జనించె । వీరమార్తాండుఁ డరిగర్వవిదళనుండు ॥ తే॥గీ॥ వెలయ విద్రుమవల్లి కావిర్భవించె। సుతుఁడు వీరాంతకుండను శుభగుణుండు । నీలమణియందుబుట్టిన నీలలతకు । వీరవరుఁడను జన్మించె విభవ మొప్ప ॥ వ॥ ఇవ్విధంబున నమ్మహామహులమ్మగువలకు నాభిమార్గంబుల వలన నిర్గమించి శివాసీనసహితుండును బ్రణతార్తిహరుండును నైన పరమేశ్వరునకు నమస్కరించి యజ్జననీజనకు

ల పార్శ్వంబుల వినయంబున నాశ్రయించి రంత ॥ తే॥గీ॥ వారిఁ గనుఁగొని భుజగకేయూరుఁ డనియె । భాసురప్రౌఢి మీఱ నో బాలులార । పార్వతేయుఁడు పటుతరబాహుబలుఁడు । ప్రభువుగాఁ గలఁడిట మీదఁ బరగ వీరు ॥ వ॥ అని యాజ్ఞాపించి శంకరుండు వారికి నానుకరణంబు లొనర్చి యనంతరంబ శీఘ్రంబున ॥ సీ॥ ప్రస్థానభేరికాపటుతరధ్వనులొప్ప శంఖకాహళి కలస్వనములలర । వివిధాస్త్రపాణులై వెంటరా గణవరుల్ చతురంగబలములు చాలఁగొల్వ । నలరుచు రుద్రకన్యాప్సరో గణములు రాజితలీల నర్తనము సల్ప । సరికిని తనకును శశిరవుల్ వేర్వేఱ శ్వేతాతపత్రముల్ వెలఁగిబూన । నిందుమకుటుండు దేవిసమేతుఁ డగుచు । సల కుమారుఁ గనుఁగొన నరుగుదెంచె । పటహారవములతో హరిప్రముఖనిఖిల । విబుధగణము లెదుర్కొన వేడ్క మీఱ ॥ తే॥గీ॥ శరవణంబున పంకజశయనుఁడగుచు । దండకృత్తికలార్వురు స్తన్యమొసఁగ । నాఱుమూర్తులఁ దనరారు నక్కుమారుఁ । డపుడు వీక్షించెఁ బితరులహర్షమెసఁగ ॥ క॥ సురగణము గణాధ్యక్షులుఁ । బరివేష్టింపఁగను దివిని పార్వతితోడన్ । బురహరుఁడు కుమారునిఁ గని । పరమానందాబ్ధిఁ దేలె భాసురలీలన్ ॥ వ॥ ఇట్లు బాలేందుధరుండు కుమారవదనావలోకనపరుండగుచు మదీయలోచనత్రితయంబు నేఁడుగదా సఫలంబయ్యెనని తలంచుచు దేవినిం బిలచి కొమ్మా సరోజపత్రంబుల ననేకరూపంబుల భాసిల్లు నిక్కుమారునింగంటివే జగదార్తిహరుండైన యితనిచేతఁగదా నీవు వీరమాతవగుదువన్న పతివచనంబులకు సంతోషింపుచు నాజగజ్జనని వృషభంబు డిగ్గి ॥ క॥ బాలుల నార్వురఁ గనుఁగొని । యాలింగనములను మస్తకాఘ్రాణములన్ । బాలిండ్లనదుమఁ జేర్చుచు । శైలజ యొకమూర్తిఁ జేసె సదుద్దీపములన్ ॥ క॥ పదునెనిమిది కన్నులు ష । ద్వదనంబులు పాదయుగము ద్వాదశభుజముల్ । విదితంబుగఁ జూపట్టఁగ । ముదమున శిశువపుడు దేవి ముందటఁ జెలఁగెన్ ॥ క॥ బాలేందునిటలభాసుర । బాలామణి గిరిజ భర్తృపార్శ్వక లోనన్ । బాలున్నిం జూచు ముద్దుగ । బాలునకు నొసంగె మదిని ప్రమదంబెసఁగన్ ॥ క॥ విద్యాజ్ఞానప్రదమై । సద్యోముదమెసగ శైలజాస్తన్యంబున్ । చోద్యముగ నాఱుముఖముల । హృద్యంబుగఁ ద్రావె బాలుఁ డెంతయు వాంఛన్ ॥ వ॥ ఇవ్విధంబున నంబుజప్రభాచోరకంబులైన యపాంగంబుల జననీముఖారవిందం బవలోకింపుచు కుచంబులాని యబ్బాలుండు పాలుద్రావ నప్పయోబిందువులు గంగాసలిలంబులం బడిన నవి శాపంబున జనకుశాపంబున మత్స్యరూపులగు పరాశరసుతులాత్మీయపూర్వరూపంబుల్ ధరించిరంతయు ॥ క॥ అంత కుమారుని గైకొని । కాంతామణి గౌరి ప్రియుని కడకరుదెంచెన్ । సంతోషంబున సర్వది । గంతములం జెలఁగె జయజయధ్వను లపుడున్ ॥ క॥ సురభేరులు మ్రోసెం దివి । విరులు వర్షించి రఖిలవిబుధవరేణ్యుల్ । పరగఁగ నప్సరలాడిరి । గరిమన్ మునిసిద్ధగణము కౌతుకమొందెన్ ॥ వ॥ తదనంతరం బాదేవి కుమారులతోడ వృషభారూఢుండై కృత్తివాసుండు కృత్తికలం జూచి సంప్రీతుండగుచు నిట్లనియె ॥ శా॥ చాలన్ బెంచితిరీ కుమారతిలకుం స్తన్యప్రదానంబులన్ । బాలుండీతఁడు కార్తికేయుఁడనఁగా భాసిల్లు మీపేరుచే । యీలోకంబున నీదినంబుల జనుండెవ్వాఁడు పోఁ జూడఁగా । శీఘ్రంబొప్ప వ్రతంబు సల్పినఁ గడున్ సిద్ధించు నిష్టార్థముల్ ॥ వ॥ మఱియుఁ బుత్రార్థి పుత్రుసింబడయుఁ గన్యార్థి కన్యకనుం బొందు ధనార్థి ధనంబుఁ బొందు పశుకాముండు పశుసమృద్ధి విద్యార్థియు విద్యాలాభంబును గాంచు నక్కు



కుండు మోక్షంబునొందు నిక్కుమారజననంబు భక్తిపూర్వకంబుగా వినిన మాత్రంబున వంధ్యయు గుమారసదృశుండైన గుమారుంగాంచునని కరుణాకటాక్షంబున నిటలాక్షుండు కృత్తికలకు వరంబొసంగి దేవీకుమారులసహితుండై భూతగణంబులతోడ హరివిరించిప్రముఖ నిఖిలసురమునిగణంబులం గొలువ నరుగుడి కైలాసంబునకుం జనియెనంత ॥ క॥ లాలింప తల్లిదండ్రుల । మ్రోలను శివతనయుఁడపుడు మోదంబెసఁగన్ । బాలక్రీడల కతిపయ । కాలము పుచ్చెన్ వినోదగతులు సెలంగన్ ॥ సీ॥ చరణాబ్జనూపురఝణఝణధ్వనులతోఁ గటిసూత్రకింకిణీక్వణములలర । వజ్రదీప్తములైన వరకంకణంబులు హస్తపద్మంబుల నందమొప్ప । మాణిక్యమయములౌ మద్దికాయల డాలు కర్ణభాగంబుల గరిమ మీఱ । రత్నముల్ గూర్చిన రావిరేకలరంగు కలితలలాటభాగములఁ జెలఁగ । దివిజకుధరంబు రత్నసానువులు బోలె । మణికిరీటప్రభాభాసమానమగుచు । మూర్ధ్నపట్టంబు జూపట్ట ముద్దుగులికె । బాలలీలల నప్పరబ్రహ్మమపుడు ॥ వ॥ ఇట్లు వాఙ్మానసగోచరంబును ననంతంబును సత్యజ్ఞానానందరూపంబైన యప్పరంధామం బలంకృతియుతంబైన శిశుభావంబు నొంది శివసన్నిధానంబున్ నలంకరించెనంత ॥

## కుమారస్వామిబాల్యక్రీడావినోదము.

క॥ జగతిం గ్రీడాలోలుం । డగుచున్ సహచరులతోడ హరసూనుఁడొగిన్ । జగములనమిత రంజిల । తగనాడెన్ బాల్యదశను దనరుచు నెలమిన్ ॥ సీ॥ క్షణములో వృషభేంద్రు ఘనకకుత్కంబుమీఁది నణఁగంగ గీరునఖాగ్రములను । నతివికారాకృతులగు గజేంద్రులఁ జూచి చెలికాండ్రతో నవ్వఁ జెలువు మెఱయ । తత్సన్నిధినిఁ జేరి దనరవిస్మయమొప్ప నాననంబుల మూఁడు నంగుళములఁ । నొకగృహంబును జొచ్చియొండొక యింటిలోఁ బరికించు నిక్కుటసరణి దూరి । గగనతలమంటు తరువులు గరిమనెక్కి । పుష్పములను దుల్చి ఫలజాతములును రాల్చి । పొసఁగ ధరియించి పల్లవప్రసవములను । ఫలములు భుజించు బాల్యచాపల్యమలర ॥ మ॥ ముదమింపొందఁగ నచ్చట న్వెడలి సొంపుగ్ మీఱఁగా నమ్మహా । నదులం జొచ్చి కలంచి పంకజవలీనాళంబులుం ద్రుంచుచున్ । పదపద్మంబుల నడ్డగట్టి జలముల్ పాఱిన ప్రకారవుల్ । గుదులై కూడఁగ క్రీడసల్పె దివిజుల్ తోట్రుటుల్ విలోకింపఁగన్ ॥ క॥ కులపర్వతములు శతధా । దళితంబులఁ జేసి సింహతతితోఁ గూడన్ । జెలరేఁగి కూయుచెగురున్ । బలుమఱు గిరినుండి గిరికిఁ బటుజవమెసఁగన్ ॥ క॥ అటఁ బాసి రసాతలమును । బటుగఁ జొరఁబాఱియందు పన్నగరాజ । స్ఫటలుం గరమున నలుముచు । నటులఁ దెగలహించు భుజగసంఘముతోడన్ ॥ క॥ అందుండి దివికినెగయుచు । బృందారకదంతిదంతభేదనుఁడై స । క్రందను ధనువుం గొనియెడు । బృందశతంబులనరాల్చు భీకరలీలన్ ॥ క॥ ధామనిధి రథహయంబులు । వేమఱులంఘించి యాడు వేడుక మీఱన్ । సోమతనూజుండటసని । సోమునిరథమెక్కి డోలఁ సొంపుదలిర్పన్ ॥ క॥ హరి శిఖి యమ నక్తంచర । వరుణ మరుద్ధనదసోమ వారణరాజిన్ । సరగున నధిరోహింపుచు । నిరుపమ గతులొప్పఁ ద్రిప్పు నిపుణత మెఱయన్ ॥ మ॥ ధనియించెన్ ధృవమూదలం బొనకు శశ్వత్త్రాధి మీఱన్ బ్రభం । జనరశ్మిన్ బ్రకరప్రణద్ధము నగ్ కీశక్రకమున్ గేలఁదు । త్తుని యల్ చేయుచు నిర్వహించు ముదితోద్దిప్త నక్షత్రజాలోలిని । ఘను

స్తకంబులఁగట్టి బాలురతో బ్రఖ్యాతంబుగా నాడుచున్ ॥ క॥ లోకేశులఁ దొమ్మండ్ర భ । యానకులం జేసి పార యాశ్చర్యముగా । లోకాలోకాచలమును । బ్రాకటముగ నెక్కి యాడు బాలుం డెలమిన్ ॥ తే॥ గీ॥ గరిమ నంతట సత్యలోకంబు దాని । యలచతుర్ముఖు వక్త్రంబు లంటి యుంటి । బ్రహ్మతంతువు లురమున బట్టి తెచ్చి । మూర్ధ్నశిఖలు నొండొరులను ముళ్ళువేయు ॥ తే॥ గీ॥ అంత వైకుంఠపురమున కరిగి యందు । కాంచనాంబరు సన్నిధి ఖగపతికిని । శయ్యయైనట్టి శేషభుజంగమునకుఁ । గలహమ్ము ఘటించి బాలుఁ డుత్కలికనగును ॥ తే॥ గీ॥ ఉపవిలాసంబు జూపట్టు నొక్కవేళ । చెలుల మోహింపఁ జేయుచు దిరుగుచుండు । బాలలీలావినోదముల్ పరిఢవిల్లఁ । ద్రిభువనంబులు విస్మయస్థితిఁ జెలంగ ॥ తే॥ గీ॥ అటవికిని బోయి వేగ సింహములఁ బట్టి । యొకటి నొకటికి నన్యోన్యయుద్ధ మొదర । వరుస ఘటియించు నవ్వుచు వైభవమున । నమరగణవంద్యుఁ డీయుఁ దయ్యార్భకుండు ॥ తే॥ గీ॥ జననిలాగున లాలింపజగములందు । వనితలెల్లను విడువక వారి ముద్దు । ముద్దుగ నటించు నత్యంతమోహ మలర । శ్రీశిరంబుల చెలువొందు సుతుఁ డతండు ॥ క॥ పలితశిరోజము లలరఁగ । వెలయఁగఁ గొని కేల యష్టి వృద్ధుండగుచున్ । బలుమఱు లోకానుగ్రహ । ముల రఁగఁ జరియించు జగములగ్గలిక మొందన్ ॥ వ॥ మఱియు నవ్విభుండు నరేంద్రసుతుని చెల్వున నొకబో సన్మణికింకిణీగణాలంకారసముజ్జ్వలంబగు మేషంబు నధిరోహించి బహువిధారోహసిరూఢిం దోలుచు నొకతరి ఖరనఖరంబును శితాగ్రకేసరభాసురంబును సువగ్రవాలాభిలంబును బర్బాక్రమసాంద్రంబును నగు మృగేంద్రంబెక్కి భూనభోభాగంబులం ద్రిప్పుచు నొకవేళ జంఘాలంబగు ఖగపతి నిలంఘింపుచు నొకమారు ధారాళంబుగ మర్దాళగమనుండగుచు నొకప్పుడు జవాధికరణంబగు హరిణంబుపై వసింపుచు నొకనిమిషంబు శరభశార్దూలంబుల వాహనంబులుగాఁ గొనుచుఁ బతులవలె నెగడుచు ననేకవికారంబుల వాపీతటాకనదీనదంబుల నమ్మహాశాస్త్రజుం డాశ్రితగణంబులకు నుల్లాసంబలర విహరింపుచుండు నంతయు ॥ క॥ వీణాపాణియు నగుచుం । రాణింపఁగ బాలుఁ డతఁడు రాగము బాడున్ । బోణిమి శిలలు గరంగఁగ । శ్రేణంబులు నిలిచి నిలిచి యింపుగ వినగన్ ॥ చ॥ మనసిజ మానబాణహతి మానసలై సకలాంగనామణుల్ । జనములఁ సొక్క నొక్కయెడ శంభుకుమారుఁడు కేల వేణువుం । గొని సుశిరంబు రంగుళుల గుల్క గదింపుచు మాయచున్ వినూ । తనగతి గానమున్ సలుపు దారువులెల్ల చిగుర్ప నంతయున్ ॥ చ॥ దరహసితాననద్యుతులు తామరసంబుల గేరు కాంతులున్ । సుమదిరదీర్ఘబాహువులు సొంపెసఁగన్ రమణీయయవ్వన । స్ఫురణను జూపనొప్పె హరసూనుఁడు వేడ్క నశేషదివ్యసం । దరుల మనంబులున్ మదనతాపశిఖావళి గ్రాగ నంతయున్ ॥ తే॥ గీ॥ మోదమింపొంద సుతులకు మునివరేణ్య । యతఁ డరాభ్యాసమొనరింప నందువచ్చి । యఖిలభాషలనుగ్రహించి యాక్షణంబ । శిశువులకు దాను జతురత శిక్ష సేర్చు ॥ క॥ ప్రాంగణభూముల వటువుల । సంగతిఁ గూడుచును నేర్చె స్తుతిమాత్రములో । పాంగతబులు గా వేదము । లంగజహరతనయుఁ డాతఁ డద్భుతలీలన్ ॥ మ॥ అసదృగ్విక్రముఁ డా హరాత్మజుఁడు క్రీడాసక్తిదామురపం । ధు సుపర్వల్ గన్ని యద్భుతింబలర దేవేంద్రుల్ ద్వాదశాదిత్యులున్ । వసువుల్ సప్తమరుత్తు లశ్వినులు శర్వస్ఫీతదిక్పాలకుల్ । వెస జంభారికి ఖిన్నవించిరి శేఖురమ్మాతవేకసు... ॥ మ॥ బల దైత్యాంతక యెవ్వఁడో తెలియఁగనీ బాలుండు సంసారమున్ । గలఁ



బట్లగలంచె ముజ్జగములన్ ఖండించె నత్యుద్ధతిన్ । కులశైలంబులు సప్తవారిధులు సంక్షోభంబు నొందించె గా । పిలదిగ్దంతులఁ ద్రిప్పియాడె కడిమిన్ జెండాడె ద్వీపంబులన్ ॥

## ఇంద్రుఁడు మోహితుఁడై కుమారునిపై మార్కొనుట.

క॥ లోకత్రయ మీబాలుం । డీకరణిని శిథిలఁ జేయ నెట్లోర్తు మహా । మా కేమిగతి వచింపుము శాకాధిప యనుచు దివిజనాయకుఁ డపుడున్ ॥ క॥ మాయామోహితమతియై । యాయద్భుతశౌర్యమహిమ నరయుచు నోహో । యీయర్భకుఁ డెవ్వఁడొకో । యీయుత్పాతం బిదే మొదలింగ మటంచున్ ॥ మ॥ బలురోషంబున వజ్రి యాదిగ నిలింపస్తోమముల్ కార్ముకం । బులు సంధించి శరావళుల్ గురియ నాభూభృద్ధనుస్సూనుపై । జెలఁగన్ బో యవిపుష్పవృష్టియగుచున్ శీర్షంబులం గోమలాం । ఘ్రిలయందుం జెలునవ్వునవ్వు గుమారుం డప్పుడెంతేనియున్ ॥ చ॥ మగుడి సురేశ్వరుం డలిగి మానుగ నభ్రగబాదిరూఢుడై । మగటిమి మీఱ వజ్రము గుమారునిపై బలుపన్ దదాయుధం । బొగి ప్రతివజ్రఘట్టనము నొందిన క్రొవ్వడి విస్ఫులింగమున్ । ధగధగ వెల్గ శీర్ణమయి ధారణి వ్రాలెను రేణుపుంజమై ॥ మ॥ చలమున్ మీఱఁగ బాలుఁ డంత ఘనరోషం బొప్ప నవ్వజ్రిపై । నలఘువ్యాసి శరాసనంబుఁ గొని యేయన్ బాణమెంతే శిర । స్థలము న్నాటి సురేంద్రసింధురము వీతప్రాణమై గూలె న । జ్జ్వలవజ్రాహతిచేత గూలిన మహాశైలంబు చందంబునన్ ॥ వ॥ ఆదిగని సహింపక ॥ మ॥ సురలోకేశ్వరుఁ డుగ్రుఁడై మగుడి విస్ఫూర్జచ్ఛరాసారముల్ । గురియం భూరిబలాహకంబు పగిదిన్ దండమున్ బూని యా । హరసూనుం డొకతీవ్రబాణమున బ్రోవిస్ఫూర్జిలఖండించె నా । గిరిభిత్పాణిశరాసనంబును ద్రిలోకీవిస్మయం బొప్పఁగన్ ॥ వ॥ ఇట్లు కోదండంబు ఖండించినఁ గనుంగొని మఱియును ॥ మ॥ గరిమన్ వజ్రి మహోగ్రకోపమదరన్ గంజాప్తకోటిప్రభా । స్ఫురణన్ మీఱఁగ శక్తి వైవ పురభిత్పూనుండు తత్తేజమున్ । బరిమార్పన్ సమరోర్వియందు చలమున్ బాటిల్ల దోర్దర్పు రం । దరుఁ డుద్యద్విశిఖంబు లేయఁ గని క్రోధజ్వాలలున్నిండఁగన్ ॥ వ॥ అయ్యెడ నరిహోత్థాగ్రగణ్యుండగు సుబ్రహ్మణ్యుండు మార్వినాదంబొనర్చి సింహగర్జితంబుల వింటిన్ని నిలువిలుపుని భర్జింపుచు ॥ తే॥ గీ॥ ఒక్కశరమున మకుటంబు నుర్విఁ గడిపి । యొక్కతూపున వజ్రంబుఁ జక్కడంచి । యొక్కయమ్మునఁ గవచంబు వ్రక్కలించి । యూరము నొప్పింప మూర్ఛిల్లె సురవిభుండు ॥ వ॥ అంత బలారాతి పడిన విబుధులు క్రోధమూర్ఛితులగుచు నా శంభుతనూజునిం జుట్టుకొని శరవృష్టులుం గురియ శరసంభవుం డవియన్నిర్యను నివారించుచు నప్పుడు వేల్వేఱ బాణంబులుగొని మూట దండిని నాల్గింటి శిఖిని రెంట వరుణుని రెంట వాయువును మూట ధనిని మఱియును నేవులగు హూధవీయుల నొక్కొక్క శరంబున నిమిషమాత్రంబున గడపె నంతహతావశిష్టులైన దివిజులు దిగంతంబులకుం బాఱి రంతయు ॥ క॥ అంతసమస్తం బావ్వ । క్లాంతిమ దేహ్యద్గతముగాఁగ వలనారయుటవ । త్యంతము శివసుతు యహిమము । సంతోషింపుమను గురుని సన్నిధి కప్పుడున్ ॥ తే॥ గీ॥ ఎలమిఁ జనుదెంచి దేవత్ర యిట్టులనిరి । దేవ శివభూతుఁడవీవు దేవతలకు । నొకొక్కటనిశేషము యుద్ధమునను । బడిరి సురలెల్ల వపగతప్రాణులగుచు ॥ క॥ ఈవిబుధతతి ని ల

నరు। జీవితులం జేసి యశము చేకొనవలదే। శూరుఁడు నారదువచనము। గైవతగురుఁ డాలకించి తత్క్షణమంగునన్॥ క॥ మేరుగుహ వెడలి గుహునిం। జేరెను శరణంబునొంది సామేరువశ్యం। గారూఢుండగు నాతని। పారసుధాపారఘణితి సన్నుతిఁ జేసెన్॥ ఉ॥ ఎవ్వఁడనంతధాముఁ డిల నెవ్వఁ డనంతుఁడ నంతమూర్తియౌ। నెవ్వఁ డనంతవిస్మయుఁడు నెవ్వఁడు శంకరుప్రేమడింభకుం। డెవ్వఁడు దంతివక్త్రునకు నెవ్వఁడు సోదరుఁ డెన్న షణ్ముఖుం। డెవ్వఁడు నట్టినిన్ను నుతియింతు నిరంతరభక్తి నెంతయున్॥ వ॥ దేవా! భవన్మాయావిమోహితులై యజ్ఞానంబున నంధాంధులు మదాంధులై వైరంబున నిన్నర్చింపక శిక్షింపఁబడిరి వారిదోషంబులు వారలకు ఫలించె. నింక తదీయాపరాధంబు గణింపక కృపాకటాక్షంబున వీక్షించి రక్షింపవే యని చరణకమలంబులం బడిన గీష్పతి ననుగ్రహించి దేవతాగ్రగణ్యుండగు సుబ్రహ్మణ్యుం డభీష్టంబగు వరంబు వేడుమనిన ॥ క॥ గురుఁడప్పుడు శంభుసూనుని। కరుణను ప్రార్థించి కోరె ఘనమగు వరమున్। సురలజ్ఞులగుచు నీతో। దురమొనరించుచును నేల నూలిరి వరుసన్ ॥ క॥ క్షమఁ జేసి తదపరాధము। సమధికకరుణార్ద్రదృష్టి సకలామరులన్। క్రమమున యథాప్రకారం। బమరఁగ రక్షింపవలయు నార్తశరణ్యా ॥ వ॥ ఇవ్విధంబున సురగురుండు ప్రార్థింప ప్రసన్నుండై స్కందుండు తదభీష్టంబొసంగె నంత ॥ తే॥ గీ॥ నిద్ర మేల్కాంచినట్లన నిఖిలసురలు। ధరణి లేచిరి లబ్ధచేతన్యులగుచు। నంత హరిముఖ్యులా దేవసంఘములకును। బ్రణుతిఁ జేసిరి నిశ్చలభక్తి మీఱ ॥ క॥ కరుణాపాథోనిధి యగు। హరసుతుఁ డజ్ఞానరూప మగు నామాయన్। హరియించి వారికప్పుడు। పరగ నిజపాదకమలభక్తి నొసంగెన్॥ వ॥ మఱియును ॥ చ॥ సురనికరంబుఁ జూచి మదిసొంపెసఁగన్ మధురోక్తిఁ బల్కె మీ। కరయుదురంతె నన్ను నొకయర్భకుగా నిపుడింక పారమే। శ్వరమగు మత్స్వరూపమును జక్కఁగఁ జూడుఁడు, మీకొసంగెదన్। బరమగు దివ్యచక్షువులు మామకరూపవిలోకనార్థమున్ ॥ వ॥ అనిజగద్గురుండగు సుబ్రహ్మణ్యుం డాసుపర్వులకు విశ్వరూపంబు చూపె నప్పుడు ॥ సీ॥ సప్తపాతాళముల్ చరణంబులును గాఁగ సకలాంతరిక్షముల్ జంఘలుగను। శరనిధులేడును పరిధానములుగాఁగఁ బరికింపదిక్కులు బాహులుగను। నాకాశమండలమర్త్య నాభియుఁ గాఁగ స్వర్గతలంబు మస్తకము గాఁగ। చంద్రసూర్యాగ్నులు చక్షుస్త్రయము గాఁగ। దారకల్ సితపుష్పసంతతులు గాఁగ నభ్రకేశుండు శ్రీకంఠుఁ డాత్మగాఁగ। గిరిసుతాభవమతి గాఁగ హరిసరోజభవులు మఱి వామదక్షిణపార్శ్వములుగ। దనరపవనంబు ప్రాణాది దశకముగను॥

కుమారస్వామి విశ్వరూపంబు నింద్రాదిదేవతలకుఁ జూపుట.

వ॥ మఱియు నాగమంబులు వాక్యంబులును లక్ష్మీచిహ్నంబును మృత్యువు కాలాగ్ని రుద్రుం డిరువురు జఠరాగ్నియు వాసుకియు నంతాది మహానాగంబులు పాదనఖరహంసకంబులుఁగా నోషధులు రోమంబులును నండకోటులు యూరుకాండంబులును గా కోటిమార్తాండసంకాశుండును కోటిశీతాంశుసన్నిభుండును గోటికాలాగ్నితేజుండును నగుచు బరమాద్భుతంబుగా శంభుసంభవుం డీరీతి విశ్వరూపంబుఁ జూపిన నత్తేజంబున సకలబృందారకనయనారవిందంబులు నిద్రానిమీలితంబుల



య్యె నాశ్చర్యంబులుగా నంగీకృతంబులగుచు విషయపరాఙ్ముఖంబులయ్యె నింక చెప్పెడిదేమి పంచేంద్రియంబుల క్రోడ మనంబులు మహాత్తరంబైన తత్ప్రకాశంబునందు లయంబయ్యె నెంతయును॥ ఉ॥ అంతట నాక్షణంబె కమలాధిప ముఖ్యులు లబ్ధసంజ్ఞులై। చెంతను మ్రొక్కి యంజలిని జేయుచు ప్రార్థన జేసి రప్పుడ। త్యంతము దేవదేవ గిరిజాత్మజ చక్షువులీగదే దయా। స్వాంతతిమాకు మేమరయ శక్తులమే భవదీయరూపమున్॥ వ॥ ఇట్లు ప్రార్థించిన సంతుష్టుండగుచు శంభునందనుండు మందస్మితంబలర దేవతలకు దర్శనక్షమంబైన దృష్టియొసంగె నంత హరిబ్రహ్మాదులు వ్యాప్తంబైన నత్తేజోమండలంబునకు జానుప్రదేశమాత్రగతంబగు సమస్తజగంబునుం గనుచు నమ్మహాపురుషుని దేహంబున రోమరోమంబున యాదికాశంబులం బోలె బ్రహ్మాండకోటులు తత్తదావరణంబులును దత్తత్త్రిభువనంబులును బ్రహ్మవిష్ణ్వాదిదేవతలును భూతభవ్యభవిష్యజ్జనంబులును గాంచి విస్మయంబంది భీతచేతస్కులై ప్రణమిల్లి వాగ్గోచరుండుగాని యానందఘనంబైన యాకాంతివలని వేదవేదాంతసంభవంబులైన స్తవంబుల స్తుతియించి రప్పుడు.। క॥ క్రమమున జన్మస్థితిచా। శములగు నెవ్వానివలన జగములకు మనః। కమలమునఁ దలఁతు మతనిం। సుమనోనివహాగ్రగణ్యు సుబ్రహ్మణ్యున్॥ క॥ పలుకుదురు జడంబాత్మగ। పలుమఱు నెవ్వాని మాయ ప్రకృతులగుచుం। దలియఁగ సచ్చిద్రూపం। బలర భజించెదము బ్రహ్మమగు నాగుహునిన్॥ క॥ వెలయ హిరణ్యశ్మశ్రువు। లలర హిరణ్మయాంగమాగమమయుఁడై। జలజాప్తబింబ మధ్య। స్థలవర్తియౌ నెవ్వఁ డతనిఁ దలఁతుము భక్తిన్॥ నిరతంబు సుదిని వికసిత। సరసీజదళాయతాక్షు జగదీశు గుహున్। గరుణారసపాథోధిని। శరణంబొందెద మనన్యశరణులమగుచున్ ॥ క॥ మునిసుత బ్రహ్మాదులు యానందంబులు లవంబులగునే పరిపూర్ణానందాంబుధికిని గుహు। నానిందలఁచెదము మది నివాంఛితమొప్పన్ ॥ తే॥ గీ॥ ఇంద్రుడనుచును హరియంచు నీశుఁడనుచు। నజుఁ డటంచును బలుకుదురజ్ఞులగుచు। నహహ నెవ్వాని మాయచే నఖిలవిభుని। నతని భవసుతు భజియింతు మాత్మనిష్ఠ ॥ తే॥ గీ॥ పూర్ణబోధంబు నాత్మను బొందలేక। నింద్రియాత్మత వారింతు రితరులుర్వి। దూరమగుచును సత్కృపాపూరమునకు। భక్తిఁ దలఁతుము గుహు పరబ్రహ్మ మతని॥ క॥ చిదుదయము కనశ్శరీరం। బిది మొదలగు నఖిలమునకు నెన్నఁగ నెవ్వాఁ। డుదగుణె నిత్యామకుండై। మది భజించెద ముమాకుమారుని వానిన్॥ క॥ ఇతర వ్యాపారంబులు। సతతము వర్జించి యోగిజనులెవ్వానిం। మతిఁ దలఁచి ముక్తిఁ బడయుదు। రతనిం గుహు నాశ్రయింతు మంచితభక్తిన్॥ తే॥ గీ॥ చర్మమట్లన వ్యోమంబు జగతిజనుఁడు। గప్పనేనియు గైకొని కరయుగమున। నతఁడు సాక్షాత్పరబ్రహ్మమైన గుహుని। భక్తిఁ దలఁపక దుఃఖాబ్ధిపారమందు ॥ క॥ పీడిత హృదయగ్రంథులు। వీడిన సంశయములెల్ల విశ్వాత్మనినున్। జూడఁగ దక్షిణమున శిశి। చూడాత్మజ సురవరేణ్య సుబ్రహ్మణ్యా ॥ వ॥ దేవా! యీదేహంబున పరంజ్యోతిస్స్వరూపంబై వెలుంగు నెవ్వని సహాయులు సుషుమ్నామార్గంబునొంది తదనుగ్రహంబున వైద్యుతంబైన ధామంబు నొందుచు సంసారంబున మగుడ ప్రవర్తింపరు సకలజనులకు సంసారార్ణవతారకంబును బరబ్రహ్మంబు పరంధామంబు పరంజ్యోతియు నీశ్వరుండును పరరూపంబును బరాశక్తియు బరాత్పరంబునైన నిన్ను సహస్రోక్తిచే నవ సరోత్రిలోకంబున దివాంధంబునుంబోలె నత్యుగ్రంబై దుర్నిరీక్ష్యంబైన భవదీయవిశ్వరూపం

బుగనుంగొని మాకునద్భుతంబయ్యెడుం గటాక్షించియధాపూర్వకంబుగా షడ్వక్త్రంబులును ద్వాదశ భుజాలంకృతంబును సంపత్ప్రదాయకంబును సౌమ్యంబగు రూపంబు ధరింపవేయని బ్రహ్మాదులు ప్రార్థించిన విశ్వరూపం బుపసంహరించి తే॥ గీ॥ కోటికందర్పరూపమై కోమరుమిగుల । చారుసౌందర్యమొప్ప బ్రసన్నుఁడగుచు । నంబికానందనుఁడు సురేంద్రాదివిబుధ । బృందములఁజూచి పలికె మరందఫణితి ॥ క॥ ఈ మీరలు పఠియించిన । మామక సంస్తోత్రమిదియు మానవు లుర్విన్ బ్రేమఁబఠించిన వినినం । గామితములు వారికేను గరుణనొసఁగుదున్ ॥ వ॥ మఱియు మీకు నభీష్టంబులైన వరంబులు వేఁడుఁడనుటయు స్కందుని వచనంబులకు నరవిందభవాదులానందింపుచు ప్రణమిల్లి యయ్యిందుశేఖర నందనునకిట్లనిరి॥ ఉ॥ దేవ ప్రసన్నులందు భవదీయకటాక్షము గల్గెనేని సే । నానిభుఁజేసి యింద్రకరుణామతి వేల్పులకీవు రాజువై । కావుము మమ్మునెల్లపుడు గర్వితదైత్యలతిం జయించి మా । మావిభవంబులన్ మగుడ మాకునొసంగుము గాత శీఘ్రముగన్ ॥ వ॥ అని వరంబువేడిన పార్వతీనందనుండు ప్రసన్నుండై విబుధోత్తములకిట్లనియె॥ క॥ పతియగుమీకు సురేంద్రుం । డతనికి సేనానినగుచు నలరఁగ వేనుగన్ । బ్రతిరోధులైన దుర్మద । దితిజప్రకరములనెల్ల దెగటార్తుఁగడున్ ॥ క॥ చిరమసురేంద్రుని జేరిన । సురసంపదలెల్ల మగుడ సురలకు నిత్తున్ । గరుణననిపలికి సుమశర । హరసూనుఁడు సనియెరాజితాచలమునకున్॥ వ॥ అతని వెంబడిన వాణీరమణాది నిఖిలగీర్వాణులు కైలాసగిరికిం జనియందొక్క శిఖరంబున నుండి కుమారుని దేవసేనాధిపత్యంబున కభిషిక్తుం జేయం దలంపున విశ్వకర్మను రావించి కార్తికేయునభిషేకార్థం బొకపురంబు రచింపుమనుఁడు నాక్షణంబ యతండు దేవతలయనుజ్ఞవడసి పురంబు నిర్మించె నెంతయు॥

## కుమారస్వామికి దేవసేనాధిపత్య పట్టంబుఁగట్టుట.

సీ॥ రమ్యంబులైనట్టి రాజవీధులచేత దీపించు వైజయంతికలచేత । కలితనిర్మలతోయకాసారములచేత విలసిల్లునుద్యానవితతిచేత। మాణిక్యవిరచితమంటపంబులచేత నతులితగోపురోన్నతులచేత । శశికాంతమణిమయచంద్రశాలలచే రత్ననిర్మితమందిరములచేత । గజరథతురంగసైనికవ్రజముచేత । భాసురంబైనసకలసంపదలచేత । నిరుపమంబైదనర్చునప్పురినుతింప । తరమె ఫణిపతి భారతీవరులకైన॥ వ॥ అప్పుడప్పురంబునుం గని చతుర్ముఖప్రముఖనిఖిల సురగణంబులు సాశ్చర్యంబునొందుచు సంతోషభరితాంతరంగులై గీర్వాణవర్ధ్ని బహుమానశతంబుల నాదరించిరంత॥ క॥ సుమనోనివహంబతిసం । భ్రమమున సేనాధిపత్యపట్టము గట్టన్ । గుముదాప్తమౌళిసుతునకు । సమకూర్చిరివేగసకలసంభారంబుల్॥ వ॥ తదనంతరంబ యన్నగరంబున మిన్నగరాణించు మించు వగరానిగనిగల జిగిమిగులు జగతుల్లను జగతులకువిరాజిలజాజాలసొంపుసంపాదించు కెంపురాతిన్నె యలునులీన్ని యల మెచ్చొనరించు నచ్చంపుపచ్చరామానికంబుల నభినవశృంగార దోహాళులను దేహళులవందంబగు చుపరిభాగంబుల నిరుగెలంకుల మరకతమణివిరచిత కరకలిత లలితేందుకాంతమయకుంభపూర్ణ కలశాభిషేచనలాలక్ష్యమాణ లక్ష్మీవిలాసబంధురంబులగు ద్వారబంధంబులును ద్వారబంధంబులభాసురంబులగుచు పురందరోపల జాలజాలంబుల నద్యంబులగుకుడ్యంబులను



గుడ్యవిలసిత ప్రఖ్యాతాలేఖ్య ప్రతిమాద భ్రవిభ్రమవిభ్రాజిత గంభీర శాతకుంభస్తంభంబులును స్తంభాగ్రంబుల నుదగ్రంబులగు పగడంబుల జగడంబులం బొదలుబోదియలు గిలిగించెలువొందు దివ్యమంటపంబున కోటిసూర్యదేదీప్యమానంబగు రత్నసింహాసనంబందు నయ్యిందుశేఖరసూను సుఖాసీనుంగావించి వేదవేదాంత విజ్ఞాననిష్ఠాగరిష్ఠులగు వశిష్ఠాదిమునిశ్రేష్ఠుల జయజయ భాసురాశీర్వాదంబులును పటహఢక్కాడిండిమ శంఖశృంగ మృదంగ వేణువీణా నినాదంబులును బిరుదుగద్యపద్యంబులునుహృద్యంబుగ దైవారఁగ యివారంబులు సేయువంది మాగధులకోలాహలములుఁదిదృక్షాసమాగత సకలభువన జనకలకలంబులును గొందామరలకువింతులమరగ సందర్శనంబొనర్ప నుందుడుగాఁ జనుదెంచు బృందారకబృందంబులు, ఆగరంబుల రంగారుబంగారు బెత్తమ్ములు బూనిచిత్రంబులలర నెరాబరాబరులు సేయువేత్రధరుల తోరంబులగు హుంకారంబులును నపూర్వపర్వాణపర్వ భేరీభూరి భాంకారంబులును నిఖిలదిగంతాయాతదంతావళి సంతానకంఠ ఘంటాఘణఘణత్కారంబులును నుభయపార్శ్వంబుల రంజిల్ల వింజామరలు విసురు బిసరుహముఖుల కరకంజములంజాల వినూత్న రత్నకంకణఝణఝణ త్కారంబులును బవనచలితకేతన పటపటలపటపటత్కారంబులును బ్రహ్మాండభాండంబు నిండ మ్రోస్మెఱుంగు తెఱంగునకు రంగటమై మెఱుంగులు తురంగలించునచ్చర మెఱుంగు బోణుల విన్నాణంబులగు నాట్యవైభవంబులును యక్షకిన్నర గరుడగంధర్వుల నవీనగా నావిర్భవంబులును మెఱయసురవరులు విరులుగురియ నరవిందభవ ముకుంద పురందరాదులు నిరతిశయ ప్రమోదులగుచు గంగాది పుణ్యతీర్థంబుల వైదికమంత్రంబుల నభిషేచనంబుఁజేసి జాంబూనదాంబర దివ్యాభరణ గంధమాల్యంబుల నలంకరించి ధూపదీప నైవేద్య తాంబూల నీరాజనాది సకలోపచారంబులం బూజించి దేవసేనాధిపత్యంబునకు పట్టంబు గట్టిరయ్యెడ ॥శా॥ నానోపాయ నపాణలై దివిజులానందంబు తోనమ్మహా । సేనుంశంకర సూనుఁగాంచి పరుషన్ సేవించి రభ్యున్నతిన్ । సేనావల్లభుఁ డాతఁడంత విబుధ శ్రేణింగటాక్షింపుచున్ । దానెంతే విహరించె సర్వభువనత్రాణైక ధౌరేయుఁడై ॥ ఉ॥ ఆసమయంబునన్ మునికులాగ్రణి యొక్కఁడు నారదాఖ్యుఁడు । ర్వీసురుఁడధ్వరక్రియ గరిష్ఠతఁబూని యొనర్పబుద్ధిజాల్ । భాసురయజ్ఞవేదికను బాసగనాగమ మంత్రపూర్వక । న్యాసములన్ బశున్విశసనంబును జేయుచునున్న చోగడున్॥ సీ॥ ఉన్నతశృంగంబులారయ నంబరమును రక్తలోచనములు శిఖిదలిర్ప। శ్మశ్రులు దీపింపఁ జాలసీర్ఘంబులై కదల ధాత్రిఖురాగ్ర ఘట్టనమున । కంఠస్తనోద్వృత్తి నాదంబిని చలింపఁబుచ్ఛంబు తారకాపుంజమొప్ప । మదగంధములుదిశా మండలివెలయంగ బొలుపొందసర్వాంగపుష్టి దనరఁబదములను రత్ననూపురార్భటులు మ్రోయఁ । గంధరవరాట కింకిణుల్ ఘల్లురనఁగ। వేగజనియించి నిస్తులవిక్రమమున । భాగమున్నతి విహరించెజగములందు ॥క॥ భ్రాంతింబొందెను దిక్తటదంతావళపంక్తి కడానిదర్పోద్ధతిక । త్యంతము దీకొనదిరుగ । సంతతినయ్యాలు గనశనిసమమూర్ధ్నమునన్ ॥సీ॥ అకులపాటొంది యైరావతంబోడె ఖుండరీకము వనంబులను డాగ। వామనంబప్ప్యంగ వామనస్థితిఁజెందెఁ గుముదంబు కుముదమైత్రింగోరాల । కనుమరుంగుననుండె కడుసంజనంబును బున్నదంతమునోడుఁబొందిరావాతె । సర్వభూమిచలించె సార్వభౌమంబును సుప్రతీకముచేత బొప్పదేఁగ । భాగకళయమున నాగాగణంబులిట్లు । బహుపలాయనమొందెను బరగనంత । నజవరేణ్యంబు

పాతాళమందుఁ జేరి భోగికులముస్ జెంద డెభ్భూరిలీల॥ తే॥గీ॥ సాగరముఁ జొచ్చి జలచరసమితి గెడపె । జలదములఁ దోలెఁ బవమానుచందమునను । జంద్రసూర్యుల రథములు సాగనీక । నాకనిలయులబాధించె మేకవీర ॥క॥ భీకరముగ బాధించెను । లోకేశుం జేరి సర్వలోకమునంగున్ । వైకుంఠమందు నట్లన । వ్యాకులితఘటించె సకలవైష్ణవతతికిన్ ॥వ॥ ఇవ్విధంబున సముద్భవంబగు ఛాగోత్తమంబు లోకానీకంబునకు నేకోపద్రవంబులొనర్ప భయకంపితులగుచు నారదసహితులై యింద్రాది దేవగణంబులు యజ్ఞంబు విపరీతఫలప్రదంబగుట నెవ్వగనొందుచు యజ్ఞవాటంబు విడిచి సర్వార్తిహారుండును జగన్నాథుండును నవ్యయుండును శంభుసూనుండును నైన మహాసేనుంగాంచి ప్రణమిల్లి యిట్లని విన్నవించిరి॥ తే॥గీ॥ దేవదేవ మహాసేన దీనరక్ష । చూడు మమ్ముఁ బ్రసన్ననేత్ర ఱుండు । భూసురాగ్రణి యీశ్వరపూజకుండు । నారదమునీంద్ర సదృశుఁడీ నారదుండు ॥క॥ యాగంబుపక్రమించుచు । భాగాలంబనము మొనర్చ భాగంబొందున్ । వేగమ జన్మించి దైవనియోగంబున జగములెల్ల నుద్ధతిఁ గలఁచెన్ ॥తే॥గీ॥ కాలకూటంబు కంఠమునఁగడు కఠోర । మగుచుఁ గనుపట్టుచున్న దీయజముదీని । నిగ్రహింపకనూశి ననిఖిలజగము । భగ్నమగు గానఁ బాలింపు పరమకృపను ॥క॥ ఏకంబై దేవదైత్యా । నీకంబుల నెవ్వఁడేని నిపుణుఁడు గలఁడే । లోకములో నజదర్పో । ద్రేకంబణఁగింప ననుడు చిఱునవ్వొలయన్ ॥వ॥ కార్తికేయుండు వీరబాహుకరంబు పట్టి నతిరయంబున దర్పోన్మేషంబున దనరు మేషంబు దోతేర నవ్వీరబాహు నాజ్ఞాపించిన నతండఖండప్రచండరోషుండగుచు రసాతలంబాదిగా సత్యలోకపర్యంతం బరసి విష్ణుభవనంబున కోలాహలంబునం జెలంగు నయ్యజంబు లీలామాత్రంబునం బట్టందలంచి సరుంచి కొమ్ములు కరంబులం బట్టిపట్టి నెట్టనీడ్చుకొని దేవనికటంబున కుద్భటంబుగఁ దెచ్చె నప్పుడు ॥క॥ హరసుతుఁ డమ్మేషంబున । గరిమన్ లంఘించి పార్ష్ణిఘాతంబులచే । పరుషకశాతాడనముల । నురుమదమణఁగించె మోదమొప్పన్ గడిమిన్ ॥క॥ ధారాళతమును బరువులు । బారించిన మేషమంత బడలిక మీఱన్ । నోరున్విప్పుచు నురవులఁ । గారఁగఁ గంపించి పడియె గళితస్మయమై ॥వ॥ ఇట్లు పడిన వ్యాజంబును దయాళుండగుచు దీనశరణ్యుండగు సుబ్రహ్మణ్యుం డనుగ్రహదృష్టిం గటాక్షించిన దత్ప్రసాదంబున నజంబు నిజంబుగా సముత్పన్నబోధంబై ప్రణామస్తోత్రంబులు చేసిన ॥క॥ ప్రీతుండగుచు సుమాసుతుఁ । డాతగరున్ వాహనముగ నాదృతి నేలెన్ । ఖ్యాతిగ నాతఁడు భక్త । వ్రాతమునకింద్రమటరుద వసుధాస్థలిలోన్ ॥క॥ సేనావిభునకు నతుఁడై । మానుగవిన్నప మొనర్చి మఖనిర్విఘ్నంబున్ । దీనుడయి దూడ నిలువఁగ । నానారదుతోడననిరె హరసుతుఁడు దయన్ ॥క॥ మునివరనీయజ్ఞంబున । ఘనముగ వాహనము నాకు ఘటియించెను నా । పున నిర్విఘ్నంబగుచును । వనరుక్ నీయజ్ఞమింక ధరసాంగంబై ॥క॥ నాకున్ వాహన మొసఁగుట । చేకుర శతయజ్ఞఫలము శీఘ్రముగనీకున్ । లోకులు భక్తి నొకింతక । నాకొసఁగిన వారికగు ననంతఫలంబుల్ ॥వ॥ అని పలుకులకరుంజేసి వివిధవిద్యావిశారదు నారదుని వీడ్కొని భవానీసూనుండగు మహాసేనుండు విలాసంబున శైలాపంబునవిహరింపుచుండె నరుదెంచి ॥ తే॥గీ॥ కమలగర్భుండు సత్యలోకమున నుండి । దేవగణములతోఁగూడ దేవదేవు । పార్వతీశు సేవింపఁ బరమభక్తి । నేలఁగఁ జనుదెంచె గైలాసశిఖరమునకు ॥ వ॥ ఇట్లు విరించి యరుదెంచి సముంచితమణి గణరచితగృహానిచయ[illegible]విలసితంబును విచిత్ర



చిత్రభిత్తికామర్త్యవారణమనోహరంబును నత్యున్నతపతాకపాదిరాజమానప్రాసాదపరిశోభితంబును సకలసుమనోమునిగణముక్తిప్రధాననిధానంబును నతిప్రకాశంబునునగు పరమేశునికేళంబు ప్రవేశించునయ్యెడ॥

కుమారస్వామి బ్రహ్మను బ్రణవార్థంబడుగుట.

శా॥ ద్వారంబందువినోదముల్ సలుఁగఁగా వర్తించు నా స్వామిలో । కారాధ్యుం గుహు గాంచి బాలుఁడని మాంద్యగ్రబుద్ధి సేవింపకన్ । నీరేజాసనుఁ డీశ్వరవసథమంతే జేరి సద్భక్తితో । గౌరీనాథు సమాప్తిఁ జేసి నిజహృత్కంజంబు రంజిల్లఁగన్ ॥ తే॥గీ॥ భవుని యనుమతిఁ బవనభుక్కృతతి తోఁడ । నతికొనర్పఁగ బహుమదోన్నతిని మీఱి । తిరిగి సత్యలోకంబున కరుగుచుండ । నబ్జజు నిలిపి హరసూనుఁ డలిగి మదిని ॥ ఉ॥ క్రొవ్వున సద్దసేయక నను గొబ్బునఁ బోయెదు నమ్ము డాసి స । ర్వజ్ఞుఁడవోరి చెప్పుమన నీశ్వరసూనునిఁ జూచి భీతుఁడై । యవ్వనజాతసంభవుఁడు ప్రాంజలియై వినయంబు మీఱఁగా । దవ్వులనిల్చి యిట్లనియెఁ దత్పదముల్ మదిలోఁ దలంపుచున్ ॥ ఆ॥వె॥ బ్రహ్మ యింద్రుఁడు నన్ను బరమేశు భజియింప । వచ్చితిగుడ నీ జగన్నివాసమునకుఁ । బోవుచున్న మీకు భూరికృపాదృష్టిఁ । బిలువఁ బూర్వపుణ్యఫలముగాదె॥ క॥ పరగ కృతార్థుఁడనైతిని । కరిమన్ జనిమెద ననుజ్ఞ కరుణింపుమనన్ । దరహాసమొప్ప సహచర । పరివృతుఁడై శంభుసుతుఁడు బ్రహ్మకు ననియెన్ ॥ తే॥ సీ॥ ఏమిచతురాస్య వ్యాపారమెద్ది నీకు । విద్యలెవ్వియు వచ్చును వినఁగ వలయుఁ । జక్కఁ జెప్పుమా విందు రసద్గుణంబు । భవదురుప్రౌఢి వలదు కోపంబు మదిని॥ క॥ అనిన దనీయమృదుమధురగంభీరవచనంబులకు భీతహృదయుండగుచుఁ జతురాననుండిట్లనియె ॥మ॥ అజరవ్రాతము దానవావలియు మర్త్యశ్రేణిముఖ్యంబుగా । సృజియింతున్ సచరాచరంబు జగమున్ జెన్నొందనాకవ్వఁడున్ । త్రిజగన్మండలి దీటు లేరుమదికిన్ దీపించు సర్వార్థముల్ । విజయస్థాదశవిద్యలందు మతి నే నేరయున్నఁ గన్ దక్షుఁడన్ ॥ మ॥ అని యీరీతి వచింపఁ బద్మజుఁడు భవ్యప్రౌఢి సేనాని యి । ట్లనియెన్ వేత్తవు నీవు నీమహిమ యత్యాశ్చర్యమౌనాఁ గడున్ । వనజాతోద్భవ విద్యలెల్లవలె నేవాదింప వేదాదియా । ప్రణవంబెన్ని విధంబులర్థమిది యొప్పం గిల్బిషసంగింప్రుమా ॥ క॥ రూపంబు నందియొరికేఁ । జూపట్టును మహిమ చెప్పఁజూడఁగ వలెనే । నీపాండిత్యం బైనను । జూపుము వీరెల్ల వినఁగ శుభపర్వముగన్ ॥ క॥ అనవుఁడు పంకజగర్భుఁడు । ప్రణవంబు పరీక్షదనర పఠియించినచో । విని యుచ్చారణమాత్రం । బున నూహాపోహములు జాలుబుద్ధంబయ్యెన్ ॥ క॥ అనితలయూచుచు మఱియుం । బ్రణవార్థంబెల్ల తెలియఁబలుకుమటన్నన్ । విని మని మార్గనూనునితో । ననియె తిదర్థంబు నేన యనుచునఁజాండున్ ॥ చ॥ నలినజుఁ డట్లఁ బల్కుటయు నప్పుమారుఁడు వానిఁ జెంపలున్ । ఛెళ ఛెళ వ్రేసి బంధనముచేయుమటన్నను వీరబాహుఁడా । జలరుహగర్భుఁ దోడుకొని స్కంధమహీధరమందు కావలిన్ । నిలిపె ననేక కాలమొగి నిర్జరులెల్లరు భీతిఁ జెందఁగన్ ॥ క॥ సచరాచరమగు జగమును । బ్రచురంబుగ సృష్టిఁ జేసె భవసుతుఁ డప్పుడున్ । [illegible] తాపసగణములు । ప్రచలితమతులగుచు నంగిళర్గనికటమున్ ॥ క॥ క్షురతతులై ప్రార్థించి [illegible] సర్వజ్ఞుండా । ధృతి విని వేల్పుల మనవులు । నతివేగమునందివి

లిచి యనిరొయిన్ బ్రేమన్ ॥ సీ॥ నీవునందీశ మదీయపుత్త్రకడకున్ వేపోయి సొంపల్కిలి । ట్లను వారంబును సంస్తవంబులఁ గడున్ బ్రార్థించి సేనానిచే । తను బ్రహ్మన్విడిపించి రమ్ము దివిషత్సందో హామెంతే భజిం । పను మోదంబు సమస్తలోకసృజన ప్రత్యూహమున్ బూనఁగన్ ॥ వ॥ అనవుడు॥ క॥ నందీశ్వరుండు చయ్యన । ఛందుకళాధరుని యాజ్ఞనిడి మూర్ధ్నమునన్ । స్కందాచలమునకుం జని । స్కందునిఁ గని ప్రీతుఁ జేసి సంస్తవతతులన్ ॥ తే॥ గీ॥ సామిదేవర దండకు జగదధీశుఁ । డింపుమోలినిమాగించె నిపుడునన్ను । బద్ధగర్భుని విడుగము పరమకృపను । బూర్వమట్లను వగుఁగాక భువనసృష్టి ॥ మ॥ అను నందీశ్వరుఁజూచి శంభుసుతుఁడువ్యగ్రోగ్రతరూక్షేక్షణల్ । దనర స్నిష్ఠురభాషణంబులను నత్యంతంబు భర్జించవ । చ్చిన తోత్రం జనులేక మాయుబలుకన్ శీఘ్రుం బకారాగృహం । బున నీకున్ సహవాసమబ్జజునితోఁ బొందంగఁ జేయూరెదున్ ॥ క॥ అనిన భయం పడి యంజలి । దనరఁగఁ బ్రణమిల్లి నందితత్క్షణమునఁ జనె । జని యావృత్తాంతంబును । వినుపించెఁ బురారి కపుడువిస్మితమతియై ॥ తే॥ గీ॥ బలుశిరఃకంపమును జేసి భవుఁడు తాను । స్కందదర్శన లోలుఁడై స్కందగిరికి । నరిగెనంతఃపురంబున నధివసించు । పార్వతీదేవితోఁ డఁ జెప్పకనవేగ॥ వ॥ ఇట్లతిత్వరితగతిం జనియందు నిందుశేఖరుండు సహచరపరివృతుండై క్రీడావినోదంబులం జెలంగు కుమారుని నేత్రోత్సవంబుగాఁ గనుంగొని గాఢాలింగనంబు చేసి మూర్ధంబుమూర్కొని యానందపారావారంబునందేలి పరవశుండయ్యె ॥ క॥ అంతకుమారుఁడు గౌరీ । కాంతుని మూపుర నటించెఁ గడు ముచ్చటగా । స్వాంతము రంజిలఁ జేయుచు । సంతతి సౌఖ్యంబుకంటె సౌఖ్యముఁ గలదే ॥ వ॥ ఇవ్విధంబున సుకుమారసుకుమారంబులగు నంగంబులుపద్మకోమలంబులగు పాణితలంబున స్పృశింపుచు మందస్మితంబలర సాంత్వనపూర్వకంబుగా జగదీశ్వరుండిట్లనియె ॥ తే॥ గీ॥ వత్స విడువుము దయఁ జేసి వనజభవుని । భువన సృష్టియు వీనిచేపొసఁగు నెపుడు । నిదియున స్వకీయాగ్రహాకృత్యమనిన । విడువునని పల్కె తండ్రిపై వేగనలిగి ॥ ఉ॥ అంతట కోపవత్సలత యాభవు నాత్మజునించె తుల్యమై । సంతతముగ్ మనంబునను సంతసమందిన నేరికేని యా । గంతుకమైన కోపమదిగాఢతరంబగుఁ గాన నయ్యుమా । కాంతునిక్రోధమే యపుడు గ్రక్కునదోకునె నిగ్రహింపుచున్ ॥ వ॥ దాసంజేసి వెండియు ॥ చ॥ స్మరమదహారి యిట్లను గుమారుని బిల్చియొ యుంగ పర్భకా । వరగఁగమున్న నీకడకుఁ బంపితి నందిని వానిసెంనకన్ । గరము నిరాకరించితివి గ్రక్కునన న్నను దర్శింకయు న్నిరా । దరణముఁ జేయకన్ విడువు తామరపొద్భవు నిన్నుఁ వేడెదన్ ॥

## శివాజ్ఞం గుమారుఁడు నలువను గారాగృహ విముక్తుం జేయుట.

వ॥ అనిపలుక జనకుని యనునయంబునకు మనంబు గరంగి యనయంబు వినయంబు చెనంగొన వస్వదక్కమలభవుని కారాగృహ విముక్తునిం జేసి కుమారుఁడు తండ్రి కిట్లనియె ॥ శా॥ చేతోమోదము మీఱ నేను సఖులుం జెన్నొందఁ గ్రీడింపఁగా । నీతండొక్కడ వచ్చిదర్పమున నన్నీక్షించి సేవింపకన్ । యాతాయాతములం ఘటింపఁగ నా నాకత్యంతరోషంబు సం । జాతంబై యపుడేను వీనిని బరీక్షం జేయ నూహింపుచున్ ॥ క॥ ఎవ్వఁడవు నీవు కృత్యం । బెవ్విధి యొచ్చోటువసతి యేమి యధీతం । బవ్విధముఁ దెలుపుమనవుఁడు । నవ్వారిజభవుఁడు దెలిపెనది యఖిలంబున్ ॥ క॥ ఓం



త మతియును ॥ క॥ ప్రణవమున కర్థియర్థము । వినుపింపుమటన్న నతఁడు వేకొవచింపన్ । వినియాయపార్థ మాగ్రహ । మునవిలిపితిశిక్షఁ జేసి భూధరమందున్ ॥ మ॥ అనినం బ్రీతమనస్కుఁడై హరుఁడు నెయ్యంబొప్ప మూర్ధాదినం । దను జెక్కిళ్ళమనూత్నమంబునకు నర్థంబెద్ది వాక్రువ్వుమా । యున బుత్త్రుండు తదంఘ్రిపద్మములకున్ హర్షంబుతో మ్రొక్కుచున్ । మనురాజంబిది ప్రాకృతులో వినఁగ సంభాషింపఁగాఁ గూడునే ॥ క॥ మతిధీమంతుండగుగురుఁ । డెఱిఁగింపఁగవలెను మంత్రమెఱిఁగింపనిచో । యెఱిఁగింపఁగఁ బోయిన గురు । నెఱిఁగించిన మంత్రముభయమిది దోషముగున్ ॥ చ॥ అనిన సురాసురవ్రజము నవ్వల బొమ్మని శంభుడంతప్రే । మను సుతు నంకపీఠమున మున్నుఁ జేర్చియుఁ గౌఁగలింపుచున్ । వినీకొద పుత్త్రకర్ణమున వేగవచింపు తదర్థమెల్లనా । కనుడు గుహుండు చెప్పె ప్రణవార్థము మ్రొక్కుచుఁ దండ్రికింతయున్ ॥ క॥ తెలిపిన నిస్సంశయముగఁ । దెలియుచుఁ బ్రణవార్థమిదియ దృఢముగఁ దనయా । పలుకుదు నిన్నను నన్నను । కెలంవుగ నీశ్వరులమెన్న శివులముగనుకన్ ॥ వ॥ ఇట్లెవ్వరేని ప్రణవార్థంబెఱుంగు వారలు మత్సాఖ్యంబు నొందుదురు వేదాంతవిజ్ఞాన సునిశ్చితమతులును శుద్ధసత్త్వులైన యతీంద్రులకు బహ్మప్రాప్త్యైకసాధనంబిదియని ప్రసన్నహృదయుండగుచుఁ బరమేశ్వరుఁడు పుత్త్రమహాత్త్వంబైన యావుం తార్థంబెఱుంగ నీవకాక నధికారమదగ్రస్తుండగు చతుర్ముఖుం డెఱుంగ నేర్చునే ధ్యాననిర్ధూతకల్మషులగు యోగీంద్రులైన నెఱుంగఁజాలరు మదనుగ్రహంబున మద్భక్తులెఱింగి నట్లునీవును మత్స్వరూపంబవు గావున నీతదర్థంబ నీకుకరతలామలకంబై యుండు ॥ ఆ॥ వె॥ అంత యగస్త్యుడొకఁడెయధికారి యీయర్థ । మరయ యోగిగణములందు సుర్వి । నతనికీవు దెల్పు మస్మదనుజ్ఞను । విద్యయిదియు ధరణి వెలయు గాత ॥ క॥ అంతేవాసియు నీక । త్యంతము కుంభభవుఁడతని కాయర్థంబున్ । సంతసమున బోధించుట । యెంతయుఁ దగునను చుఁబలికె నీశ్వరుఁడంతన్ ॥ తే॥ గీ॥ వేగ కైలాసగిరికేగి వేడుకలర । శైలజనుగూడి పరిరంభ సౌఖ్యజలధి । పరఁగఁ దేలించి శాంభవపద్మభవుల । వృత్తమంతయు వచియించె విశదముగను ॥ క॥ కౌమరుని యద్భుత చర్యలు । కోమలి యొప్పఁగ నాలకించి ముకుళంబులరన్ । రమణీమణి గిరికన్యక । రమణున కనియెన్ మనోహరంబగు భణితిన్ ॥ క॥ లోకాతీతంబైన ఠి । నీకౌమరునిమహిమ యొట్లు నేర్చెనో శిశువై । లోకములెల్ల సృజింపఁగ । ప్రాకటముగఁ దెల్పు శ్రోత్రపర్వముగాఁగన్ ॥ క॥ రూపంబెట్టిది యీతని । కీపగిది విభూతిదనయ వితఁడేమహిమన్ । జాపట్టు వీర్యమెట్లన । యూపింపుము సత్కృపానిరూఢిన్ నాథున్ ॥ క॥ అనిన వధూమణితోఁ దను । మనసిజమదభంజనుండు మానుగ ననియె । న్వనుమ్నాసుందరినీకే । ననయము వినుపింతు నతిరహస్యంబిదియున్ ॥ తే॥ గీ॥ నేనుశివుఁడను బూర్ణుండ నిష్కళుండ । నీవు మచ్ఛక్తివనపాయినిబిదినిజము । ప్రకృతివగుదీవు నేనును బ్రత్యయంబు । నీవు శబ్దంబ వర్థంబు నేనుదరుణి॥ తే॥ గీ॥ జగమగుదువీవు నాథుండ నగుదు నేను । పంచకృత్యపరుండనై పరగుచుందు । పంచవక్త్రుండ నేనబ్జపత్త్రనేత్ర । యేకవక్త్రవు మదభిన్నవీవు పణతి ॥ వ॥ అదిగావున త్వద్రూపంబు మద్రూపంబునగుటను నిష్కుమారుండు పంచకృత్యపరుండగుచు షణ్ముఖుండనియును గృత్తికాస్తన్యపానంబుననన ప్రవర్థిల్లుటం జేసి కార్తికేయుండనియును బర్వతపుత్త్రివైన నీకుపుత్త్రుండగుటపార్వతీసుతుండనియును విక్రమంబున జగత్త్రయంబాక్రమించుట స్కందుండనియును భక్తులనుగ్రపదవి కొం

దించుట నాకస్మియను జేరొప్ప మత్సంభవుండగుట నేనియు మదీయలలాటాగ్నికముద్భవుండగుట నేనియు నగ్నిచేతభరింపంబడుట నేనియు నగ్నిభూవనియును వేదాంతంబులదహరాకాశంబగు హృదయనంబను నంతర్నిష్ఠుండగుట గుహుండనియును జరామృత్యురహితుండగుటఁ గుమారుండనియును శరవణంబున జన్మించుట శరవణోద్భవుండనియును బ్రాహ్మణులకుదేవుండగుట సుబ్రహ్మణ్యుండనియును నాయనుజ్ఞచే మహాసేనుండును నింద్రునితోడసఖ్యంబు వాటించుట మహాసేనుండనియును హరిప్రముఖనిఖిలసురగణంబులగు సేనలదుఃఖాంతంబు నొందించుట సేనాని యనియును గంగయందుద్భవించుట గాంగేయుండనియును గీర్తింపబండును మఱియు సత్యసంకల్పసత్యకామవిశ్వాధికాదిరనామంబు లసంఖ్యాతంబులు నగు ప్రసిద్ధంబులైన యవి వచించితి నిన్నియు యుక్తిదంబులు నిందొందుపఠించిన యంతమాత్రంబునఁబురుషునకుఁ బురుషార్థచతుష్టయంబు లభించు బ్రహ్మహత్యాది పాపంబులంటవు వినుము మితవిరూపంబు నిష్కళంకంబును సచ్చిదానందంబును బరంజ్యోతియు మహాత్ములకు మహాత్తు ననుపమంబును జంద్రసూర్యాగ్నివిద్యుత్తారకాది తేజంబు లితనితేజంబు ననుసరించును సూత్రంబున మణిగణంబులుం బోలె నితనియందు నిఖిలభూతంబు లధివసించు నిదియు నీతనయునకు స్వాభావికరూపంబు మఱియు భువనాత్మకంబైన యస్వరూపంబు వినుము త్రిదివంబు మూర్ధంబును గగనంబు నాభియు సప్తపాతాళంబులుఁబాదంబులును సోమసూర్యవైశ్వానరులులోచనంబులును దిశలుబాహువులు నోషధులురోమంబులును భూతంబులింద్రియంబు లష్టాదులువిషయంబులై పరగు లోకానుగ్రహార్థంబుగా షడ్వక్త్రంబులును ద్వాదశభుజంబులును నష్టాదశలోచనంబులును నైన శుభరూపంబదియు నాబ్రహ్మంబు చేత సంగీకరింపంబడియె దేవీ యీరూపంబెవ్వరు తలంతురు వారు ధన్యులు జగద్వంద్యులుపరమపవిత్రులు భూలోకంబున నితనిపదభక్తులగు వారు త్రిదశులకైనను వందనీయులు మనకు నత్యంతంబు ప్రియులగుమఱింక నేత న్మహిమంబు వర్ణించెద నాకర్ణింపుము॥

కుమారునిప్రభావముశంకరుండుగౌరితోఁజెప్పుట.

క॥ ఈతని యనుమతి లోక । వ్రాతంబు సృజించుఁ దానచ్ఛబ్రహ్మలతో । ధాతయు పాలనమేరయును । ఖ్యాతిగ నారాయణుండు గరుణదలిర్పన్ ॥ క॥ ప్రాణాది భేదములతో । ప్రాణులయందెల్ల నిలిచి పవమానుండున్ । బూనును జగదుద్ధరణము । నీనందను శాసనమున నీరజవదనా ॥ క॥ లోకంబులఁ బ్రాకిలనా । లోకంబు ఘటించు మిగుల లోకేక్షణుఁడున్ । ప్రాకటముగ నీకొమరుని । భీకరమగు నాజ్ఞకాత్మ బెదరుచు నెపుడున్ ॥ క॥ హవ్యంబు లిచ్చు సురలకు । కవ్యములఁ బొసంగు నెపుడు క్రవ్యాదులకున్ । హవ్యభుజుండు త్వదాజ్ఞను । భవ్యంబుగ కర్తయగుచు పాకక్రియలకున్ ॥ ఆ॥వె॥ నీలవేణి వినుము నీ కుమారుని యాజ్ఞ । వీడలేక గాడ మృత్యువెపుడు । జీవసంఘములను జెలువొప్ప వసియించు । వార్ధిభీషణముల యాతనలను॥ ఆ॥వె॥ జీవకోటి నెపుడు జీవింపఁ జేయును । నార్తికేయు నాజ్ఞఁ నాదిజగము । అఖిలభూతములకు నాకాశమవకాశ । మొసఁగు సంతతంబు మిసరుహాక్షి॥ క॥ కాలము సృజించు జీవుల । కాలంబే సంహరించు కాలాధీనం । బోలిసువుత్రుని నీ । కాలమువిభవకార్య బనవుకు శైవశమునాయి ॥క॥ వారిధులు పర్వతంబులు । వారిధరములును వటులనుమరి భరణులు



ధారయఁ దదధీనంబగు । నేరికి లంఘింపఁగూడ దీతనియాజ్ఞన్ ।క॥ నానాజగములకెంతయు । మానుగ నుపకార మిదియుమానిని వినుమా । యానందము పొలుపొంపఁగ । సేనానివినూతి నీకు జెప్పెద నేనున్ ॥వ॥ దేవీ సర్వభూతాత్మకుండును సర్వలోకాత్మకుండును సనాతనంబైన సాక్షాత్పరబ్రహ్మంబు నీ సుబ్రహ్మణ్యుండే యగు సిద్ధిబుద్ధి సంపత్తేజోబలంబుల నూర్జితంబై చూపట్టునది యంతయు భవత్సుతుని భూతి యనియెఱుంగుము దీపంబు దీపాంతరంబైన చందంబున నేనపుత్త్రిభావంబునొందితి దీపాంతరమహాత్మ్యంబున దీపంబు మహిమ వెలుంగు నట్లు మదీయ మహిమయే మత్పుత్త్రిమహిమయై యెఱుంగు మితనివిభూతిజగంబెల్లెడ విజృంభించు నిదియెట్లనిన నీతఁడనంత రుద్రులలోనఁ గాలాగ్నిరుద్రుండును శంఖచక్రనందక కౌమోదకీ ధారులగు విష్ణువులలో నాదివిష్ణుండును జతుర్ముఖులలోన వాసుదేవుండును శస్త్రిధరులలోన రాముండును వృష్టివంశజులలోన వసుదేవసుతుండును బాండవులలోన ధనంజయుండును బ్రజాపతులలోనఁ జతుర్ముఖుండును మనువులలోన స్వాయంభువమనువును దేవతలలో నింద్రుండును దేవోవంతుల లోన నగ్నియును బితరులలోనయముండును బలయుతులలోననీలుండును, గంధర్వులలోఁజిత్రరథుండును, నిధులలోన ధనదుండును, దిక్పాలకులలోన నీశానుండును, గజేంద్రంబులలోన నైరావతంబును, దరంగిణులలోన భాగీరథియు; రుద్రులలోన శంకరుండును, వసువులలోన వాసవుండును, నాదిత్యులలోనవిష్ణువు; భిషగ్జనులలోన నశ్వినులును, దైత్యులలోనప్రహ్లాదుండును, సర్పంబులలోన వాసుకియు, మృగంబులలోన మృగేంద్రుండును, విహంగంబులలోన గరుడుండును, బ్రహ్మర్షులలోన వశిష్ఠుండును, దేవఋషులలోన నారదుండును, సర్వవృక్షంబులలోన నశ్వత్థంబును, మానవులలో భూసురుఁడితండగు నిజ్జగంబున దేవతిర్యఙ్నరప్రకృతులందు నెందెందు వీర్యసంపత్కీర్తి విద్యాజ్ఞానాధికం బలరునది సమస్తంబితని నిదేశంబగు నిశ్చయంబిది సంక్షేపరూపంబునం జెప్పితి విస్తరించి నుడువ శతకోటివర్షంబులలోన నశక్యంబగు ప్రసంగవశంబున నింతయు నెఱింగింపంబడియె నింక నాచే నెఱుంగవలయు నదిలోకరక్షణార్థంబుగాఁ దగు మని, ప్రసన్నాత్ముండగుచు నప్పరమేశ్వరుండు కుమారవిభవంబు లోకానుగ్రహార్థంబుగాఁ బార్వతికెఱింగించి యంతఃపురంబున గిరిజాసమేతుండగుచు నిరంతర సౌఖ్యంబులఁ దలరుచుండె నంతయు ॥మ॥ చరణాలంకృత భోగినూపురకృపాశాన్యన్యదధ్వాంతసం । హరణాదిత్య విభావిభాసురసురాప్లవప్రభాసైకబం । ధురకారుణ్య సుధారసాకరకరా తుర్యావనోగ్రగిరాలార్చిర । తక్రూరహావ్యాఘ్రయుతకుఁజరాశర శరద్ధారాధరచ్ఛాయాకృతీ ॥క॥ పారసభవాది సురగణ । పారసపర్యాయుతాంఘ్రి సారసకరుణా ; పారసహితనిఖిలాగమ । పార సకలభక్తహృదయసారసమిత్రా ॥పృథ్వీవృత్తము॥ ధరాధరధనుర్ధరాధర విదారిముఖ్యోద్ధరాధరాధరసుతాధరా దరసుధారసేచ్ఛాధరా । ధరారిమణినీలకంధరనత ప్రజాపద్ధరా । ధరాధరధురంధరా ధరపదస్థ గంగాధరా॥

గద్య ॥ ఇది శ్రీమదిందుధరసుందర పాదారవిందార్పిత హృచ్ఛతపత్రసకలసుకవిజనానుగ్రహపాత్రసుగుణస్తోత్రపవిత్రచరిత్ర కాశ్యపస గోత్రకోడూరియెల్లనార్యపౌత్రశంకరామాత్యపుత్ర లక్ష్మాంబికాతనయ వినయవిధేయ బాలసరస్వతీ నామాంక వేంకటాచలకవి ప్రణీతంబైన శ్రీస్కాందంబను మహాపురాణాంతర్గత శివరహస్య ఖండంబునసంభవకాండమందుఁ జతుర్థాశ్వాసము



శ్రీ ర స్తు.

# శివరహస్యఖండము.

## సంభవకాండము

## పంచమాశ్వాసము

శ్రీరాజన్మకుమారక । భూరమణమనోరథార్థపూరణ విబుధ । ప్రారదహారహీరమణీ శ్రీరమణీయామలాంగ శ్రీశివలింగా ॥ వ॥ అవధరింపుము శౌనకాదిమహామునులకు సూతుండిట్లనియె ॥ క॥ లోకప్రసిద్ధికరముగ । శ్రీకంఠుఁడట్లు చెప్పఁ దెలువఁగ దివిష । ల్లోకంబులనందంబున । శోకంగీర్తించిరెల్ల సుందరులతిసన్ ॥ వ॥ ఆసమయంబున ॥ మ॥ స్మరరాజ్యేందిరలో నచంచలలసత్సౌదామినీవల్లులో । మరువంపు న్విరిబంతులో నవసుధామాధుర్యపుంజంబులోఁ । బరగన్ సానలఁదీరు రత్నములొ శృంగారపుం బొమ్మలో । ధరణీమండలి నావిచిత్రతర సౌందర్యంబుఁ జూపట్టుచున్ ॥ క॥ ఘేరమృతవల్లి నా యొక । నారియు సౌందర్యవల్లి నా యొకసతియున్ । వారిజముల బుట్టిరెలమి వనితలిరువురన్ ॥ క॥ ఆకన్యలశృంగారం । బాకాంతివిలాసవిభ్రమాతిశయంబుల్ । లోకత్రయమం దరయఁగ । నేకాంతలయందునైన నెన్నఁగఁగలదే ॥ క॥ ముద్దుగ మోములు సామిని । ముద్దుగఁ గిన్నరులు పాడ ముచ్చటదనరన్ । మద్దియలా యిద్దఱువిని । తద్దయు మోహింధిమిగుల దత్పరమతులై ॥ చ॥ అతనివరించు వాంఛ వికచాంబుజనేత్రలు శ్రౌమ్యలిర్వురుం । బ్రీతిదివమున్నదాకృతిని భావనఁ జేయుచుఁ దచ్చరిత్రముల్ । శ్రుతియుగపర్వమొప్ప వినుచున్ సతతంబు తదేకచింతతో । నతనునిశాతసాయక మహానలకీలలఁ గ్రాగుచుండఁగన్ ॥ సీ॥ అహారనిద్రలు నన్నియు వర్జించి వస్త్రభూషణముల వాంఛఁ దొలఁగి । స్వర్ణదీతటమున శరవణంబందును బద్మతటాకంబు పజ్జఁజేరి । వ్రతశీలలగుచును పరతపోగరిమను నిత్యంబు నత్యంత నియమమొప్ప । వల్కలాంబరములు వారకధరియించి పొలుపొంద మేనను భూతినలఁది । మెడను రుద్రాక్షమాలికల్ మెఱయఁ దాల్చి । సంతతంబు షడాక్షరీ జపముఁ దనర । బహుదినములును భజియింపఁ బరమభక్తి । వారినిష్ఠకుఁ బ్రముదితస్వాంతుఁడగుచు ॥

### సౌందర్యామృతవల్లులకుగుమారస్వామి ప్రత్యక్షమగుట

వ॥ అమ్మహాసేనుండు మందస్మితవదనారవిందుండగుచు నయ్యిందువదనలకు బ్రత్యక్షంబైనఁ గనుంగొని రోమాంచితదేహలగుచు నయ్యమృతవల్లి సౌందర్యవల్లులు భవానీకుమారపాదాంబుజంములకుం బ్రణమిల్లి యంజలిపుటింపుచుం బార్శ్వంబుల నిలచి రప్పుడు ॥ క॥ స్వామిగనుంగొని వారలు । దాయురనదళాక్షులార దయఁజేసెదన్నా । కామితముఁ దెలుపు డనవుఁడు । గామినులిట్లనిరి



దేవ కరుణాంబునిధీ ॥ క॥ పరమకృపామతి మాకున్ । వరమియ్యఁ దలంచితేని వసుమతిమమ్మున్ । వరియింపు నిన్ను బతిఁగా । నిరతముఁ గోరెదము మదిని నిర్మలచరితా ॥ వ॥ అని ప్రార్థించిన సంతుష్టుండగుచు నమ్మగువలకు సుబ్రహ్మణ్యుండిట్లనియె ॥ క॥ సమయమగు వేళ మిమ్ములఁ । గమలాయతనేత్రలార గరిమవరింతున్ । శ్రమయేల మీయభీష్టము । క్రమమొప్ప ఫలించునని చుఁ గౌతుకమలరన్ ॥ వ॥ అంత నయ్యమృతవల్లిని దేవలోకంబున నింద్రునకుం బుత్త్రికవై జనింపుమనియును సౌందర్యవల్లిని భూలోకంబున శివమునికిసద్భవంబగుమనియు నాజ్ఞాపించి శివపదంబుఁ దలంచుచుఁ గైలాసంబున కరిగి జననీజనకులసన్నిధి నలంకరింపుచుఁ దత్పాదపద్మంబులకు నమస్కరించి బద్ధాంజలిపుటుండై నిలిచిన నక్కుమారుని గిరిజాగిరీశులు వేఱువేఱ నాలింగనంబుఁ జేయుచు మూర్ధాఘ్రాణంబొనరించి యంకంబున నిడుకొని లాలింపుచునదుమనునిచికొనిరప్పుడు గజేంద్రముఖుం దయిత దీయసందర్శనంబున మోక్షసామ్రాజ్యసుఖము నొందిరెంతయు ॥ తే॥గీ॥ అలకుమారునితోడను నంబతోడ । విష్టగోష్ఠిని దెలువొందు నిందుమౌళి । పరమభక్తిని గనుఁగొని బ్రణుతిఁ జేయ । వారె ధన్యులుపూజ్యులు వసుధలోన ॥ వ॥ ఇవ్విధంబున శివుండు పార్వతీషణ్ముఖసమేతుండై యుండుసమయంబున ॥ క॥ హరిముఖసుపర్వగణములు । పరగం గైలాసగిరికి బంధురగతిచే । నరుదెంచి భక్తిదనరఁగ । హరభవనద్వారవాసులగుచు జిరంబున్ ॥ క॥ నందిని పూజాస్తవములఁ । బొందుగసంప్రీతుఁజేసి భూరికృపాబ్ధీ । యిందుకళాధరుదర్శన । మొందఁగ సుఘటింపు మనుఁడు ముదమున నతఁడున్ ॥ తే॥గీ॥ జ్ఞాతసమయుండు నగుచు సుప్రీతిదనర । విబుధులను జూచి యిదివేళగాదు । శంభుదర్శింపనుండుడు సమయమైన । విన్నపముఁ జేసి మిమ్ము సేవింపఁజేతు ॥ వ॥ అని నశైలాదివచనప్రకారంబున బహుకాలంబు కైలాసశైలంబున వసియించి యొక్కనాఁడు దివౌకసులు శాలంకాయనగోత్రునకు విజ్ఞాపనంబుఁ జేసిన ॥ క॥ చనియంత్రఃపురమునకున్ । ఘనుఁడానందీశుఁ డీశుఁ గనినమ్రుండై । వినయమున విన్నవించెను । మనసిజదర్పదవిభంగ మహితశుభాంగా ॥

### శూరపద్మాసుర బాధితులైన సురలు శంకరుని దర్శించుట

తే॥గీ॥ శూరపద్మాసురుని బాధ గ్రుక్కి మిగుల । విబుధబృందంబు లిందిరావిభునితోడ । గాచియున్నారు ద్వారంబుకడ తడవుగ । నిపుడు దేవరదర్శనం బియ్యఁదగును ॥ వ॥ అని నందీశ్వరుండు విన్నవించిన విని భగవంతుండగు సాంబుండు కుమారసహితుండునగుచు తివిజాలసన్నిధికిం దోతేరం దృక్సంజ్ఞ నమజ్ఞనొసంగిన ॥ తే॥గీ॥ నందివేగంబ నిర్జరబృందములను । నిందుశేఖరు సన్నిధియందుఁ జేర్చి । నప్పుడవ్వేల్పు లత్యంతహర్షమలర । నంజలులు చేసివినయంబు రంజిలంగ ॥ వ॥ అవ్యయుండును సర్వజ్ఞుండును, సర్వకర్తయు, సర్వలోకేశ్వరుండును, సాంబుండును, సుకుమారుండును, నగు మహాదేవు చరణాంబుజంబులకుం బ్రణమిల్లి యర్ఘ్యపాద్యాదిపూజలను సంస్తవంబులను నతని నభిముఖునిగా నుపాసనఁ జేసిరెంతయు ॥ మ॥ శరిచర్మాంబర సన్నిధానమును వేడ్కం జేరి సర్వేశ్వరుం । డురుభక్తిం గొనియాడె శంకర హరా యోదేవ సర్వేశ నీ । చరణాంభోజనమస్క్రియామహిమచేన్ సత్యంబుగా నేఁడు శ్రీ । ధరవాణీధవముఖ్యనిర్జరవరుల్ ధన్యాత్ములైరక్కటా ॥ వ॥ అంత నద్దేవమునివర్యులందఱు కృతాంజలులగుచు సంబికావల్లభుండగు మహాదేవున

ఘు నగుచు నస్త్రద్వయంబు నెఱుంగక నిన్ను నీవ కొనియాడెదవు మున్ను దేవతలతోడను సంగరంబు న శార్ఙ్గకోదండ నభీకాదిత్యసంకాశంబగు విష్ణుచక్రంబును, పాకశాసను శతకోటియుఁ, పావకు శక్తియు, వైవస్వతు దండంబును, గ్రవ్యాదు ఖడ్గంబును, వరుణుని పాశంబును, సమీరణు ధ్వజంబును, ధనదుని గదయును, శూలి శూలంబును, బ్రహ్మాయస్త్రంబును, మద్బాహువీర్యంబున భగ్నంబులై చిరకాలంబు సురలు పరాజితులగుట యెఱుంగవే యిప్పుడు నీయున్నమంత్ర సోదరులను, భూతగణంబులం బరిమార్చెద బలసమేతుండవై భవద్విభుని మార్కొని జయించెదఁ గనుంగొను మని గర్జింపుచు కుండాఖండాగ్రశబలితదిఙ్మండలుండును, మదవిహ్వలుండును, దురాసదుండునగు నత్తారకుని నవక్రవిక్రమోజ్జ్వలద్బాహుండగు వీరబాహుండు హేమపుంఖోజ్జ్వలంబులు ననలసన్నిభంబులును, నిజనామచిహ్నితంబులునగు నారాచంబులం గప్పినఁ దారకుం డవియున్నియుఁ బ్రతినారాచంబులం దునిమె మఱియుం గరలాఘవంబునఁ దనర వీరబాహుఁడు బాణంబు లసంఖ్యంబులు గ్రలింప నవియు నద్దానవేంద్రుండు నుగ్రశిఖంబుల నివారించె నిర్విఘ్నంబునం బోరు ఘోరంబయ్యె నయ్యెడ ॥ఆ॥వె॥ దశసహస్రసంఖ్యఁ దనరార మఱియును । దానవుండు బాణతతులు గురియ । ద్వాదశాంబులయిన దారుణశరముల । వీరబాహుఁ డవియు వేగఁ దునిమె ॥ వ॥ తారకుండంత నవ్వీరబాహు కరలాఘవంబునుంగని క్రోధంబునఁ బరయ గాంతకేలియుం బోలె నాగ్నేయాస్త్రంబు శరాసనంబునం గూర్చి ప్రయోగింప నదియు నత్యద్భుతంబుగ జ్వాలాజాలంబులు నిగుడ లోకంబులు గప్పి బ్రహ్మాండకటాహంబు చిటచిటార్భటులనిండి వ్యాపించినం గనుంగొని దివి దేవగణంబులు కంపించె వీరబాహుండు నవ్వుచు శీఘ్రంబున బ్రహ్మాగ్నేయంబునఁ దత్పావకాస్త్రంబు వారించె మఱ్ఱమ్మఱ్ఱంబున శమించుట లోకంబున నత్యద్భుతంబిదియు ॥క॥ ఇలవణఁక నంతగజముఖుఁ డలరఁగ ధరియించి వారుణాస్త్రము నుఱుముల్ । బలుఘోషింపఁగఁ బ్రాప్య । జ్జలదావృతమట్లుఁ జేసె సకలజగంబుల్ ।క॥ వారణ దైత్యుని సునిశిత । వారుణబాణంబుఁ గాంచి వానినికినుకన్ । వీరుండు వీరబాహుఁడు । వారించెను దాని వేగవాయవ్యమునన్ ॥వ॥ అవ్వగ్రహాక్రాంతంబుబోలె నమ్మేఘమండలంబు శీర్ణమయ్యె ॥క॥ జలధరమండలి విచ్చిన । దలివొందెను దిశలు దివిదివిజసమూహం । బలరుచులవానలు గురిసెను । బలుముఖు నవ్వీరబాహుపై నుత్కలికన్ ॥క॥ తారకుఁడు మఱియు శీఘ్రము । సౌరాస్త్రము నేయ దాన సంజనితములై । నూరసహస్రము లర్కులు । సారూప్య తపింపఁ జేసె నఖిలజగములన్ ॥తే॥గీ॥ వీరబాహుఁడు గనుఁగొని విజయమెసఁగ । వారుణాస్త్రంబు వఱపిన వారిదములు । పరగ జనియించి గప్పెను భానుగణము । తారకుండంత నిజభుజాదర్పమొప్ప ॥క॥ సోమాస్త్రంబునుబఱపినసోమాస్త్రంబునవారించె సురచిరకార్యా! ద్ధాతుండౌ వీరబాహుఁడు ప్రేమస్వీకింప దివిజబృందములు దివిన్ ॥వ॥ మఱియు నైంద్రంబైంద్రంబున, యామ్యంబుయామ్యంబున, నైఋత్యంబు నైఋత్యంబున వీరబాహుండువారించె నప్పుడు ॥క॥సురరిపు డగ్రహతివారితముఖబరగెడు బ్రహ్మాస్త్రమేయఁ బట్టుగతి నదియుం । బరమునకు నిగనె జగముల్ । సురువడి విశ్వమునగను కొనరించుకతన్ ॥క॥ నిరుపమమగు నయ్యస్త్రము । శరలాఘవమొప్పఁ దునిమెఁ గిభవరుబునభా । సురమగు నయ్యస్త్రంబునఁ । బరదర్పహరుండు వీరబాహుఁడు కడిమిన్ ॥



—: తారకుండు వీరబాహునిపై నారాయణాస్త్రంబు వైచుట :—

వ॥ వెండియుం దారకుండు సర్వశత్రునిబర్హణంబైన నారాయణాస్త్రంబుం బ్రయోగించిన వీరబాహుండు నారాయణాస్త్రంబున నివారించె నంత నతనివిక్రమంబుఁ గని దనుజుండు మాయాబలంబున క్రోధశరవృష్టిమార్గనిరోధకంబుగ జగంబంతయు నంధకారమగ్నంబుఁ జేయుచు బహురూపంబులతోడ బహువిధదివ్యాస్త్రంబులు బ్రయోగించిన వీరబాహుండాయోధనంబున వివిధరిపుమర్దనంబైన వీరభద్రాస్త్రంబు విడువఁ దద్దయుఁ దద్దర్శనమాత్రంబున నవియు విధ్వస్తంబులయ్యె మఱియు మాయావియైన దారకుండు దర్పంబుసడలకం జలంబునఁ బోరుచు రణాగ్రంబున శరపరంపరలు గురియుచు యుద్ధంబుసేయు వాడుంబోలె వీరబాహుని మాయామోహితుం జేసి నిమిషమాత్రంబున మూషకంబై క్రౌంచబిలంబు సొచ్చిన ॥ ఆ॥ వె॥ విరిగిపోయినట్టి విమతుని మర్దింప । ధర్మపథముగాదు ధరణి ననుచు । వీరబాహుఁ డంత వైరభద్రంబున । సంహరించి దనుజు జాడసరిగె ॥ వ॥ అంతఘోరంబును, మహాక్రౌరవసన్నిభంబును, దుర్నిరీక్ష్యంబైన యప్పర్వతబిలంబు సొచ్చినంత క్రౌంచంబును దారకనిదేశంబున ॥ క॥ మాయావియగుచు బహుతర । మాయలు బన్నుచు మహాతమఃపూరితమై । యేమెయిఁ జొరమార్గంబులు । సేయుచు నిర్గమనపథముఁ జెంగటఁగప్పెన్ ॥ వ॥ వీరబాహుండమ్మార్గంబుఁ బోయిపోయి తారకునిం గానక చిరకాలంబు చింతాక్రాంతుం డగుచు ॥ క॥ నావంటి వాని కకటా । యీవిధమున గాసిఁజేయు నీగిరిబిలముల్ । భూవలయంబున నన్యుం । గావింప దవాతులుగాఁగ క్షణమాత్రమునన్ ॥ క॥ ఆహా నాకన్నుంజిటు మోహము బాటిలదు స్వప్నమో మతిభ్రమమో । యూహాపోముసుపలేఁ గాదీ । బాహుస్ఫూర్తియును ధనువు[illegible]బాణములిపుడున్ ॥ క॥ మార్గములు గప్పె నెల్లెడ । మార్గణముల నొంచునట్లు మత్పరిపంథిన్ । దుర్గమమిదియని మదిని న । నగ్గళమోహంబునొంది యవ్వీరుండున్ ॥ వ॥ అంత నతని నన్వేషింపుచు వీరకంఠీరవాదులను గణవరులును, జతుఃపంచాశత్ప్రధానులును దద్బిలంబు సొచ్చి ప్రవేశమాత్రంబున వారలను మోహభ్రాంతులంజేసి యద్దానవాధముండు నిరోధించె నందు ॥ క॥ పరిమోహితులగు వారల । నరసి జయంబబ్బెననుచు హాస్యముతోడన్ । గిరిబిలము వెడలి తారకుఁ డురతరశౌర్యంబు మీఱ మద్ధతిలీలన్ ॥ క॥ అరదంబు నెక్కి ధనువును । శరములు సంధించి కేల సన్నద్ధుండై । బరిమార్చి భూతగణముల । వరుస న్నిశ్శంకుఁడగుచు వారనికడిమిన్ ॥ వ॥ అప్పుడా సేనాని సైన్యంబులనాయకంబులయ్యును ధైర్యంబవలంబించి నానాప్రహరణంబులం బ్రహరింపుచు, శిలలు ద్రువ్వుచు, వృక్షంబులఁ బెండుచుఁ, బర్వతంబులపయిం ద్రోయుచుం బోవఁ దారకుండొక్కరుండ యనేకసేనలమీఁదం దలపడి రణకోవిదుండై మహాక్రోధంబున దద్విశిఖశిల్లాతరుసాధరంబుల నన్నింటి నిం దుమురుంజేయుచు సరోజషండమండితంబులగు కాసారంబులను మదగజేంద్రంబులోలెఁ గుమారసైన్యంబులం గలంచె నంతయు ॥ శా॥ అంతంభూతగణంబు భగ్నమగుచున్ హాహాప్రఘోషంబు ల । త్యంతంబొప్ప నొకండుబోవు పథమున్ బ్రాప్తించక న్యుండుని । భ్రాంతిం బొంది యథాయథంబుగఁ జనెన్ బ్రహ్మాదిగీర్వాణులున్ । వంతంబొందుచుఁ జాతిభీతమనులు ప్రాణత్రాణపారీణులై ॥ క॥ కనుఁగొని యాయుద్ధంబును । మునివర్యుఁడు నారదుండు మోదముతోడన్ । ఘనకార్యనిధిని గుహునిం । గని యావృత్తాంతమెల్లఁ గడు వినుపిం

న రౌహిణేంద్ర చిత్రమట్లు । రాగమును మానిక్రమముగా రహిం జెలంగ । చంద్రబింబంబు ధవళిమసాంద్రమగుచు ॥ వ॥ అప్పుడక్కుమారుండు సురభూధరంబు ననుగ్రహింపం దలంచి యందు చతురంగబలంబుల నివేశింపం జేసి రథంబు డిగ్గి నివర్తిత సాయాహ్నికకృత్యుండగుచు గిరీంద్రుచేత కృతాతిథ్యుండై పరమానందంబునొందె నంతియు ॥ క॥ దివిజాలు ముదమున భవసం । భవునిం బ్రార్థించిరెలమి బహుతరభక్తిన్ । భువనాధిప నీవిచ్చో । నివసింపు దయార్ద్రదృష్టి నెలకొని మాపైన్ ॥ వ॥ ఏము భవత్పాదకమలంబు లర్చించెద మస్మదభీష్టంబు లీడేర్పు మనిన నంగీకరించి భక్తసందోహంబగు జగద్వల్లభుండు నిజపూజార్థంబు వారల కనుజ్ఞ నొసంగె నంత ॥ తే॥గీ॥ దేవశిల్పిని రావించి దివిజవరులు । హరకుమారుఁడు వసియింప హాటకాద్రి । మణిమయంబైన నగరంబు మహిమమీఱ । వేగ రచియింపు మనవుఁడు విశ్వకర్మ ॥ సీ॥ భవ్యనవోపలప్రాకారవలయముల్ గురుతరమణిమయగోపురములు । రత్నకూటోపమరమణీయసదనముల్ మహనీయతరదివ్యమంటపములు । భాసురాభ్రంకషప్రాసాదజాలముల్ విలసితసోపానవేదికలును । గంధేభకీలితాబంధురద్వారముల్ పృథుతరఘనవిచిత్రభిత్తికలను । కమలకల్హారపరిమళకలితలలిత । రమ్యకాసారకేళికారామతతులు । రాజవీథులు శతసహస్రంబులొప్పఁ । బురము నిర్మించె నప్పుడద్భుతముగాఁగ ॥ వ॥ అంత హరిబ్రహ్మదులత్యంతమోదంబున దేవదుందుభిశంఖకాహళరవంబులు మ్రోయఁ గాశ్యపాత్రివసిష్ఠాది మహామునులును నిగమాగమార్థజ్ఞులగు విప్రవరులు పూర్ణకుంభంబులు కరంబుల ధరియించి స్వస్త్యయనంబులు చెప్ప ముక్తావితానశోభితంబును రత్నప్రభాదేదీప్యమానంబగు రాజవేశ్మంబు రాజాధిరాజనందనునిం బ్రవేశింపం జేసి రి గణపుంగవులు యథార్హభవనంబుల న్నివసించిరంతియు ॥ తే॥గీ॥ వీరబాహుండు హస్తారవిందములను । రత్నపాదుక లందియ్యగమణమెట్టి । దివ్యధామంబునందును దీప్తి యొసఁగ । నధివసించె ప్రసన్నుఁడై హరసుతుండు ॥ వ॥ ఇట్లు సింహాసనాసీనుండైన యాదేవుని సకలదివిజాలు నికటంబున నంజలిపుటఘటితనిటలతటులగుచు వివిధస్తోత్రంబుల నర్ఘ్యపాద్యాద్యుపచారంబుల సంప్రీతుం జేసి యావరణదేవతలగు వీరబాహుప్రముఖుల శాస్త్రోక్తవిధానంబుగ సపర్యల సంతుష్టుం జేసి యెల్లరును కృతార్థులైరి జగద్వంద్యుండైన నక్కుమారుండు కైలాసమునందు శంకరుండు బోలె మేరుగిరియందు గణముఖ్యులతోడ దేవగణసమేతుండై క్రీడార్థంబుగా నివసించె నంతియు ॥

## తారకాసురుమృతికిఁ దత్పత్నులు విలపించుట.

ఉ॥ తారకుఁ డాజిఁ గూలుటకుఁ దత్ప్రియపత్నులు సౌరియాదిగా । తారకభార్యలందఱును దద్దయు దుఃఖభరంబుచే సమి । ద్ధారుణియందుఁ జేరి కనుదమ్ముల బ్రాలఁగ నశ్రుబిందువుల్ । హా రుసికీకవాద్ధ్వనుల సారెకు నేడ్చిరి నేలఁ దూలుచున్ ॥ క॥ హా రమణ యెందుఁ బోయితి । నీ రమణులమమ్ము విడిచి నీపోయిన యీ । దారిన మేము వచ్చెద । మారయ భవదంఘ్రిసేవ యాస్వాదముగాన్ ॥ సీ॥ నేడు గాంచితిగదా నిఖిలనిర్జరవరుల్ గడునిరాతంకులై కౌతుకంబు । నేడుకా పొందిరి నిందారమోదంబు చారణముని సిద్ధసంఘములును । నేడు నిర్జితుఁడయ్యె నిజభుజాదర్పంబుఁ దూలఁగుచు శూరపద్ముండు దలఁప । నేడు హతుండయ్యె నిక్కంబు ప్రాభవమఁ గోల్పోయి సింహముఖుండు మిగుల । హరిసుదర్శన మివ్వానియురమునఁ దాకె । భూషణప్రాయమయ్యెను బోలె.



లోన । నటి నిన్నును గకటార్చె నహాహా నెట్లు । శక్తి దేనొక్క బాలుండు శౌర్యమెసఁగ ॥ క॥ జలజభవాస్త్రియు వాసవు । కులిశంబెవ్వాని బ్రమోలఁ గుంఠితములగున్ । బలశాలివట్టి నిన్నున్ । బలమణఁచెను శక్తిచేత బాలుండాజిన్ ॥ వ॥ అని బహువిధంబుల విలాపించుచు స్వాంతంబు నందు దుఃఖంబు నిండి యశ్రువర్షంబులుం గురియుచు శోకసంతప్తహృదయలై తత్పత్నులందఱట్లు పరివేష్టించి యున్న యెడ ॥ మ॥ అలఘుక్రౌంచ గజాశ్వనూనుఁ డసురేంద్రాఖ్యుండు తా స్వేచ్ఛగా । నలపింహాస్యుని వీటనుండి జన్యమున్ హర్షంబుతోఁ జూడ నే । నలుగొల్వం దనుదెంచి మార్గమున నానాదుర్నిమిత్తంబులన్ । బలువీక్షింపుచుఁ దన్మనోస్వనియమనల్పంబైన ఖేదంబునన్ ॥ వ॥ శీఘ్రంబ పురంబు చేరి॥ చ॥ విదళితమూలమైన పృథివీరుహమట్లు ధరిత్రి వ్రాలి బల్విదనముచిన్నఁబోయి కటినస్త్రీముతోడ విముక్తకేశుఁడై । హృదయము గుందదైన్యమున నేడ్చు హా జనకా పరేతరాట్ పదమును జేరితే దివిజభంజన మమ్ములఁ బాసిపోయితే ॥ తే॥గీ॥ శౌరిచక్రంబు కంఠభూషణము గాఁగ । దాల్చె నెవ్వాఁడు వజ్రంబు ధారదరగ । భండనంబున నెవ్వనిఁ జెండలేక । నట్టివీరుని నర్భకుం డెట్టుఁ దునిమె ॥ వ॥ అని సమరాంగణంబున గతప్రాణుండైన దండ్రినిం గని శోకింపుచు నాకుంచిత్తులగు జనులకు విషాదంబు జనింప విలపించె నంతియు॥ శా॥ శాంతింబొందను నేఁడు నిర్జరమనో జాలావళుల్ నేఁడహో । కాంతుల్ వాసవుఁ డొందఁ గల్గె శచియుం గౌతూహలంబొప్పన । త్యంతంబప్సరులున్ వరించిరి సుపర్వానీకము న్నేఁడహో । యింతే పట్టణమయ్యె స్వర్గమున రాభీష్టంబులుం జేసరన్ ॥ తే॥గీ॥ శూరపద్ముండు నేఁడిది బీరమణఁగ । సింహవక్త్రుండు నేఁడిది చెలువుఁదక్క । భగ్నవాంఛితులై హతప్రాణులైరి । పోరిలో వీరిదతుల భుజము పడిసె ॥ వ॥ అని పెద్దయుం బ్రొద్దు శోకవివశుండై చింతింపుచు దైన్యాకులచిత్తుండును విలోకితదశదిశాభాగుండును దష్టదంతాధరోష్ఠభీషణుండును క్రోధారుణవీక్షణుండును నై యట్టహాసంబుఁ జేయుచు గంధకాష్ఠంబుల చితిఘటించి విధిపూర్వకంబుగా జననీజనకులకు నౌర్ధ్వదైహికంబు నిర్వర్తించి శీఘ్రంబ చతురంగబలంబుతోడ వీరమహేంద్రపురంబుఁ జేరి యందు ॥ క॥ జనకజ్యేష్ఠుని మాయా । తనుజాతుని శూరపద్ము దైత్యవరేణ్యుం । గనుఁగొని పాదంబులపై । వనయుఁడుఁ బడిశోకార్తుఁడై విలపింపన్ ॥ వ॥ శూరపద్ముండా భ్రాతృతనూజుండగు వసురేంద్రుని కరంబు బట్టి లేపి యాలింగనంబుఁ జేయుచు వత్సా నీవిట్లు శోకింప నేల భయంబు విడువుమని కన్నీరు దుడుచుచు నూఱడించిన జ్యేష్ఠపితృవ్యునకుఁ దారకసుతుండు శోకకారణంబగు తద్వృత్తాంతంబంతయు వినిపించె నప్పుడు ॥ క॥ అంతం గుందుచు మదిలో । నెంతయు నా శూరపద్ముఁ డిది వినవలయున్ । వింతగ మత్సోదరునకు । నింతటి యాపద నుఁజేయ దైవ్యంబొ హరన్ ॥ వ॥ అష్టదిక్పాలాభిభూతంబులైన బ్రహ్మాండంబుల లోన దివిషులెవ్వారును మత్సోదరు పరాక్రమంబునకు నిలువనోప రివ్విధ బలాఢ్యుఁడగు వారసూనుచేత సమరంబున హతుండయ్యెనటది యసత్యంబుగా తోఁచు నీవు బాలుండవగుటం జేసి భ్రమించితివో స్వప్నంబుఁ గాంచితివో కాక యిది నిశ్చయంబగునే వెఱవవలదు శోకంబుడుగుమని శూరపద్ముండతనితో నిట్లనియె ॥ క॥ కాదిది భ్రాంతియు స్వప్నముఁ । గాదిది వినుమార్యదైత్యకుల శ్రేష్ఠ । గాదన్యుండొకండు వచ్చితి । నీదండకు సుఖింప భీతిని నే నచటున్ ॥ వ॥ తారకుండట్లు సమరంబున పడిన వలదునీపాదంబులాన యునవృండు ॥

—:*తారకాసురుమృతికిశూరపద్మాదులువిలపించుట*:—

ఆ॥వె॥ శ్రోత్రశల్యమైన సుతువాక్యమాలించి । శూరపద్ముఁడాత్మ సొంపుఁదక్కి । ధరాసనంబుడిగ్గి యవనిపై బడి కడు । భ్రాతృశోకమునను బడలె మిగుల ॥వ॥ అంత సింహవక్త్రుండును భ్రాతృవధంబు విని భగ్నమూలంబైన వృక్షంబునుంబోలె నేలఁబడి వికీర్ణకేశుండును ధూళిధూసరిత విగ్రహుండునునై విలపింప దొణంగ ॥క॥ కరములనెత్తుముఁ దమ్మునిఁ । యురంబునఁ గడుఁ గౌఁగలించి యురుదైన్యముతోఁ । సురరిపుపతి విధి దూరెను । గురుతర హాహాప్రలాప ఘోషితదిశుఁడై ॥వ॥ అంత నఖిలమంత్రులు సేనాధిపతులును విద్వత్పురోహితులును నాదిగాఁగల సకలజనంబులును దుఃఖించి రప్పుడు దీనవదనుండగుచు మూర్ఛాక్రాంతుండై పడియున్న శూరపద్మునిఁ దన్మంత్రివర్యులుపచారంబులనుగుడసంజాతచేతన్యుం జేసి రంతయు ॥క॥ ధృతిశాలిశూరపద్ముఁడు। గతమూర్ఛుండగుచు లేచి ఘనతరరోషాన్వితుఁడై పండ్లుంగీటుచు। వితతాట్టహాసంబెసంగఁ జించిదిశల్ ॥ను॥ కరముల్ దట్టిచరాచరంబయినలోకంబెల్లనత్యంతమున్ । స్ఫురదీక్షాగ్నులనిర్దహించుకరణింబట్టుచున్ హుంకృతుల్ । బరగన్ సారెవ పాశనిస్వనములట్లుంబల్కె నుగ్రంబుగా । గళివన్ మత్సదయాగ్రమానవినుమీగాఢప్రతాపోన్నతిన్ ॥వ॥ సంగరాంగణంబునమత్సరపంథినిసంబాంధవంబుగాసంహరించెద నవశ్యంబింక శీఘ్రంబ యుద్ధంబునకు సన్నిద్ధులై మహాధన్యులైన సకలసేనాధిపతులును సైన్యంబులతోడ పురంబు వెడలి సమరాభిముఖులగుచు వాదిత్రనిస్వాణడిండిమంబులతోడ జయభేరులు మ్రోయ నరుగుండని యాజ్ఞాపించి క్రోధంబున నవయవంబులుఁ జెమర్ప గూఢచారులంబిలిచి కోపభీషణుండగుచు దమకేఁగ్రుం డిట్లనియె ॥శా॥ ఆలస్యం బొనరింప కిప్పుడు ఘనీయాజ్ఞన్ ప్రయాసంబోయి యా । ప్రాలేయాంశు కిరీటనందనుని సంగ్రామార్థమై పిల్వుఁడీ । తేలా మీకు భయంబు మానసములం దీతండు మత్సోదరున్ । బాలున్వంచనఁ జేసి దేవహితుఁడై భంజించె యుద్ధంబునన్ ॥క॥ సానుజుఁడునగుచు నెంతే । తానుం బ్రాణములతోడ ధరనుండఁగ నా । పోసిద్రాభోజనయులు । వానికి ఘటియించు నెట్లు వైభవమెటులన్ ॥క॥ దివిజాలతో సదివెలుదలంగ । భవదీయోదరములందుఁ బాయక నేనుఁ । నివసింతుననుచుఁ బలుకుడు । ధృఢముగ మద్వచనములట్లు ధుర్యతమీఁతన్ ॥వ॥ ఇట్లుఁబలికి తోడన జనుండని దూతల కనుజ్ఞయొసంగి యశ్వలక్షణపరిజ్ఞుండైన సూతుంబిలిచి యిట్లనియె ॥మ॥ హరిసాహస్రయుతంబు రత్నమయమై యత్యున్నతంబౌ సొంపునిం । పు రథశ్రేష్ఠ మభేద్యమైన గవచంబుం జండకోదండమున్ । శరసంఘాతము లాయుధప్రకర మక్షయ్యంబు తూణీరముల్ । గరిమన్ దెమ్మని దానవాధిపుఁడు కిన్కం దన్వాకు త్రేరేపఁగన్ ॥వ॥ ఆసమయంబున నీతిశాస్త్రవిశారదుండును మంత్రాలోచన నిపుణుండును మతిమంతుండును నగు నమోఘుండన్నుమంత్రిముఖ్యుండు సభాస్థలి వీతభయుండగుచు సద్దనుజేంద్రునిఁ గని యిట్లనియె ॥క॥ దితిజేంద్ర రాజనీతియు । తెలియ నీకంత మహీపుఁడైలువు దలిర్పన్ । సతతంబును శక్తిత్రయయుతమహాత్ముఁడీ జలియ నోపరుమూఢుల్ ॥వ॥ అదియు నొకటి యుత్సాహశక్తియు నొండు మంత్రశక్తియు వేఱొండు ప్రభుశక్తియునై యొప్పుచుండు రాజాలకసత్యంబు విధి గ్రహింపసత్త్వంబులగు మఱియు సంధివిగ్రహయానమాసనద్వైధీభావసమాశ్రయంబులనియెడు షడ్గు



ణంబులు దనరు నవియేకాంగకలరయ స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్రదుర్గబలంబులనియెడు సప్తాంగంబులంగలవు వీనినన్నిటిని రక్షింపవలయునదిగావున నఖిజ్ఞుండవైన నీకెఱుంగనది యేమియున్నది స్మరింపఁజేయుటంతియుకాని యని పలికి వెండియు ॥క॥ దానవవరవినుమిప్పుడు । యానన్నుఁడుగాడు బాలుఁడజ్ఞుఁడు స్కంధుం । డేనాఁడును మనకెంచుక । దైనన్ ద్రోహంబుఁగలద యాహరునందున్ ॥వ॥ అతని యాత్మజుండగు సేనానియు సాక్షాచ్ఛంకరుండయగు యాదృచ్ఛాగతి భవత్సోదరుండగు తారకుండు నక్షజ్ఞుండగుచు నతనితోడ యుద్ధంబొనర్చి నిధనంబునొందనదియునుంగాక స్వాకనీయయులగు నస్మద్విరోధులచేత పార్థితుండై శంభుండు శక్తిధరుం గుమారునిం బనిచిన నచ్చాలంబు మనకునుఁ బోసుట్టుండరాని యతనితోడఁ గలహించుట కర్జంబుగాదని యమోఘుండు పలికిన విని కోపించి యొండి మార్గంబున నాలోచించి మగుడి సింహాసనారూఢుండై శూరపద్ముండదుమేయుండు రక్తచక్రవాళశుకప్రముఖులగు దైత్యులంబిలిచి మహాభగణమాల్యాదుల బహూకరించి యేకాంతంబున ॥క॥ బలయుతులగు మీరత్రిభువనము సుబ్రహ్మణ్యుఁ జేరి యాఖ్యాసద్భాశక్తియున రూపంబులతోఁ । జెలఁగుచుఁ గుశలత్వమొప్ప శీఘ్రముగాఁగన్ ॥శా॥ ప్రాయంబెంతయు రూపకాకరణియాప్రజ్ఞవిధంబెట్టిదో । యేయుద్యోగమునందు వాటిలునొ, వాఁడెచ్చోఁ బ్రవర్తించునో । నా యాత్మజాతిపతికోలఁదియా యాశౌర్యమేచందమో । యాయస్త్రస్ఫురణంబు లెట్టివియు తథ్యంబొప్పఁ దద్వృత్తమున్ ॥వ॥ సర్వంబును విచారించి రండుపొండని గూఢచారులంబనిచి సకలమంత్రిసమేతుండై శూరపద్ముండు హితుండైన తమ్ముని దలంచుచుండెనంత ॥చ॥ పువువిలుతుండు కేల శరపుంజముడింపఁ జలించెఁ దారకల్ । ఘనవిమెఁగాంచె దీపశిఖ తామరసప్రభ విస్తరించెఁ జ । క్కనగవశాకుకోన్నతినిఁగాంచెనటించె నశించె జీకటుల్ ॥ రవియుదయించె బూర్వపుధరంబునఁ దెల్వనగాంచదిక్తతుల్ ॥

కుమారస్వామి కేదారాదిపుణ్యక్షేత్రంబులుగనుట.

తే॥ ఇట్లు సూర్యోదయంబైన సమయంబున సుబ్రహ్మణ్యుండు హరిబ్రహ్మాదిముఖనిఖిలదేవమునిగణయుతుండై నిజసైన్యంబులంగొలువ నమ్మేరుమహీధరంబుపై డిగ్గి మనోజవంబున గగనపథంబు దక్షిణదిశవొంది లోకానుగ్రహార్థంబుగాఁ బరమేశ్వరకల్పితంబులైన దివ్యస్థలంబులు తొలివసర్వంబులాఁ జూడఁ దలంచి ప్రథమంబు దానమాత్రబోధకపావనంబున మూర్తిస్తన్యపానసాక్షికరంబున శివక్షేత్రంబును మనోరథాంకితోదయకేదారంబున నగుకేదారంబు నుంజేరి ప్రముదితాంతరంగుండై కేదారలింగంబును భజించి యనంతదివ్యమహిమప్రకాశినియగు కాశినిం జూచి విశ్వనాథునిం గొనియాడి విరజోయువ్రీయసాగంచయాలంబగు శ్రీశైలంబునుంగని కరుణాసనాథుం భ్రమరాంబికానాథుఁ బ్రశంసించి విరూపాక్షంబున కరిగి విరూపాక్షేశ్వరుని వీక్షించి సువర్ణముఖరీతట భాసురంబగు దక్షిణకైలాసంబుఁ గాంచి జ్ఞానప్రసూనాంబికామనోహరు సేవించి నిజనివాసంబగు వేంకటాచలంబుఁ గనుంగొని యట పటారణ్యంబునకు జని యందు నూర్ధ్వతాండవమూర్తి యైన నటనటుని సందర్శించి భూమితలబోధకాంచియగు కాంచిఁగాంచి ధనాలయమూలః శివావిని

గావున మీరలు మత్స్యంబులై బహుంబ్ర దస కాలంబొసంగిన ॥ క॥ శప్తులయి హరలాభ్యాద। తప్తాదిమహర్షులపుడు తండ్రికి నతులై। దృప్తతమ పీడి వేడిరి। తప్తమనో జలజాలగుచుం దగవినయమునన్॥ వ॥ ఈగింజాత్రి మాయజ్ఞానకృత్యంబు సహించి శాపవిమోచనంబు కరుణింపుమని ప్రార్థింపుచు మూర్ఘ్నతటఘటితకరపుటులై నిలిచినం గరుణించి యమ్మహామునీంద్రుండు శాపభయాతులైన పుత్త్రులం బిలిచి మీరు పార్వతీస్తన్యంబు లెప్పుడు గ్రోలుదు రప్పుడు శాపవిముక్తులగుదురని యనుగ్రహించి చనియెనంత ఋషికుమారులు విప్రరూపంబులు విడిచి మీనంబులై గంగాశరవణాంతంబున వసించిరంతయు ॥ శా॥ ఈరీతిం జిరకాలమున్ జననుతా సెంతేని నీవున్ జయ। శ్రీరాజిల్ల జనించి శంకరునకుం జైనొందఁ గంగానదీ। తీరంబందు కిరాటవిస్థలమునన్ దివ్యంబు నచ్ఛామృతా। పారంబైతగు శైలరాజతనయాస్తన్యంబు గ్రోలంగన్ ॥

## కుమారస్వామివలన తప్తాదులు శాపవిముక్తులగుట.

వ॥ ఆసమయంబున జలాశయాంతర్గతంబైనదదీయస్తన్యంబులం గ్రోలిమానులప్పుడు శాపవిముక్తులై పూర్వరూపంబులొంది దేవీకుమారసహితుండైన యిందుశేఖరు చరణారవిందంబులకుం బ్రణమిల్లి యవిముక్త శివసన్నిధానంబునన శేషజగజ్జననియగు మహాదేవికి నమస్కరించి స్తుతియించిన సంతుష్టాంతరంగుండై వారలంగని మహాదేవుం డిట్లనియె ॥క॥ నా యాజ్ఞ మీమహశాపము। పోయెం జారశిఖరి నింక భూరితసుంబుం। జేయుండు సుబ్రహ్మణ్యుం। డాయద్రికి వచ్చు నప్పుడా తనికడునన్ ॥ వ॥ కృతార్థులయ్యెదరు పొందని యీశ్వరుండనుజ్ఞ నొసంగంగావున వీర లిద్దింధంబున భవత్పాదారవిందసందర్శనోత్సుకులై నేఁడు ధన్యతం గాంచి రంతయు ॥క॥ అని యింద్రుండు పలికినదిన। విని శంభుతనూభవుండు వీనులవిందుగన్। దనరంగ నా తప్తాదుల। ఘనమహిమననుగ్రహించెం గరుణాన్వితుండై ॥సీ॥ అంతవారలం దోడ్కొని తారకాంతకుండు పెడలియుత్తుంగసౌధజాలంబు, సుస్నిగ్ధమణిగోపురంబు, సురుతరరత్నసదనాలంకృతంబు, నుద్భూతమందానిలహృద్యంబు, నుద్యానశాసారరమణీయంబును, వివిధసంపత్పరిపూర్ణంబును, విశాలంబును, విచిత్రంబును, విశ్వకర్మనిర్మితంబైన శాంతిపురంబును బ్రవేశించి తత్పురమధ్యంబున దివ్యభవనంబునందు హాహాహూహూప్రముఖులగు గంధర్వగణంబులు తుంబురనారదాదులు నతిదైవంబున మానుషంబున నిజకర్మవృత్తాంతంబులం గీర్తింపుచు గానంబులొనరింప హరిబ్రహ్మాది నిఖిలసురగణంబులు పుష్పవర్షంబులు వర్షింపసప్తమరుత్తులును సేవింప నగ్నియు వరుణుండును ఛత్రంబులుధరియించి గొలువ దిక్పాలకులు తాళవృత్తములువిసర వీరబాహుండు కనకరత్నాఢ్యంబగు ఖడ్గంబుపట్టి ముందటనిలువం దక్కినమణికన్యకాతనూజాలెనమంద్రుడు గణవర్యులనియుతంబును యథారోగ్యోపచారంబుల భజింప నద్వక్త్రిందు, సు ద్వాదశభుజాండును ద్విపన్నయనపంకజాండును స్మేరవక్త్రిందునును దారాంగుండును విచిత్రమకుటోజ్జ్వలుండునునై విరాజమానరత్నదివ్యసింహాసనాసీనుండై యుండె నంతయు ॥తే॥గీ॥ అపుడు సింహాసనంబున వలరుచుండు। శరవణోద్భవు దేవతాసార్వభౌము। హరివిరించిముఖామరు లఖిలమంగలు। పరగవీక్షించి రక్షిసాఫల్యమెసంగ ॥వ॥ అంత నక్కుమారుండు దేవతలకిట్లనియె॥ తే॥గీ॥ అసురులెందరు వారెవ్వరఖ్యరూప। మెట్లు వారికి జనియించె రెప్పతిపిని। వారుకడుము



ఖ్యులెవ్వాండు వారిలోన। నఖిలము వచింపఁదగును యథార్థముగను ॥వ॥ అనిన యాశంభుతనయుని వచనంబు లాకర్ణించి హరిబ్రహ్మాదులు భురస్వరస్వరలోకనంబొనర్చుచు వాక్యవిదుండగు బృహస్పతిని సభాస్థలంబునం గనుంగొని సేనానియడిగిన దానికి నుత్తరంబొసంగుమనిన గురుండు కృతాంజలియై తారివృత్తాంతం బఖిలంబును జగద్గురుండును రోంగ్రిస్వర్గదయ్యగ్నికౌస్తుండును నగు షణ్ముఖునకు జెప్పం దొడంగె ॥తే॥గీ॥ అనుచు సూతుండు సకలవేదార్థసదృశ। మైన సంభవకాండంబు నాదరమున। శౌనకాదులకెఱిఁగించ శ్రవణయుగళి। సారె నమృతంబు చిలికిన చందమలర॥

శా॥ రాజీవధ్వజభంగ తాపసమనోరాజీవపీఠస్థితా। రాజీవాక్షసమర్చితోజ్జ్వలదృశా రాజీవసంతర్పితా। రాజీవాప్తశశాంకవహ్నినయనా రాజీవగర్భస్తుతా। రాజీవారికలావతంస మనోరాజీ వరాభీష్టదా॥ క॥ కోదండీకృతభూధర। వేదండాజినదుకూలవిమలశుభాంగా। వేదాంతహృద్ధలిత। వేదప్రణవాటదళితవిమతనిశాటా॥ మాలిని॥ పురదనుజవిదారా భోగికేయూరహారా। పరమనిగమసారా భక్తహృత్పద్మసారా। విరహసుకుమారా నిర్జితారాతివీరా। స్ఫురదనఘవిహారా భూరికారుణ్యపూరా॥

గద్య॥ ఇది శ్రీమదిందుధరసుందర పాదారవిందార్చిత హృచ్ఛతపత్రసకలసుకవిజ
నానుగ్రహపాత్రమగుణస్తోత్రపవిత్రచరిత్ర కాశ్యపస గోత్రకోడూరియెల్ల
మార్యపౌత్రశంకరామాత్యలక్ష్మాంబికాతనయ వినయవిధేయబాల
సరస్వతీ నామాంక వేంకటాచలకవి ప్రణీతం
బైనశ్రీస్కాందంబనుమహాపురా
ణాంతర్గత శివరహస్య ఖం
డంబున సంభవ కాం
డ మందు పంచమా
శ్వాసముసర్వంబు
సంపూర్ణము.

శ్రీ రస్తు.

# శివరహస్యఖండము.

## —:*అసుర కాండము*:—

## —:*ప్రథమాశ్వాసము*:—

---

శ్రీలక్ష్మీశస్తుతపద । నీలగళా మురనువంశనీరధితారా । పాలకముకువాగళుఘా । శైలజ కరుణాంతరంగ ధవళితలింగా ॥వ॥ అవధరింపుము శౌనకాదిమహామును లంత సూతుం గనుంగొని వాక్కుసుమంబులనర్చించి శూరపద్మసింహవక్త్రతారకుల యుత్పత్తియు నితరదానవుల జన్మప్రకారంబంతయు షణ్ముఖునకు బృహస్పతి యెఱింగించిన ప్రకారంబు మాకెఱిగింపు మిదాకర్ణనకుతూహలం బయ్యెడి ననవుడు మునీంద్రులకు సూతుండిట్లనియె ॥తే.గీ॥ వినుడు ఋషులార వీనులవిందుగాఁగ । గరిమ వచియింతు నిక్కథఁ గ్రమము దనర । గురుతపోనిధి దైతేయగురుఁడు గలఁడు। కశ్యపాఖ్యుండు సత్యవాగ్ధర్మపరుఁడు ॥సీ॥ అతఁడు దితియందు నద్భుతపరాక్రమగుణుల వరువడాఱుకోట్ల బరగ । దైత్యులఁ గల్పించె దద్దయువారిలో నధికుఁడు శ్రీమంతుఁడగుచుఁ దనరు । నసురేంద్రుఁడనఁగ మహాసురుండాతండు మంగళకేశిని మహిమఁ గూడి । సుందరీరత్నంబు సురసునుబుట్టించె నాకొమ్మ శుక్రుని నధికభక్తిఁ । గఱును పాసనఁ జేసి న గరిమ మెచ్చి । దనుజగురుఁడంత సకలవిద్యలను హృద్య । ముగనొసంగుచు సాదరపూర్వకముగ । దానికొనరించె మాయాభిధానమలర ॥క॥ శుక్రుండును దనమనంబున దివిజసమృద్ధియు, దనుజక్షయంబునుం దలపోసి బ్రహ్మార్థ్యంబున శైలాదిశాపంబున దేవతలకు సంపత్ప్రశమనంబగునని యాగమకార్యంబాలోచించి మాయనుం బిలిచి మఱియు నిట్లనియె ॥క॥ అసురులనెల్లను మార్కొని । రసద్బలంబులగుచునమరులాహవతలముం । దసురేంద్రుఁడు మాతండ్రియు । దసచెడి దుఃఖార్తుఁడయ్యె దివిజుల చేతన్ ॥ ఉ॥ ఇప్పుడు దానవప్రకర మెల్లఁ గృపామతిఁ జేసి బ్రోవవే । కప్పురగంధి నీవెలమిఁ గశ్యపుఁ బొంది తనూజాలం బ్రియం । బొప్పఁగ గాంచి పేరలిడి యుత్సుకతన్ సవనవ్రతంబులం । జెప్ప సురక్షయంబునకు శీఘ్రము నీవ్రతపంబు సల్పుమా ॥వ॥ అనిన శుక్రునివచనం బంగీకరించి తండ్రికి విజ్ఞాపనంబుచేసి వెడలి మార్గంబున నందఱు మోహితులగుచుండ మూర్తీభవించిన మాయయుంబోలె నమ్ముగువ కశ్యపమునియాశ్రమంబుఁ జేరి యందు విచిత్రమణిమంటపంబులును విశాలక్రీడానగరంబులుం వివిధపుష్పఫలశోభితోద్యానంబులును విమలజలాసార కాసారంబులు నిమిషమాత్రంబున నిర్మించి గనుంగొని కశ్యపుండాశ్చర్యంబు నొందుచు॥సీ॥ మంటపావళులిందు మణిసంపదలబయ్యె మణి



భిత్తికచిత్రమహిమలలర । గోపురవ్రజమిందుఁ గుతుకప్రదంబయ్యె నంబరపరిచుంబియగుచు మిగుల। నుద్యానవనులిందు హృద్యంబులైయొప్పె భాసురశౌరభప్రసవములను । బద్మాకరంబులు పరికింప నరువయ్యె రత్నసోపానముల్ రహిఁదలిర్పఁ । బద్మగర్భుండు గల్పనబన్నెనొక్కొ । శేషశయనుండు వర్తిలఁ జేసెనొక్కొ । త్రిదశులెవ్వార లిటుల నిర్మించిరొక్కొ । యెన్నఁడైనను గంటిమె యివియునిచట॥ వ॥ అని విస్మయోర్మికాడోలాయమానమానసుండై యుండ నంగజసౌభాగ్యనిధానంబునుంబోలెఁ గురంగట నప్పర్వతశిఖరంబున॥

## —:*కశ్యపుండు మాయను వీక్షించుట*:—

క॥ తొలకరిమెఱుంగు విధమునఁ । దళుకుంబంగారు బొమ్మ దనరివ రీతిం । దులకించు నిందుజందురు । కళయో యనఁ గమలనయనగన్పడెనపుడున్ ॥ శా॥ ఆచంచచ్చపలాలతాంగినగు మోహమందంబులెవ్వ సాం । పాచోక్కంపువయార మాసొగసు పెం పాముద్దుకస్తూరివిడా । లాచన్నుంగవ పొంభనమ్ములబెడం గావాలుకందోయిబెళుక్కుదిత్రాంగితనూవిలాసరుచు లావఁయెన్నఁగా శక్యమే॥ క॥ చిత్రవిచిత్రధృతులన్ । నేతోత్సవమొప్ప ధాత నిర్మించెనొకో । యీత్రిజగన్నుత మాయను । జెత్రాంగియటంచు జగతిఁ జెప్పన్ వచ్చున్ ॥ సీ॥ కటినీమసవరించు కనకాంశుకచ్ఛాయలరుణాంఘ్రిరుచికిజోహారు సేయఁ । దపనీయమయవజ్రతాటంకదీధితుల్ తళుకుఁజెక్కులతుఁ గైదండ యొసఁగ । రమణీయకుచకుంభరత్నహారద్యుతుల్ మేఖలాప్రభలతో మేలమాడ । ముక్కునఁ జేర్చిన ముత్తెంపుముంగర దరహాసదీప్తి కుత్కలికఁ బెనుప । మీన నలఁదిన ఘనసారమిళితలలిత । గంధసారంబు మైత్రావిబాంధవంబు । నెరప త్రిభువనమోహన నిరుపమాన । భవ్యశృంగారవిభవంబు భాసిలంగ ॥ చ॥ కటినటియింప శేణి సెలికన్గవబెళ్కులు సాంద్రచంద్రికా । చ్ఛటలను నింపఁ జెన్నలరు సైకపుకౌనువణంక మేఖలా। చటులఝుణంఝుణార్భటులు సందడిలంగ విలాసమొప్ప న। చ్చటవిహారించెఁ బద్మదళచారువిలోచన దానిమాటికిన్ ॥ ఉ ॥ దానివిలోచనాబ్జదళధాళధళీవిలసత్ప్రదీప్తికల్ । దానిమొగంబుబింబసముదంచితమంజులమందహాసమున్ । దానికటిల్లతాద్యుతిని దానినవీనతమోవిలాసమున్ । మానివరుండు జూచి యసమానమనోజనితానురాగుఁడై ॥ సీ॥ కలికిచేసలి భారఘనఘనాద్యూతిమీరుఁ జెలువనెమ్మోము నిర్జితసోముఁ । బొలఁతికన్గవడాలు పూవిల్తుతెలడాలు సఖియమోవి సుధారసంబుదీవి । తరుణికంధరరంగు దరవిలాసమొసంగుఁ గాంతపాలిండ్లు బంగారుగిండ్లు । పద్మలోచనకేల్లు పంకజంబులవేలు నతివమాగారు నీలాహిగేరు । గొమ్మదిలకింపఁ గేసరికౌను సాటి । వళుల్లు కామినిమూర్తి భావలుల్లు దలఁప । నూరులింతికి రంభాజ యూరులౌర । తరమెగొనియాడఁ దద్వపుశ్శాధురమ ధరను ॥ క॥ పల్లవపాణి గేలుం । బల్లవగీతీయుఁ జెలికి భాసురసుమనో । వల్లిన్మగు మై సుమనో । వల్లిన్ సరిబోలునౌర వాంఛాఘటనన్ ॥ వ॥ అని తదీయసౌందర్యమోహితాంతరంగుండై మునిపుంగవుం డాలతాంగినిఁ జేరంబోయి యిట్లనియె ॥ ఉ॥ ఎవ్వతెవీవు పద్మముఖి యెయ్యది నీయభిధానముంటెగా। నివ్వని నుండనేల నునికెయ్యది నీతలిదండ్రులెవ్వరో। జవ్వని జెల్ప మన్న మునిచంద్రున కాగజరాజయాన తాఁ। నవ్వఁ జెలంగ నిట్లనియె నాదు తపస్సులమావశంబునన్ ॥ వ॥ తపస్విని యాగ నాకు చరించుటయుక్తంబ కదా పెక్కుమాటలుబనియేమి విను

## శూరపద్మాదులకు శివుండు ప్రత్యక్షమగుట.

సీ॥ కమనీయపన్నగ కంకణంబులుగల్గు ఫాలేందుమకుటంబు భాసిలంగ । గగనకల్లోలి నీకలితమస్తకమొప్పఁ గరిచర్మవసనంబు కటిఁ జెలంగఁ । బరగ త్రిపుండ్రారి ఫాలభాగమునందు భూతియు మైనిండ బూలు మెఱంగ । మహనీయరుద్రాక్షమాలికల్ జెలువొంద దరహాసచంద్రికల్ దఱుచు మెఱయఁ । జారునవరత్నకటకకేయూరహార । నిఖిలమణిమయభూషణ నివహదీప్తి । దివ్యసౌందర్యభాసురదేహుఁ డగుచు । శైలకన్యావధూమణిసహితముగను ॥ వ॥ మఱియు నానాలంకారమండితంబును గింకిణీనినదబధిరీకృతదిఙ్ముఖంబును భోగిభోగ ప్రవలితావభాసురవాలశోభితంబును గంటాలంబిఘంటికారావముఖరితదిగంతంబును మహాకంధరబంధురంబును నగు వృషభంబధిరోహించి సకలవాదిత్రంబులు మొరయ నానాభూతగణంబులు గొలువ నరవిందభవముకుందప్రముఖులగు నిలింపులును దివ్యాంగనాసహస్రంబులును బరివేష్టింపఁ బరమేశ్వరుండు ప్రత్యక్షంబయ్యె నప్పుడమ్మహాదేవుని శూరపద్ముండు సంఫుల్లలోచనుండై గనుంగొని భక్తిప్రసమేతుండగుచు సైన్యంబులతోడ కృతాభివందనుండై వేదాంతగుంభితంబులగు స్తోత్రసహస్రంబుల స్తుతియించె నంత ॥

తు॥ కనికారుణ్యకటాక్షదృష్టి దనరన్ గౌరీమనోనాథుఁ డా । దనుజాధీశ్వరుతోడ నిట్లనియె నత్యంతబుద్ధ్యత్తపో । ఘనదీక్షం గని నామనంబు మిగులన్ గౌతూహలంబొందె మీ । కు నభీష్టార్థములెవ్వి చెప్పుఁడిఁకఁ జేకూర్తుం బ్రసన్నుండనై ॥ వ॥ అనిన శూరపద్ముండిట్లనియె ॥ ఆ॥వె॥ అఖిలలోకనాథ యంబికావల్లభ । తనకు వరము సంగ దలఁచితేని । నాధిపత్యమొసఁగు మష్టోత్తరసహస్ర । వర్ధజాండములకు భాసురముగ ॥ మఱియు నాజ్ఞాచక్రంబును నాశరాహిత్యంబును విష్ణ్వాదిదేవతలు మదాజ్ఞాపరతంత్రులై యుండుటయు హరిప్రముఖనిఖిలసురగణపలాయనకరంబగు నాయుధంబును వివిధాండంబుల గమనాగమనంబులు నివిమొదలైన వరంబులొసంగు మన వుండు విని శూరపద్మునకు సర్వేశ్వరుండిట్లనియె ॥ ఆ॥వె॥ మీరుగోరినట్లు మీకుననుటియించు నాధిపత్యమబ్జజాండములకు । నాజ్ఞ చెల్లు యుగము లష్టోత్తరశతంబు । లలరమీకు నెపుడు హానిలేదు॥ వ॥ మఱియు నానారత్నప్రశోభితంబగు నింద్రవిమానంబును సింహవాహనంబును పాశుపతంబు మొదలగు తత్తద్దేవతాంకితంబులైన నానాదివ్యాస్త్రంబులును వజ్రదేహంబును నీకుంగలుగు వహ్నికుండోద్భవులైన శతకోటిసహస్రవాహినులు నీకు చతురంగబలంబులగు మఱియు వారలు నీయనుజులును దివ్యాయుధసంపన్నులై యష్టోత్తరశతయుగంబులు రాజ్యపరిపాలనంబు సేయుచు సమరంబున నప్రతిహతంబగు మచ్ఛక్తియుం దక్క సురశరగణంబులచేత నవధ్యులగుదురు ధృవంబని పలికి సర్వేశ్వరుం డంతర్ధానంబునొందె నంత ॥ తే.గీ॥ శూరపద్మాది దానవశూరులెల్ల । భర్గకరుణకు సంతోషభరము దనర । నట్టహాసంబు సేయుచు నతులగతులఁ । బలుకుచుండిరి పటుఖడ్గపాణులగుచు ॥ క॥ శూరుఁడు దనుజగణంబుల । నారసి బహుకాల మస్మదర్థం బిచటన్ । మీరు వసించితి రని యుప । చారోక్తుల నూరడించె సంతసమొసఁగన్ ॥ వ॥ వారలు వినయాన్వితులై ప్రత్యుపచారంబులనతని సంతోషింపం జేసి రంత శివుఁ డొసంగిన చతురంగబలంబులకు సేనాపతుల విభజించి ॥ క॥ దైతేయబలము గొలువఁగ । భ్రాతృసమేతముగ శూరపద్ము



డు చని యా । తాతనుగశ్యపుఁ గనుఁగొని । యాతతవినయమునఁ బలికె దానవుఁ డగుచున్ ॥ వ॥ సర్వజ్ఞుం డీశ్వరుం డస్మత్తపంబునకు సంప్రీతుం డగుచు మాకష్టోత్తరసహస్రాండాధిపత్యంబు మొదలైన వరంబులొసంగె నిటమీద మాకేమి బుద్ధి వచియింపుం డనవుండు వినికశ్యపుండు గుదివిజుల విపద్దశ నాలోకించి కుమారుల కిట్లనియె ॥ క॥ మీరలు గురుఁడగు భార్గవుఁ । జేరి ప్రియంబొప్ప నతఁడు సెప్పిన బుద్ధిన్ । ధారుణి వర్తింపుం డను । వారము శ్రేయంబు మీకవశ్యము దానన్ ॥ వ॥ అనిన జనకు ననుమతి దైత్యేంద్రులందఱును హితోపదిష్టయు సర్వశాస్త్రార్థకోవిదుండు నగు భార్గవునిం జేరి నమస్కరించి బద్ధాంజలిపుటులై తమవృత్తాంతం బంతయుం దెలిపి కార్యాకార్యస్వరూపిణియగు బుద్ధి నానతీయుండని పలికి వినయంబున నమ్రులై పరివేష్టించి నిలిచి ॥ క॥ కావ్యం డేకాంతంబున । భవ్యస్థితిఁ దనర శూరపద్ముని కనియున్ । దివ్యప్రభావుఁ డీశ్వరుఁ । డవ్యయుఁ డతఁ డాశ్రయించి యనిశము మాయన్ ॥ వ॥ వియదాదిసకలప్రపంచమును సృజింపుచు స్వాంశంబు విభజించి జీవత్వంబున దేహేంద్రియంబులం గూడి లీలామాత్రప్రయోజనుండై నటించు ఘటంబు భగ్నంబైన ఘటాకాశంబు మహాకాశంబునందు లీనంబగువిధంబున దేహంబునశించినజీవుండు శివైక్యంబునొందు నదిగావున మోక్షదశయందు పుణ్యపాపంబులు మిథ్యారూపంబులు నీవు సర్వజ్ఞానానందంబైన స్వస్వరూపంబు దెలిసి విగతశోకుండవై బ్రహ్మవిష్ణ్వాదుల స్వడబిదహరహపుండరీకగతుండైన శంభుని భజింపు మింద్రాదిదేవతలకు భయోత్పాదకుండవై తత్తద్దేవతాపదంబులనురులకొసంగుము మారణవంచనకార్యప్రద్వేషణాదికృత్యంబులు సలుపు మన్యప్రకారంబుల దేవమానవులెవ్వరు నిన్నుగణింపరు భవదీయంబులైన బ్రహ్మాండంబులం గల వృత్తాంతంబు సావధానంబుగా విచారింపుచుఁ దన్మధ్యప్రదేశంబున భక్తిసమేతుండవై యుండుము బ్రహ్మాండంబు పరిమాణవిస్తారంబు దెలిపెద మహీధరంబులును సప్తసముద్రంబులును ద్వీపంబులును జతుర్దశభువనంబులను దేవతలు దిక్పాలకులు దిగ్గజంబులుఁ జంద్రసూర్యాదిగ్రహంబులుఁ దారకలుఁ జరాచరజంతువులునుం గలిగియుండు నిశ్చితంబున సకలాండంబులం దెలియుమని పలికి దైత్యగురుండతని వీడ్కొని చనియెనంత ॥

—:*శూరపద్మాసురుఁడు దిక్పాలకుల జయించుట*:—

తే॥గీ॥ శూరపద్మాసురుండును సురుచిరముగఁ । గోటిసూర్యసముద్యుతి కోటిజవన । పత్రియుతమును బహురత్నచిత్రితంబు । నైన యనివార్య మింద్రవిమానమెక్కి ॥ వ॥ ఛత్రచామరధ్వజపరివేష్టితుండగుచు సేనాసమేతుండై వెడలె సింహవక్త్రుండును దారకుండును గ్రమంబున దశలక్షచతురంగసమన్వితంబును దశసహస్రవాహినీయుతంబును నగు వివిధరత్నచిత్రితంబులైన రథంబులధిరోహించి యగ్రజుని వెంబడిం జనిరంతయు ॥ తే॥గీ॥ ఇతరరథికులు వైభవం బెసఁగ నవుడు । వెంటనరిగిరి సుకుమారవిక్రములు । గజతురంగభటోష్ట్రసంఘములు లసంఖ్యములుగ । చతురంగవాహినుల్ మొనసి నడిచె ॥ ఉ॥ భేరులు శంఖకాహళులు భీకరడిండిమఝర్ఝరంబులన్ । వారక మ్రోసె నొప్పెడల వార్ధితరంగసముద్భటార్భటిన్ । గెరుచునప్డు దుర్వారగతిన్ గగనంబుదాకె నత్యంతమున్ । వారలెల్ల వారిలె పదభూధరముల్ జదియించె సంక్షయున్ ॥ ఉ॥ కొందఱు ఖడ్గహస్తులయి కొంద

ఖీలిన్ । జనుదెంచి యోగనిద్రం । దనరు హరిని లేపి యని రుదంచితభంగిన్ ॥ వ॥ దేవాయాసమయంబున శేషశయనుండనై యేల నిదురించెదు నిద్రమేల్కాంచి భయగ్రస్తులమమ్ము రక్షింప లెమ్మనవుండు నారాయణుండునిద్రమేల్కాంచినంతలోన నయ్యసురసైన్యంబు తత్సమీపంబుఁ గలసె నంత ॥ క॥ గరుడారూఢుండై హరి । కరములను సుదర్శనంబు కౌమోదకియున్ । దరమును నందకశార్ఙ్గము । లురుదీప్తి యొసంగ దాల్చి యుద్ధోత్సుకుఁడై ॥ వ॥ బద్ధతూణ్యుండును సకవచుండును నగుచు పశ్చాద్భాగంబున దూణీరంబులు ధరియించి సవ్యకరంబున విల్లందుకొని దక్షకరంబున సారిసారించి గుణధ్వనింజేయుచుఁ దారకసైన్యంబుల మీద బాణవర్షంబులుగురిపె నప్పుడు క॥ హరిశరము తెరదనునాటిన । ధరణిన్ బహుబలముగూలె దానవులన్యల్ । శరఖండితవిగ్రహులై । పరిభవమున్ గాంచిదుఃఖభరపీడితులై ॥ క॥ తారకుశరణంబొందిన । తారకుడంతట నుదారధైర్యంబెసఁగన్ । నారాయణుపై విడలెను । భూరిశాస్త్రములు మూనిపోర జయింపన్ ॥ వ॥ అంతఁ గోపంబున గొనయంబెక్కించి గుణధ్వనింజేయుచు నారాయణునిపై శరాసారంబులుగురిసె తచ్ఛరపాతంబున గరుడుని మేను రక్తంబైన గనుంగొని గరుడగమనుండు కోపోద్దీపితుండై ॥ క॥ తారకు మేనను శరములు । పారెను నాటించి మఱియు సాయకతతులం । దేరుంగుమురుగఁజేయుచు । సారథిఁబడ నేసె ధనువుచయ్యనదునిమెన్ ॥ ఉ॥ తారకుఁ డంతఁగోపసముదగ్రతఁజేతొక తేరునెక్కి యొ । ర్వారతనొండు విల్లుఁగొని హారకఁజేయుచు నట్టహాసమున్ । భూరిశరావళుల్ గురిపె శార్ఙ్గియాతనిపై నిదాఘగం । భీరఘనాఘనంబుగతి భీషణమార్గనినాద మొప్పఁగన్ ॥ క॥ దానవనిశితశరంబుల । దానవరిపు మేన రుధిరధారలు దొరగన్ । లూనంబయ్యె తదీయశ । రాసీకనిపాతనమున నతనికవచమున్ ॥ వ॥ అంత నతిక్రోధంబున నారాయణుండు మరల మంత్రభేదంబులగు శస్త్రాస్త్రజాలంబులు బఱపి తద్రథంబు భగ్నంబుఁజేసి కోదండంబు ఖండించిన ॥ క॥ తారకుఁడు గదిమి వేఱొక । తేరెక్కి శరాసనంబు ధీరతఁగొనుచున్ । భూరిక్రోధాన్వితుఁడై । శౌరిపయిన్ మగుడనించె సాయకవృష్టిన్ ॥ వ॥ అంతవిష్ణుండు పరాక్రమశోభిష్ణుండగుచు మాయావియై బహురూపంబుల నందందనిలుచుచు శతకోటిసహస్రంబులైన శస్త్రంబులు తారకుని మీదం గురిపిన దైత్యుండును క్రోధవిజృంభితుండగుచు మాత్రాధిష్ఠమంత్రంబుల జపించుచు బహురూపంబులతోడ నసంఖ్యంబులైన యస్త్రంబులు కైటభారిపై నించె నివ్విధంబున ద్వాదశవర్షంబులు విష్ణుతారకులు పరస్పరంబు సంగ్రామమల్లులగుచు నత్యద్భుతంబుగాఁ బోరి రయ్యవసరంబున ॥ క॥ హరి కౌమోదకి కేలం । బరగంగొని త్రిప్పివైచె భాసురలీలన్ । సురవైరియు గదచేతను । బరితాడనఁజేసె దాని ఖండనమందున్ ॥ వ॥ మఱియు నిలువక కౌమోదకి తారకునింగదియ తారకుండు క్రోధావిష్టుండై దాని గ్రమ్మరగడపిన నది నేలంగూలె నవ్విధంబున నందకంబును నిరర్థకంబయ్యె నయ్యెడ తారకుండు గదాయుధంబుఁ ద్రిప్పుచు మదోద్వృత్తుండై మాధవుసమీపంబుఁ జేరిన ॥ క॥ తారకునిఁ గాంచి బ్రకయ ఘు । నాదమున్ బోలె శంఖమద్భుతలీలన్ । బూరించుచుఁ బురుషోత్తముఁ । డారూఢిన్ బాహుశౌర్య మలరన్వేగన్ ॥ వ॥ సర్వశత్రునికృంతంబును మహాఘోరంబును నగు సుదర్శనంబు ప్రయోగించిన నదియు వజ్రనిష్ఠురంబ



గు దానవేంద్రు వక్షస్స్థలంబునం బడి విఫలమాత్రంబయ్యె విచిత్రంబిదియు ॥ క॥ క్రీడాఘనశిఖి కళితని । జాయుధుఁడై యతనిచేర నరిగిరథమునన్ । మాయాశరీభుజశౌర్యము । స్వీయాస్త్రబలంబయార నిర్జరవైరి ॥ క॥ త్రిలోచనుండగు గుగుండుదక్క తక్కినవారెవ్వరు నేకాదృశవీర్యసంపన్నులుగారు గావున భవజ్జనని యేపుత్త్రీనలియగు బహుళాస్త్రలింగితటి మదపదార్థంబు సహింపుమనిన మాధవుం జూచి దైతేయవల్లభుండు సంప్రీతచేతస్కుండగుచు బహుమానపురస్సరంబుగా హరివీడ్కొని శూరపద్మునికటంబు నకరిగి వినయంబున నంజలిఘటించుచు బ్రణమిల్లిన ॥ క॥ శూరుం డపుడనుజన్ముని । యారిమినిం గౌఁగలించి కాని మూర్ధంబున్ । మూరుకొని నెవ్వఁగడున । వీరాగ్రణులంత చటులవిక్రమలీలన్ ॥ వ॥ చక్రవాళాచలంబుఁ జేరి యుండనగ్నంబులంగడంగొనుచు స్వర్గలోకంబునకు కృత్తప్రస్తావములగుటయును ॥ క॥ వాసవుబాహ్యస్త్రమ్ము విని త్రాసంబుం బొందివేగ తరుణీయుతుఁడై । యాసురలోకమువీడ్కొని । భాసురపీకరూపమున్ను వేంకటశాస్త్రిన్ ॥

(శూరపద్మాదులు బ్రహ్మవిష్ణ్వాదుల జయించుట.)

వ॥ అంత నద్దానవులు గొదినంబుచుట్టుకొని నిర్గమించు నిఖిలనిలింపుల నిరోధించి తద్వాస్తవహంబులం చూరఁగొని మహర్లోకంబునకరిగి తద్భువనవాసులచేత పూజితులై కైలాస క్షితంబుగా జనలోకతపోలోకంబులు వీక్షింపుచు క్రమంబున విధాతృభూషితంబగు సత్యలోకంబునకుం జనిరంత ॥ క॥ నలువ దశబ్రహ్మలతోఁ । జెలువుగ నెదురేగి దైత్యశేఖరునకుఁ గొ । ల్వలరిచి దీవనలొసఁగుచు । కలితసుధామధురఫణితిఁ గడునిట్లనియెన్ ॥ వ॥ ఏనుమీకు పితామహుండ నిందుమీకునెల్లకాలంబు భవద్విధమంబె మదీయవిభవంబుగాఁ గాద యొప్పథాగమనంబున నామానంబు సార్థకంబదిది భవలోదరులకు నశేకంబులగు నిమ్మహాయుధంబులు బ్రహ్మాస్త్రంబు రమ్యంబగురథంబును గొమ్మని యొసంగిన ॥ క॥ మునమంచి శూరపద్ముఁడు । సదయుండై పద్మభవుని సత్సన్మానంబిం పొదవంగఁ జేయుచు వేగమ । కదలెన్ వైకుంఠమునకు కడునసురాళితోన్ ॥ వ॥ తదాగమనంబు విని నారాయణుండు నుతిపరాయణుండగుచు నెదుర్కొని భవదీయకృపావిశేషంబున నిచటవసించుట నిష్ఫలంబు వీక్షించెదుగాక రమ్మని దైత్యునిం దోడ్కొనిపోయి ॥ క॥ అందంపు విచిత్రంబులు । నందంబుగఁ జూపి భూషణాంబరతతులన్ । ముందరఁ గానుక లిడుచు ము । కుందుం డుపచారములను గురుకెతొనర్చెన్ ॥ వ॥ అంత విష్ణులోకంబు విడిచి శూరపద్ముండు సోదరసహితుండగుచు నసంఖ్యంబులగు సైన్యంబులుగొలువ ననేకసహస్రగణపరివేష్టితంబును, నఖిలగణసాలకమనోహరంబును, నమరమునిగణపరివృతంబును, నభ్యున్నతిగోపురాట్టాలకపరిశోభితంబును, నతులితసహస్రస్తంభమంటపవిరాజితంబును, ననుపమవిలాసభాసురరుద్రకన్యాసహస్రాధిష్ఠితంబును, నవభేరీమృదంగకాహళడిండిమవీణావేణునినాదమనోహరంబును, ననవరతనాట్యవాదిత్రతాళతరంగరంజితంబును, నత్యంతవేదఘోషాన్వితంబును, నపరిమితవిభవాభిరామంబును నగు శివలోకంబునకరిగి కృతాంజలియగుచు దూరంబున సైన్యంబుల నిలిపి సహోదరయుతుండై మందగమనంబున శివపదారవిందంబుల డెందంబునం దలంచుచు వృషభగణపరివేష్టితవివిధదిశాభిరామంబును భ

పే మకూటాద్రి సవిధంబున మాయాఖ్యపురంబును నిర్మించి వెండియు సకలసముద్రంబుల సకలద్వీపంబుల ననేకంబులగు నగరంబులు విచిత్రంబులు గాఁగల్పించెనంత॥

(శూరపద్మాసురుఁడు రాజ్యంబు పరిపాలించుట.)

తే॥గీ॥ వీరమాహేంద్రపురమును వేడ్కఁగాంచి । శూరుఁ డాశ్చర్యమును బొందుచును గృహంబు । సొచ్చి దవిలించె హరిముఖ్యసురగణంబు । ననుజులును గొల్వ రత్నసింహాసనమున ॥ తే॥గీ॥ అంత పద్మజుఁ డెంతయు ననుపమాన । మణికిరీటంబు బెట్టి తన్మస్తకమునఁ । జెలువు మీఱంగఁ బట్టాభిషేకమపుడు । చేసె దనుజేంద్రునకు సురశ్రేణితోడ ॥ వ॥ అయ్యవసరంబున సకలదనుజులు సంతోషంబునం జెలంగిరంత నయ్యెడ ॥ క॥ దనుజాంతకమురాంతకుఁ । గనుఁగొని నే బిలిచినప్పుడు గడు శీఘ్రమునం । జను దెంతువు రాకిప్పుడు । చనుమని యనిచెన్నితాంతసంతోషమునన్ ॥ వ॥ మఱియు దిక్పాలకుండగు నీశాను నేకాదశరుద్రులను వీడ్కొని సింహాస్యతారకుల నిజనివాసంబుల కరుగుండని శూరపద్ముం డంత నాస్థానమంటపంబున నింద్రుండు తాంబూలకల్కపాత్రంబును, వహ్నివైవస్వతులిరువురు పానీయపాత్రంబులును, నైఋతి భృంగారువును, వరుణుండు వ్యజనంబును, వాయువు చామరంబును, ధనదుండు క్రముకభద్రపీఠికయుఁ, జంద్రసూర్యులు ఖడ్గఖేటంబును ధరియించి యిరుగెలంకులం గొలువ నానాగానవిశారదులగు గరుడగంధర్వకిన్నర సిద్ధవిద్యాధరగణంబులు గానంబులు సేయ, రంభోర్వశీమేనకాద్యప్సరసలు నటింప దివ్యసింహాసనారూఢుండై పేరోలగంబుండె దివిజులగనుంగొని ॥ సీ॥ మదిరహంకృతిమాని మామకకృషిఁ జేయు మస్తద్భటాజ్ఞ సేనమరనాథ । అంటినదహించుప కనుకుల పాకక్రియాధికారముఁ బూను మనిశమనల । అధికశాంతతఁ బాపు నిధనంబు సేయకుదానవ తతికి నెంతయు గృతాంత । శీతగంధాంబువుల్ శీఘ్రంబ కొని తెచ్చి పురి సేచనము సేర్చు పాశఁగనరుణ । ముగ్ధశాకికుచంబుల ముసువుదనర । గంధహిమవారి చిలికించి గంధవాహ । ముస్సగతిఁ గుల్కవీవుచు మార్జనమును । జేయుమెల్లెడ మదిభీతిఁ బాయకపుడు ॥ క॥ అలశంఖపద్మయుగళము । పలుమఱు దక్కఁగను సకలధటకోటులకున్ । వలసినధనమ్మొసగుము । త్కాలిక నుయుక్షేకసావధానుఁడ వగుచున్ ॥ మ॥ అలరారం బురిగోపురాగ్రమున నీహాయత్రతిన్నిల్చి శీ । తలఘర్మోదకబింబబృంద విసముక్తారత్నజాలంబులం । గలకంఠీజనకోమలాంగములలంకారంబు గావింపుచున్ । జలజాతిప్రియయౌంచగాయుమునుబాడ్జున్ మందమందప్రభన్ ॥ చ॥ మనసిజకేళికేగకను మానిపరాఙ్ముఖులై కడుకామన । స్వినులను గామినీమణుల చిత్తయురంజిలఁ జేసి వేగమే । దవకు నధీనలై రతిని దార్కొన పూర్ణకళాధురీణతన్ । ఘనమగ నత్మమూర్త్యమును గాంచుము శీతమయూఖమాటికిన్ ॥క॥ తనయులు పదుగురు తోడన । ననుభక్తిం గొలిచి యనుదినంబును శాంతిక విశుద్ధి నెగవది యిపుము । వనజాసన యస్త్రదాజ్ఞవర్తింపు మొగిన్ ॥ వ॥ అని యివ్విధంబునఁ బ్రతిదినంబు దేవతలకు తత్తత్ప్రయోజనంబులు నియోగించి గురుశుక్రులచేత మంత్రపూతంబులగు కలశోదకంబులం బ్రోక్షితుండై రత్నసింహాసనాసీనుండగుచు నింద్రాదిదేవతలు సేవింప దానవసమూహంబులతోఁ నిరంకుశంబుగా రాజ్యభారధారేయుండై ॥ తే॥గీ॥ దనుజవల్లభుం డంత నుదారమహిమ । దివ్యసౌందర్యరేఖను దేజరిలుచు । పద్మకోమలయను వేరఁ బరిఢవిల్లు । త్వష్టకన్యను వేడ్కనుద్వా



హమయ్యె ॥ సీ॥ సంగ్రామనిష్ఠురసాహసప్రక్రియా పటుభయంకరరూపు భానుకోపుఁ । జండప్రక్రమమహాజ్వాలావళిపతంగు దళిలబర్హిర్ముఖు నగ్నిముఖుని । ప్రళయకాలాఖిలభానుకోటి సహస్రరాజితధాము హిరణ్యనాము । రససాయమానసారాచాఖు భీకరవరభుజమిసరాహు వజ్రబాహుఁ । గాంచె తనయులనల్వుర గరిమమీర । పద్మకోమలయందును బ్రముదమెసఁగ । శూరపద్ముండు జితదైత్యశూరపద్ముఁ । డద్భుతోదారవిభవుఁడై యతులమహిమ ॥ వ॥ మఱియు సురాసురసిద్ధవిద్యాధరోరగకన్యల వివాహంబై వారలయందు నమేయవీర్యబలాన్వితులగు త్రిసహస్రసంఖ్యులగు సుతులంగని మహావిభవంబులఁ జెలంగుచు వేలువేల కోటిద్వయబలంబులు గొలువ సింహవక్త్రతారకులు నసురాఖ్యపుర మాయాపురంబు కనియెన ॥ క॥ పురిచేరి సింహవక్త్రుఁడు । సురుచిరలావణ్యశమన సుతనువిభూతిం । బరిణయమై వైభవవి । స్ఫురణ మహాధీరుఁ గాంచె పుత్త్రినిఁ బదసేన్ ॥ వ॥ ఇవ్విధంబున ననేకకన్యలం బరిణయంబై కుమారుల నూర్వురం గనియె తారకుండును నైఋతితనయయగు సౌశీకను బాణిగ్రహణంబై ధర్మసహితుండగు నసురేంద్రాఖ్యుండైన పుత్త్రినింగని యాత్మీయపురంబున సుఖంబుండెనని శౌనకాదులకు సూతుండు సెప్పె ॥ మ॥ ఇభచర్మాంబర శైలజాకుచతటీ భీష్టోపగూహక్రియా । సుభగంభావుకపక్షదక్షముఖహృచ్ఛంభత్ప్రతాపోజ్జ్వలా । ఋభుబృందార్చితపాదపద్మయుగళా యిచ్ఛాక్రియాజ్ఞానశ । క్తిభవిష్ణుప్రతిభాప్రవర్ధితజగద్విస్తారగంగాధరా ॥ క॥ లీలాభృద్వహ్న్యాత్రిగరళవి । నీలశిరోధిప్రభావనిర్జితబలభి । న్నీలోపలదామజగ త్పాలనశాలాత్త్రిపుర దానవశిక్షా ॥ స్రగ్విణి॥ పంచబాణద్విపేట్పంచతాక్షృన్మహా । పంచవక్త్రాలసత్పంచకృత్యోద్యతా । పంచభూతాదిసర్వప్రపంచాత్మకా । పంచకోశాతిగా పంచవక్త్రాశివా॥

గద్య॥ ఇది శ్రీమదిందుధరసుందర పాదారవిందార్చిత హృచ్ఛతపత్రసకలసుకవిజ
నానుగ్రహపాత్రసుగుణస్తోత్రపవిత్రచరిత్ర కాశ్యపస గోత్రకోడూరియెల్ల
నార్యపౌత్రశంకరామాత్యలక్ష్మాంబికాతనయ వినయవిధేయ బాల
సరస్వతీ నామాంక వేంకటాచలకవి ప్రణీతం
బైన శ్రీస్కాందంబను మహాపురా
ణాంతర్గత శివరహస్యఖం
డంబున నసుర కాం
డమందుఁ బ్రథమా
శ్వాసము సం
పూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ

లధికభీతినిఁ జొట్టుదు రలపురారి । కనుపమంబుగాఁ గోదండమగుదు నేను ॥ క॥ పాయక సుపర్వులందఱు । నాయందు వసింతు రనుదినం బది గానన్ । నాయభ్యున్నతి కనగా । నే యచలంబైనఁ గలదె యిద్ధరయందున్ ॥ వ॥ అని యఖర్వమూర్వారగర్వదుర్వాహుండై సుపర్వపర్వతవరేణ్యుండు పలికినపలుకు విని కోపంబు దీపింప నధరంబదర నవంధ్యగరిమనవ్వింధ్యగిరి యిట్లనియె ॥ తే॥గీ॥ వారకోభవుండు ధనువుగా వంచుటదియుఁ । దనకు మహిమగాఁదలఁచెను గనకశిఖరి । యమరగణములు తన మీఁద నధివసించు । టదియు గుణమనియెన్ని గర్వాంధుఁ డగుచు ॥ మ॥ సరసూర్యత్విషఁ దిఖుంప నప్రకట చండప్రక్రియ న్మించు నా । శరభాధ్యత్వు ఖురాగ్రసీమ నొకమేషపాత్రియమే గాద? గద్దరుణేంద్రంబు తదీయ పక్షఘనవాతప్రోద్ధృతంబై మిణుం । గురువై లేక గగనంబునం దిరిగ నాతుంబోఁడె యాశైలముల్ ॥ వ॥ అని వింధ్యాద్రిపలికిన విని నారదుం డాశీర్వదించి వియత్పదంబునం జనియె నంత ॥ తే॥గీ॥ వింధ్యశైలంబు గోత్రధంబు విస్తరిల్ల । నంబుజభవాండభాండంబు నంటిపెరిగె । తన్మహోన్నతి నూర్యచంద్రభ్రమణము । లాఁగనొకటనిరులొకచోట పగలుకెలఁగె॥ వ॥ అసమయంబున ॥ క॥ కాలభ్రమణమెఱుఁగకఁ । జాలించిరి సవనములపుడు జన్ములది విధిన । జాలము విరుద్ధచరితమని । యాలోచించి సురగిరి గుహాశ్రయుఁ ఘటజాత్ ॥ వ॥ గనుంగొని సంస్తుతింపుచు ॥ క॥ చులకీకృతసప్తార్ణవ । కలశోద్భవ తాపసేంద్ర కరుణను లోకం । బులు పరిపాలింపవె యనుఁ । బలువిధముల సకలభూతపటలిఁ గెలఁగన్ ॥ క॥ కరుణాహృదయుఁడవై విను । బ్రకటితమగు వింధ్యగర్వభరమున భువనం । బొకచో విగతార్కంబై । యొకచో సర్కప్రకాశ మొనరుచు నెప్పుడున్ ॥ వ॥ సర్వక్రియాగర్హితంబై యాగాద్యభావంబగుటం జేసి యేము క్షుత్పీడితులమైతి మదిగావున వింధ్యగర్వంబు నివారించి జగంబులు బరిపాలింపవే యని సురలు ప్రార్థించిన॥ తే॥గీ॥ వారి ప్రార్థనమన్నించి వారిననిచి । కలశభవుఁడంత నిజమనః కమలవాసు । సురుచిరవిలాసు కైలాసపురనివాసు । కిల్బిషనిరాసుఁ జింతించెఁ గృత్తివాసు ॥ వ॥ అప్పుడమ్మహాదేవుండు ప్రసన్నుండైన ప్రణమిల్లి యుమవల్లభుండిట్లనియె ॥ తే॥గీ॥ నగసుతాధీశ త్రిపురదానవ వినాశ । కలితభవపాశ యోగేశ గగనకేశ । ఘనకృపావేశ మునసాకుగలుఁగఁ జేయు । యురుబలము వింధ్యగర్వాపహారణమునకు ॥ వ॥ ఇక్కార్యంబున లోకసంరక్షణంబగు మఱియు దక్షిణదిగ్భాగంబున కనుగనలయుఁ బుణ్యక్షేత్రతీర్థవిశేషంబు కటాక్షింపుమని భక్తినమ్రుండగుచు నగస్త్యుండు బలికినం బరమేశ్వరుం డిట్లనియె ॥ మ॥ కలుగున్వింధ్యమదంబణంపబలముల్ గావేరినే తత్క్షణం బడలమంటుం గొనిదక్షిణంబునకు నేడ్కన్ బొమ్ము నా నంతలో । నలపుణ్యోదయుచంద్రమౌళికను ఘాలాక్ష భుజంగేంద్రమున్ దల నాకిస్సుడు నమ్మహాపురుషు వెంటంబోవఁగా శక్యమే ॥ వ॥ అనిన నీశ్వరుం డిట్లనియె ॥ క॥ జ్ఞానిధామఁడు కుంభజ । యూని నినున్విడువఁగలఁడు మహివనమున నెం । తేనియు నలంకరింపుఁగ భూసురతతి తక్షణంబు బొమ్మిపుడీవున్ ॥ వ॥ అనిపలికి యగస్త్యమహామునిన్ మోదంబుగా వీడుకొల్పి భక్తాభయప్రదుండగు నీశ్వరుండంతర్ధానంబు నొందె ॥

## క్రౌంచాసురునిశాపప్రకారము

మ॥ చనియెం గుంభజుఁడంత వింధ్యగిరి కంచల్లిలమార్గంబునం । జని మాయాపురి చెంగటన్



ఘనభుజాసి క్రౌంచు క్రౌంచాసురుం । డనిశంబు న్నిజమాయనుర్వి నగనంబాకాశమున్ భూమి జే । యునప్పుడిట్టి గిరిరూపాఁగ భువన వ్యత్యాసమున్ జేయుచున్ ॥ క॥ నానారూపధరుండై । దానవుఁ డతిశఠుఁడొప్ప ధరణీధరమై । గానఁబడంగను తోపవు । యాని సనె న్వానిమీద మార్గభ్రాంతిన్ ॥ వ॥ ఇట్లు జని మునీంద్రుండు మార్గంబరయనేరక నిమిషమాత్రంబు మోహితుండై కొండొకసేపునకు నిమత్పథంబు చూపట్టిన సూక్ష్మరూపంబున నొక్కెంచుక దూరంబరిగి పృథివీతలంబు గానకనిటునటుం భ్రమియుచు స్ఖలత్పాదయుగళుండై వేఱొకజాడ నరసి మరలి చనుదెంచుచు నిట్లు బహుప్రకారంబుల వ్యాకులతం బొందిచనిచని యొకవనమధ్యంబున నిలిచె. నాసమయంబున॥ సీ॥ ధగధగద్దీధితుల్ దనరఁ దటిల్లతల్ దిక్తటంబుల నెల్లఁ దేజరిల్లఁ । జెళపెళధ్వనుల చేఁ బిట్టుగా నుఱుములు ప్రళయకాలము నాఁటి పగిది మ్రోయ । ఛటఛటారవమున నుల్కాటములుగా వడగండ్లురాళ్లు ఉర్విన యట్లు రహిపడంగ । ఘుమఘుమార్భటులు నాలొక్కెనఁ జండవాయువుల్ తుజములు ధారుణిఁ గూల వీవ । నిండి కమ్ముక నంబరమండలంబు । కాళిమమమీరి ఘనఘనాఘనచయంబు । మత్తవేదండ తుండోపమాన సలిల । ధార లురవడి వర్షింప భోరుకొనఁగ॥ తే॥గీ॥ భీషణంబులకెల్లను భీషణంబు । మోహనంబులకెల్లను మోహనంబు । మృత్యువునకును మృత్యువై మిక్కుటముగ । భువనములకెల్ల వ్యామోహమును ఘటించె ॥ వ॥ అప్పుడయ్యగస్త్యుండు విభ్రాంతచేతస్కుండై యిదియేమి విచిత్రంబకో యని జ్ఞానదృష్టినవలోకించి క్రౌంచాసురుని మాయగాఁ దలంచి నిర్భయుండగుచుఁ గరదండంబున నతని సంతాడితుంజేసి దురాత్మా యొద్ధికారణంబున పర్వతరూపంబువై కపటంబున నన్ను భ్రమింపంజేసితి దాననంజేసి నీవు పర్వతంబువై షణ్ముఖుని శక్తిచేత నిర్దళితాంగుండవగుమని హస్తంబున జలంబుగొని యద్దానవునికి శాపంబొసంగి యధామార్గంబునం జనిచని ॥ మ॥ గనియె న్నిస్తుల సౌధశృంగవిహార త్కాంతాకరగ్రాహ్యనం । దనభూమీరుహ మంజరిం గులనగద్వంతి వళ్రశ్రేణికా । ఘనగండస్థల నిర్గళన్మదఝరిన్ గంగాపయశ్శీకరా । ఘనికాతాళనిధూతపాతకగిరిం గాశీపురిం జెంగటన్॥ తే॥గీ॥ ప్రాణులకు కర్మపుటమున బ్రహ్మమంత్రం । బెసఁగు సంసారతారక సురగభూము । శివుని విశ్వేశు నందు పూజించి యతఁడు । జక్క చనుదెంచె వింధ్యాద్రి సరణినెలమి ॥ వ॥ ఇట్లు చనుదెంచి ॥ ఉ॥ తాపసమౌళి కాంచె సముదంచిత పావని ఛాంతసంచర । ద్వీపి మృగేంద్రఖడ్గమహిషేభ లులాయతరక్షుకాలమున్ । దీపితభానుమండలగతి ప్రతిరోధసమేధమానవి । ఖ్యాపితశృంగజాలము నఖండవిశాలము వింధ్యశైలమున్ ॥ వ॥ ఇట్లు గని గిరీంద్రా నీవు సకల భూతనిగ్రహానుగ్రహపనుసక్తంపవదిగావున ॥ క॥ వినవల యేను మదభ్యనవము । తనయం గార్యార్థమిపుడు దక్షిణమునకుం । జనవలయు త్రోవ నిమ్మని । ఘనతరమధురోక్తి మౌని గనుఁ బ్రార్థించెన్ ॥ క॥ విని నగము మౌని కనియెం । జన నిచ్చేమార్గమెద్ది జాడ యెఱుఁగనే । చను మువ్వలయమున మదినిం । గినిసి యగస్త్యుండు వింధ్యగిరిశిరమునిట్లన్ ॥ క॥ కరమెత్తి యునిచి యడఁచిన । బరిపీడితమై నగంబు పదిభూస్థలిపై । శరణాగతుఁడగుచుం గడు । కరుణావారధి నగస్త్యుఁ గనుఁగొని పలికెన్ ॥ మ॥ అపరాధంబు సహింపుమయ్య గడుఁ జాయజ్ఞానకృత్యంబుస । త్కృపమున్నింపుము పూర్వమట్లనఁ గటాక్షింపం దగున్ వేగను । ద్విఢ

నావలయు నెద్ది కారణంబున భవచ్ఛిష్ట కుంభనంబునకు దొడంగితి నది గారణ ంబున శతక్రతునంబు నాశయగు గాకయని కృశముష్టియై నిజశిరఃకుంటనంబు గావించినయుపక్రాంతకుంభజుని భక్తిని శేయం బునకు సంతోషితస్వాంతుండై గంభీరవచనంబుల నూరడింపుచు విచిత్రచరిత్రుండగు గణపతి యిట్లనియె ॥ క॥ సురపతి నను బ్రార్థించిన । తరుసంతోషణము మాన్ప తద్దయుగ్రుడనై । వరదండి సలిలముల నిట్లురపించ్రోచితి కమండలువు భువిదొరఁగన్ ॥ వ॥ మునీంద్రా భవద్వరదితంబైన యది సకలంబునను సాంద్రబియంబగు నీశ్వరపూజార్థంబు గొనుము నీ కుండాగ్రంబునం గావేరి జలంబులు కమండలువునించిన తత్క్షణంబ కావేరి సద్వపరిపూర్ణయై ప్రవహించె నిర్విఘ్నంబున బహువరంబులొసంగి విఘ్నేశ్వరుండంతర్ధానంబునొంద నంత నగస్త్యుండును కుతలాఖ్యపురంబునకుం జనియెనంత ॥

—:*అగస్త్యమహాముని కుతలాఖ్యపురంబు ప్రవేశించుట*:—

తే॥గీ॥ భూతిభూషితసర్వాంగు భూరిమహిముఁ । గలితరుద్రాక్షమండితకంఠభాగు । శంభు పాదాంబుజార్చనాసక్తహృదయుఁ । సంభజానిగాంచి వైష్ణవుల్ కుతలపురిని ॥ వ॥ బ్రాహ్మణా నీవు శైవ్యుండవు మత్పురంబు ప్రవేశింప వలవదనిన వల్లెయని వెలుపల నిలిచి యగస్త్యుండు భాగవతరూపంబు ధరియించి కపటంబున నగరంబు ప్రవేశించిన ॥ క॥ భాగవతునరయఁ గనుఁగొని । భాగుగ వైష్ణవగణంబు ప్రణుతులు దనరన్ । వేగమ దోతెంచిరి శ్రీ । శాగారంబునకు నసుపమాదరమొప్పన్ ॥ వ॥ అంత నయ్యగస్త్యుండు వైష్ణవుల జూచి తదీయభావముల నేను హరిసపర్యసలుపవలయు మీరవ్వలజనుండని పలికి యేకాంతంబున విష్ణువును గరంబు స్పృశించి శివభావనచేత మర్దించిన శిఖరుండు శివాకృతియయ్యె నయ్యెడ ॥ క॥ మునివర్యుఁడు బూజించెను । ఘనశక్తిం బార్వతీశుఁ గలుషవినాశున్ । ఘనమున లింగాకారము । నొనరించి యనేకములగు నుపచారములన్ ॥ క॥ కనుగొని వైష్ణవులందఱు । మునినాథుని నడఁచుటకును మోవపినతఁడుం । గినిసి మహోగ్రతఁ జూచినఁ । జనిరి పలాయనమునొంది చయ్యన వారల్ ॥ వ॥ అంత నప్పురంబున వైష్ణవులను బ్రతిక్షించి యగస్త్యుండు దధీచి కణ్వ శైలాది భృగుగౌతమ బ్రహ్మ దూర్వాసుల శాపంబులఁ దలంచుకొని విభూతిసారయుక్తుండై ప్రత్యగ్రోళంబునందుండి సహ్యపర్వతంబుఁ జేరనంత ॥ సీ॥ చారునిర్మలసుధాపారమనోహారి దారుణవిపులపాతకవిదారి । రంగత్తరంగనభాంగణసంచారి సకలలోకప్రజ్ఞశమనివారి । గురుతరజపపారకూలంకషవిహారి యనుపమపుణ్యమార్గానుసారి । మునిజనసందోహమానోత్సవకారి సలలితకంజకింజల్కధారి । వెస నగస్త్యకమండలు వెడలువాతి । తరులతాకుంజపుంజకైకసరణిమీరి । భూరిగతిమీరి శ్రీకాళపురముదారిఁ । జేరి శాంభవభూరికావేరివారి ॥ వ॥ ఇట్లు ప్రవహించిన నప్పరోద్యానభూరుహంబులు పాదుర్భూతాంకురంబులగుచు పుష్పఫలోపశోభితంబులయ్యె యావృక్షంబులఁ గని బలారాతియు దౌర్మనస్యంబు విడిచి యత్యంతసంతోషంబున నిజవేషంబుతోడ శచీసమేతుండై సుగంధకుసుమకిసలయంబులుగొని యసదృశనిష్ఠాగరిష్ఠుండై విశ్వేశ్వరుం బూజింపుచుండె నా సమయంబున ॥ తే॥గీ॥ దివిషదావళి యరుదెంచి దేవపతికి । బాలఁ బ్రణమిల్లి పలికిరో సామియిచట । నెట్లుకొంటె వసించెద వింతతోడ । నాకనగరవసతి విమానంబువిడిచి



పూర్వప్రకారంబున బుద్ధికర్తవై మమ్ముల రక్షింపుచు సురపురంబున నుండవలయునని దివిజగణంబులెల్ల నావిలిరపుడు సురేంద్రుండిట్లనియె ॥ క॥ వినరోయి దివిజాలాకా । యసురవరుఁ డారపన్న హాజ్ఞమీఱలేఁగొని తెచ్చి మద్యమాంసము । లానఁగూర్చుచు గర్వితంపు టుద్యోగములన్ ॥ బహుకాలంబిట్లు గోలిచితి నిర్దయాత్ముం డద్దానవుండు పాపబుద్ధిచే శోక్కఁ జేయు శ్రీలోమజను బలాత్కారంబున గ్రహింపందలంచి నన్నునిరోధింప నూహించె నదిగావున మానభంగంబునకు నోపకిట్టిచోట వర్తించెద నసురనాశార్థంబు విశ్వేశ్వరునిం బూజించెద భవత్ప్రయాగమునకు సంతోషకరంబయ్యె కైలాసంబునకరిగి మహాదేవున కీవృత్తాంతంబంతయు విజ్ఞాపనంబుగావించి యుక్తప్రకారంబున నడువవలయునని పలికి యచట వారలనిలిపి యింగితంబెఱింగి నిజనిర్గమనంబునకు నవలం శచీదేవినిం జేరి సురపుంగవుండిట్లనియె ॥ తే॥గీ॥ దేవి శోకంబు మానుము దివిజగణము । గొలువఁ గైలాసపురమున కలరఁ బోయి । చంద్రమకుటున కతిగించి సకలవృత్త । మిరుగ దెలిపెద పురల నక్షోభయుండవు ॥ వ॥ నావచ్చునంతకు జగత్పాలకుండగు శాస్త నిన్ను రక్షించుచుండునని పలుమరు చెప్పి యిట్లనిరో ॥ ఆ॥వె॥ శాస్తయనఁగ దేవజగతి పుత్రుఁ డితఁడు । నట్టి యొల్ల జగముల నేలు వాఁడు । చెలియ బలుఁడుమనదు తెలుపుటలో నిద్రుఁడు । పరిభావ మధురభాషగాఁ ॥

—*ఇంద్రుండింద్రాణికి శాస్త్రోదయంబును దెల్పుట*—

మ॥ పరగన్ మున్ను సురాసురావళి పయఃపాథోనిధిన్ నిర్మథిం । ప రక్షింపం బుట్టె సుధారసంబది గ్రహింపన్ వారికన్యోన్యసం । గరమయ్యెం గడునర్తరిన్ హరిరమాకాంతుండు లావణ్యవిస్ఫురణన్ మోహినియై సమస్తదివిజస్తోమంబు వంచింపుమన్ ॥ క॥ విభజించి యమృతమొసఁగన్ గ । బుభసంతతి కపుడు శంభుఁడీశుఁడు జాడన్ । విభవమెసఁగిన మోహిని । ద్రిభువన మోహిని గాంచి ప్రీతి జనింపన్ ॥ వ॥ మోహాతురుండగుచు నిట్లని వర్ణించె ॥ ఉ॥ తిన్ములఁగన్నదోయి ఫణితమ్ములచక్కఁ రలించ విందుకాం । తమ్ములుగోర్కు మందహాసితమ్ములు వెన్నె లచాలు కుందక్నాతమ్ములు దంతము ల్పదగతమ్ములు జాలపదంబు తారగు । త్రమ్ములుచన్నదోయి అలితమ్ములుదీనితమాని కాసముల్ ॥ ఉ॥ ఖంబగుకాను గంతువిశిఖంబగుచూపు శిరస్తచంద్రకే । ఖంబగుమోము షట్పదకుళంబగుకేలు వినిందకాభ్రకే । ఖంబగ్నుఁగోప్పు శోకసుముఖంబగుఁజన్గవ చూచుచో త్రికే । ఖంబుసుఖంబుకంతము సుఖంబగునింతిసమాగమంబిలన్ ॥ వ॥ అని మోహపరవశుండై పరమేశ్వరుం డమ్మోహినిం గల్లనియె ॥ క॥ కమ్మనివిల్తుఁడు కేచురు । కమ్మనివారణదొడంగి యదలించె నహో । కొమ్మా యాదరమున నా । కొమ్మా మరుకేళిముద్దుకమ్మా నన్నున్ ॥ వ॥ అనిధర్షనోత్కారంపను వింతకేళురువ కమ్మోహిని యిట్లనియె ॥ క॥ మానవశరాసనవైరి । నే నారాయణుడ మోహిని వేషంబున్ । బూనితి నాతో నీకుం । దానఁగ సంభోగమకట తగియాదరయితో ॥ వ॥ అని యమ్మందమందాక్షవదనవర్ధనారవిందయగు కుందరదనకు నింతకుభయుండు మరలనిట్లనియె ॥ తే॥గీ॥ జగతి లోపల నానాల్గువక్త్రులందు । నీవు హరివనుక్తవి నిశ్చయముగ । పూర్వమేనాను నీకుసంభోగమునకు । కమలసంభవత్రగాంచితి గాదె పేర్మి ॥ సీ॥ మఱియు దారుకావనమున మహిమమీర । నాత్మకోరవె మోహినియ

గర్వహారుఁడు । గుహుఁడు మత్స్వామి శిఖిగమను క్రౌంచదారణుం డమ। శూరపద్మాది దనుజుల సొంపు మీఱఁ పాలనము సేయు మిమ్ము కృపానిరూఢి ॥ వ॥ మనంబున శోకంపవలదవిన నప్పలుకులువిని జయంతుండు నిఖిలదేవతలును సంతోషించి నిజస్వప్నంబు లతనికిం దెల్పినవిని యానందాంబున ॥ క॥ అట కదలి వీరబాహుఁడు । పటుతరగతి మీఱ శీయసురపట్టణవీధిం । పటలిఁ గనుగొనుచుఁ జనె న । చ్చటు మేల్కాంచె నతని దిద్యజసందోహంబుల్ ॥ వ॥ అట్లుఁ జని క్రమంబున నోమనోహరంబైన శూరపద్మభవనంబు సూక్ష్మరూపంబునం జేరి యుగ్రమయూరాఖ్యులగు ద్వారపాలకులకు ననేకభటులకు నగోచరుండై యరిగి లోపల నాస్థానమంటపంబు డాయంబోయి ॥ సీ॥ కర్ణకుండలరుచుల్ గండస్థలులు నిండ మణిమయకోటీరఘృణులు వెలయ । స్మితచంద్రికావళుల్ జెలువొంద మోమున దివ్యాంబరము మేనఁ దేజరిల్ల । నలికభాగమునందు నలర త్రిపుండ్రాళి సకలభావవధూటోచ్చయము గొలువ । సుందర నచ్చరల్ ముసవృగానటియింప భావావిశేషముల్ బొల్చి మీఱ । నమరకాంతలు నీరాజనములొసంగ । ననుపమసహస్రసరోజనాయామమంట । పమున మణిభద్రపీఠిని రమణమీఱ । శూరపద్మునిఁ గనియె న్బ్రచరుఁడు ॥ క॥ పరికించి వీని కెదురుగ । సరిగద్దియపై వసింపఁజను కేతున్నన్ । సరకుంగొనుచే నన్నని । హరసూనునిఁదలఁచె నప్పు డనుపమభక్తిన్ ॥ వ॥ శరజన్ముండు తదభీష్టం బెఱింగి సమున్నత నానారత్నవిచిత్రితంబును, నభ్యున్నతంబును, ననేకార్కప్రతీకాశంబును, నభూతోపమంబును, విశ్వప్రభాపటలనిరసితశూరసింహాసనంబును, నగు సింహాసనంబు ప్రసాదించిన నప్పీఠంబు నిజస్వరూపంబు తోడ వీరబాహుండు శూరపద్మునెదుట నధిరోహించి మహాప్రభావంబునఁ జూపట్టిన నతనిం గనుంగొని దనుజు లందఱును విభ్రాంతులై తమలోన ॥ ఉ॥ ఎవ్వఁడొకో యితఁడు భయమించుకలేక మనంబులోనఁ గల్ల్ గ్రొవ్వున ద్వారరక్షకుల గొబ్బున మోసముఁ జేసి నచ్చె శే । శవ్వనజాతసంభవుఁడొ యాహరియో త్రిపురాంతకుండొ వీ । డివ్విధి నెంచ కెవ్వరిది నింతమదోన్నతి నుండఁ జొప్పనే ॥ వ॥ అని యాలోచింపుచుండ శూరపద్ముండవ్వీరబాహుని కిట్లనియె ॥ ఉ॥ ఎవ్వఁడవోరి నీవు మఱియిచ్చట రాఁ గతమేమి యిప్పుడీ । వెవ్వరి దూత వెందు నని యుంతువు వాక్రుచ్చి రయంబు సెప్పితో । యివ్విధి నింద్రజాలమును హేమమణీమయభద్రపీఠమి । ట్లెవ్వనిచేతనైన సృజియింపఁగ వచ్చునె నాకుముందటన్ ॥ వ॥ నీ విప్పుడు సాహసంబున ముక్తభయుండవై నామ్రోల నలంకారంబుఁ జూపట్టి సింహాసనం బధిరోహించితి గావున ॥ క॥ వాగర్థ్యో నీదు విద్యా । పారగుల్ట్య్యంబి ప్పశేవు బహుమతిపాత్రా । త్యాగము గోరదవో భవ । దాగమనం బేమి చెప్పు మనుడు నతండున్ ॥ వ॥ అద్దానవేంద్రుని వచనంబులు విని విస్మయమానముఖాంబుజుండగుచు నిట్లనియె ॥ క॥ విను శూరపద్మ చెప్పెద । మనమున ముదమొదవ నింక మునివొదవనిక వనరుహసంభవలక్ష్మీ । వనితావల్లభులు దేవవర్గముతోడన్ ॥ క॥ నీవలని యుపద్రవంబులు సహింపలేక సకలాభయప్రదుండును, సర్వలోకోపకారుండును శాంతుఁడును, సకలపురుషార్థప్రదుఁడును, సాక్షాత్కైవల్యదాయకుండును, నగు కైలాసవాసునిం జేరి కృతప్రణాములై నుతించి వినయావ్యతులై యిట్లనిరి ॥ తే॥గీ॥ శివమహాదేవ నిర్జరశ్రేణి నెల్ల । శూరపద్ముఁడు బాధించు ఘోరముగను । తద్వినాశంబు పర్యాలోకనయయుండు । గాంచుము కుమారు సుకుమారుఁ గరుణఁ దనర ॥ వ॥ అనిన పరమేశ్వరుం డంగీకరించి దనుజకులవిదారకుండగు కుమారు నవ్విధంబునం గాంచి యాతనితో ని



ట్లనియె ॥ తే॥గీ॥ పుత్త్ర దేవసేనానివై శౌర్యమొప్పుడు । గాంధిశిశగను మరుద్గణము నెల్ల । శూరపద్మాది దానవశూరతతుల । నాజి బరిమార్చు నాయాజ్ఞ వహించి ॥ వ॥ అని యిట్లు జగత్పతియగు నీశ్వరుం డానతిచ్చిన గుమారుండు చైత్రయాత్రోత్సుకుండై కదలి మార్గమధ్యంబున మహోదురతాత్ముండగు క్రౌంచాసురుం దెగటార్చి భవత్సోదరుండగు తారకుని వధించి విజయంబు చేకొని శాంతినగరంబున కరుదెంచి సకలసుపర్వులుగొల్వ నందు నివసించి యద్దేవవల్లభుండు దయాళుండగుచు నీకడకు నన్నుఁ బుత్తెంచిన కర్జంబు వినుము జయంతప్రముఖులగు దివిజుల విడిచి నీగు పురంబున సుఖంబున నుండు మట్లు కాక గర్వంబునఁ బ్రుల్లదేనియు సంగరాంగణంబున సకలబంధుసహితంబుగ నిన్నుఁ బరిమార్తు నీయర్థంబునందు సంశయంబు వలదని యిట్లు నీకుబుద్ధి చెప్పు మనియె నంతయు ।

—:*వీరబాహుని సూక్తులకు శూరుఁడు రోషించుట*:—

తే॥గీ॥ ఇవ్విధంబున నున్నది యీశ్వరాజ్ఞ । విబుధకతి నెల్ల నోశూర విడిచిపుచ్చి । సుఖముగవసింపుమనుచు విస్ఫుటము గాఁగ । వీరబాహుండు వచియించి యూరకుండె ॥ ఆ॥వె॥ శూరపద్ము డంత వీరబాహునిఁ గాంచి । కోపరీక్షణములు ఘూర్ణిలంగ । నర్వి నాదుశౌర్య మెక్కింత యెఱుఁగడా । బాలకుండు విడునె బాల్యచేష్ట ॥ క॥ విని నప్పుడ తారకవధ । మును బహుకోపమునబాలుపొగరు వణంపన్ । మనమునఁ దలంచి పట్టణ । మును వెడలిరి నంతలోనఁ బొడమిన లజ్జన్ ॥ వ॥ అజ్ఞుండగు నర్భకుం బరిమార్చ నుచితంబు గాదని యుపేక్షించిన దోషంబువలన నింత కార్యంబు పుట్టె నట్లైనియు నెల్లి మఱీయంబగు నెల్లసేనలం బనిచి తదీయదర్పం బణంగించెద గాని జయంతప్రముఖులగు నిఖిలదివిజుల విడువనేర మఱియు పాకశాసనుం బంధించెద నని గర్వోద్రేకంబున దానవేంద్రుండు పలికిన విని వీరబాహుండు క్రోధోజ్జ్వలిత హృదయుండగుచు నిట్లనియె ॥ క॥ అరివిపినదావపావకు । హరనందను మహిమ నాక్ష నరయఁకఁ గుమతీ । ధర నతని నర్భకుండని । యుద్ధతదర్పమునఁ బలుక నుచితమె నీకున్ ॥ వ॥ వినుము పరమేశ్వరునకు స్కందాఖ్యయగు మూర్తి యితం డతనివలన బ్రహ్మాండంబు లుత్పన్నంబులగు నతనియందె లయంబునొందు నతని మహామహిమ గొనియాడ బ్రహ్మాదులకు నగోచరంబగు నిప్పుడీ నతనిచేత దౌత్యంబున నియుక్తుండనై చనుదెంచితింగావున దురాత్ముండవగు నీ కవమానంబుం జేయక యూరకున్న వాఁడనని పరుషవచనంబుల నవ్వీరబాహుండు భర్త్సించిన ॥ శా॥ శూరుండంత నమర్ష మొప్ప దనుజస్తోమంబు ప్రేరేపినన్ । వారంతే ద్విసహస్రబాహువులు భాస్వద్వక్త్రసాహస్రయుక్ । భూరిస్ఫూర్తిని రాజిలంగ విజయప్రోత్సాహసన్నిద్ధులై । ఘోరాకారతఁ జుట్టిరాతని కడుంగోపంబు దీపింపఁగన్ ॥ వ॥ అంత వీరబాహుండు దానవేంద్రుండు గనుంగొనుచుండ వారి నందఱ పురందర వజ్రనిష్ఠురంబగు కరంబునం బట్టి నిట్టట్టు చవనీక విట్టుగ నేలంగొట్టి నిమిషమాత్రంబున విగతప్రాణులం జేసి యాయాస్థానమంటపంబు విడిచి యెడనెడ తత్సింహాసనంబు తిరోహితంబయ్యె నంత ॥ క॥ శూరుంగని మఱియు శతముఖు । నారూఢిగ నతని మీఱ ననిచిన వాఁడున్ । ఘోరములగు సేనలతోఁ । బోరికి రాఁ జూచి వీరపుంగవుండంతన్ ॥ వ॥ పారవశ్యంబులగు సైన్యంబులపయి వింశతిసహస్రసకలశమండితంబగు గోపురంబు

మెఱలించి యతివేగంబున వైచిన నతనిసైన్యం బంతయు శాతంబరొక్క నంత శతముఖుండు నిశాంతజ నితామర్షుండగుచు ననేకశరవర్షంబులు గురిసిన ॥తే॥గీ॥ ఉరుబలుని వీరబాహుని యొడలు దాకి । తచ్ఛరంబులు జూర్ణమై ధరణిఁ ద్రావాలె। వెండియును వీరబాహుండు వేయెఱయొండు। గోపురంబును బెకలించి కోపమునను ॥క॥ శతముఖుని మీద వైచిన । శతధాభిన్నంబొనర్చె చయ్యన దానిన్ । శతసాయకబృందంబుల । శతముఖుఁ డఖిలాస్త్రశస్త్రచతురుం డగుచున్ ॥వ॥ మఱియు శతముఖుండు కోపాటోపంబున వీరబాహుంపయిం బ్రాసతోమరశక్తినారాచాదిసకలాయుధంబులు బఱపిన నవి యన్నియు వీరబాహుండు భగ్నంబు గావించి మఱియు నతని ధనువుం ద్రుంచె నద్దోషాచరుండుగా మగుడి రోషభీషణుండై చలంబు రెట్టింప ద్విశతంబులగు కరంబుల నతనిం బట్టికొనఁ దలంచినం గనుంగొని వీరబాహుండు లీలామాత్రంబున వానిం బఱద్రోచి యొక్కపాదంబున తద్వక్షస్థలంబు ద్రొక్కి రెండవపాదంబున శిరంబు లన్నియు మత్తదంతావళంబు నారికేళంబులు దుల్చువిధంబునం బోలె సడియుదంబు గావించె నప్పుడు ॥చ॥ శతముఖునిట్లుఁ జంపి పటుసాహసమొప్పఁగ వీరబాహుఁ డ । ద్భుతముగ నున్నతాకృతియు పూని పథంబున ధాత్రివేగ ను । ద్ధతగతి తన్నినం బఱిలె ధారుణి యప్డు మహాజలౌఘము । ద్గతిమయి ముంచె నశ్వముల దైత్యబలంబుల నాశమొందఁగన్ ॥వ॥ మఱియుఁ బంచాశన్మహాక్షౌహిణీసంఖ్యంగల దనుజవరు లెదిర్చి నిశితశరపరంపరలు వీరబాహునిపయిం గురిపిన నతనిశరీరంబు రుధిరంబునం దొరఁగె నంత వీరబాహుండు కోళలంబు పొంచుచు గరచరణంబులు విసరి కరపుటసురలఁబాఱి సమరపరిసరంబున నెసగునగరసంరక్షకులగు రక్షోవిసరంబులం దూలించి పంచోత్తరశతయోజనవిశాలంబును, సహస్రయోజనోన్నతంబును, నీయుతశాతకుంభకుంభసంభృతంబును, మనోహరంబును, నైనయొక్కగోపురంబు పాణితలంబునం గీలించి శూరపద్ము నాస్థానమంటపంబుపై వైచిన తత్పతనంబున మంటపంబు శిథిలంబై నేలం గూలె నిట్లు తక్కిన మంటపంబులును, ప్రాకారవలభిగోపురాట్టాలకసౌధంబులును, గండశైలస్తంభభూరుహంబులును బెరికి దనుజబలంబులం గూల్ప నలుగడల బడవైచియు నట్టహాసంబొనర్చుచు నటించె నప్పుడెంతయుఁ జూచిన గోపురంబులు పయింబడియు, ప్రాకారంబులమీద దొరిగియు, సౌధంబుల గడపియు, నాట్టాలకంబులు దొరగియు, గొందఱు ముక్తకేశాంబరులగుచు పలాయనంబు నొందిరంత ॥తే॥గీ॥ మహిఁ దొరంగిన యాస్థానమంటపమును । బట్టణక్షోభమును శూరపద్ముఁ డరసి । పంచశతవక్త్రిలసహస్రబాహులునగు । నసురవీరుల రావించి యనియె నపుడు ॥క॥ భటులార పొండు వేగమ । పటుగతి నావీరబాహు బంధింపుడనం । జటులమహాభుజబలు లం । ద్భటవృత్తిం శూరుతోడ పలికిరి వరుసన్ ॥తే॥గీ॥ మీరు చెప్పక పూర్వంబె మేము వేల । సంఖ్యకో వాని బంధింప శక్తిలేద । యుష్మదాజ్ఞ నపేక్షించి యుంటగాక । ననిన శూరుండు భటులకు నాజ్ఞ యొసఁగె ॥వ॥ ఇట్లు శూరపద్ముచేత ననుజ్ఞాతులై కదలి కదనంబునను విదళితారాతిసమూహుండగు వీరబాహుం జుట్టి ముట్టి నిశితంబులగు నిఖిలాయుధంబులు వఱపిన నవ్వీరాగ్రేసరుండు సరకుసేయక సవిధంబున నొకసమున్నతంబగు సాలవృక్షంబు బెరికి దాన నయ్యస్త్రంబులన్నియు చూర్ణంబుగావించి వారలఁ గొందఱ విగతజీవులంజేసె నంత దూతముఖంబున తద్వృత్తాంతంబు వినిశ్రోపద్



బుదీపింప శూరపద్ముండు నిజాత్మజుండగు వజ్రబాహుం బంచిన నతండు సకలగివ్యాభరణభూషితగాత్రుండును, గవచధనుస్తూణీరాద్యలంకృతుండును నగుచు దశసహస్రతురంగంబులు గట్టిన రథంబధిరోహించిన॥

—:*వీరబాహు వజ్రబాహుల యుద్ధము*:—

సీ॥ మహిమతో మంత్రికుమారులు సేనాధిపకుమారులును వెంటబలసి గొలువ । తగవాహినీపంచదశకముల్ మదసింధురంబులు వట్లన రథములలర । నెలమి సాహస్రవాహినులొప్ప మారుతజవయుతహయములు సంచడింప । ద్విసహస్రవాహినులెసఁగు సైన్యంబుల పటహకాహళమహార్భటులు మొరయఁ । జామరంబులు ధ్వజములు ఛత్రములును । దాల్చి పరిజనములు దండఁ దనరుచుండ । శపథమున వజ్రబాహుండు సాగె వెడలి । వీరబాహునిమీద దోర్వీర్యమడర ॥తే॥గీ॥ ఆప్డు డాకస్మికంబుగ నవనియందుఁ । బడియె నుల్కానలంబులు భయదముగను । గాకములు గూసెఁ గుష్కవృక్షముల నిలిచి । వినబడియె శివారవములు వివిధముగను ॥వ॥ మఱియు రక్తమాల్యాంబరధారిణియు, రజస్వలయు, వివస్త్రయును, తైలాప్తశిరస్కుండును, విచ్ఛిన్ననాసాబాహుపాదులును, నెగురైన దుశ్శకునంబులు గనుంగొనియు మనంబున శంకింపక నద్దానవాగ్రణి రణాంగణంబున వీరబాహుం గదిసె నప్పుడు ॥తే॥గీ॥ వీరబాహుండు తత్సైన్యవితతిఁ గాంచి । సైన్యమిది ద్రుంచి పోవుదు శరజాకడకు । ద్రుంప కరిగిన షణ్ముఖుదూత నేను । గానటంచును శపథంబు బూనివేగ ॥వ॥ అయ్యమేయబలుండు నభంబున కగని మేఘగర్జనంబు లొనర్చిన ॥క॥ వినితద్గర్జానములనవుం బావజ్రబాహుఁ డాశ్చర్యమునన్ । దనసారథియగు విజయుం । గనుంగొని యెదిరేమి యనుచు గడుసూతుండున్ ॥వ॥ తద్విధం బంతయు దెలియఁ జెప్పిన నంత వద్దనుజాంకు యుద్ధసన్నద్ధుండయ్యెనట మున్ను సకలసైన్యంబులు శౌర్యంబులు మెఱసి యనేకశరవర్షంబులు వీరబాహుపయిం గురిసిన నిజకాయంబు రక్తసిక్తంబగుటకు కోపోద్దీపితుండై వీరబాహుం డసదృశబలుండగుచు ననేకులగు రక్కసుల నొక్కపెట్టునం గేలం గొని బ్రహ్మాండపర్యంతం బెగయ వైచియు గొందఱ చరణంబులు గేలంగీలించి బిఱబిఱం ద్రిప్పి నేలం జదిపియు, గొందఱం బట్టి దిక్కులకు బాఱవైచియు, గొందఱు కపోలతాడనంబుల హతులంజేసియు, గొందఱకేశపాశంబుల బట్టిద్రిప్పి సముద్రంబుల నంతర్ద్వీపంబుల లోకాలోకంబులం బడఁజిమ్మియు, గొందఱ పాదహతులగావించియు, గొందఱ ముష్టియుద్ధంబున బడలవడనడచియు, గొందఱ కరంబుల నొడిసి పట్టి కాళ్ళుద్రెళ్ళుచీల్చి లీలామాత్రంబున నింగికిఁ బాఱవైచియు, గొందఱశిరంబుల ముష్టిఘాతంబుల నుదరంబులు బదంబులు ద్రొక్కులుజేసియు, గొందఱ నురస్థలంబులు నొక్కపాదంబునం ద్రొక్కిపట్టి యొండు పాదంబున నుత్తమాంగంబులు నలినలిజేసియు, గొందఱకరంబులు నులిమియు, గొందఱఁబదంబులం బట్టి యూర్ధ్వంబున కెగరఁజిమ్మియు, వారలు మగుడి ధరణిం బడుసంరంభంబున నద్దనుజుల వేఱొక గొందఱిని బట్టి వారిని లక్ష్యంబుగాఁ జూచి వైచియు, నివ్విధంబున నఖిలదానవుల బరిమార్చి తనివి చనక వొక్కపటంబు బెరికి సేనాపతికుమారులం బదియుగొట్టి విగతప్రాణులం జేసె నంత ॥తే॥గీ॥ వజ్రబాహుఁ డమర్షంబు వర్ధిలంగ । శార్ఙ్గసూర్యద్యుతి

ధనువున శరసమూలు । బాహుసహస్రంబు లుద్ధతిఁ బఱప నవియు । వీరబాహుండు ద్రుంచె దోస్స్థైర్యమెసఁగ ॥ వ॥ మఱియు నయ్యసుర ఘోరశరాచంబు లెన్నియుం బఱపిన నవియన్నియు వీరబాహుండు మధ్యంబున విదళితంబులు గావించె వెండియు నద్దానవుఁడు బాణసహస్రంబులు వర్షించిన నవ్వీరుం డయ్యంబకంబులు కరంబునం గొని తునియలు జేసి నంత యు తే॥గీ॥ వజ్రబాహుండు మఱియును వాడిశరము । లతనిశిరమున నురమున నంఘ్రులందు । నుదుట బాహుల జానుల నుదరమునను । వేలసంఖ్యల నాటించె విజయమెసఁగ ॥ వ॥ ఇట్లు నాటించిన వీరబాహుండు గించుకతడవు మూర్ఛితుండై యంతట తెలివి గాంచి రోషంబ గ్గలంబుగా నశ్వంబు లసుందరంబగు తదీయస్యందనంబు నిజపదాఘాతంబున నూరు వ్రయలం జేసి నిట్లు రథంబు విదళితంబగుటయు వజ్రబాహుండు వేలొక్క తేరెక్కి యుక్కుమిగుల బాణసహస్రంబులు లలాటంబున బ్రయోగించిన వీరబాహుం డవియన్నియు కరంబున గట్టియు దనుజాతోడ గూడ తద్రథంబు లక్షయోజనపర్యంతంబు నూర్ధ్వంబున కెగయఁ జిమ్మిన శతాంగంబు విశీర్ణాంగంబై ధరాతలంబునఁ బడియె నట్లు వజ్రబాహుం డరదంబు తోడఁ గూలియు బొలివోని ధైర్యంబునలేచి కోపవహ్నిఁ బొంగుచు ముహోన్నతంబగుఁ జాపంబు గేలించి యుద్ధసన్నద్ధుండయ్యె నయ్యెడ॥ ఆ॥వె॥ వానిధనువుఁ ద్రుంప నడివీరబాహుండు । ఖడ్గ మసురుఁడంతఁ గరముబూని । కోపమడర నెగయఁగొబ్బున వీరుండు । ఖడ్గముష్టి తోడఁ గరముఁ గునిసె॥ వ॥ ఇట్లు విదళితకరుండై వజ్రబాహుండు గదాదండంబు వేలొక్క కేలం గొని వీరబాహుని పయిం బ్రయోగింపఁ జనిన ॥ క॥ కరవాలంబున. తద్గద । పరిభూతి మొనర్చి వీరబాహుండు కడిమిం । బరిమార్చె వజ్రబాహుని । శిరములు నిశితాసిధార శిథిలిత గా జేసెన్॥ వ॥ ఇవ్విధంబున నిఖిలదానవ సైన్యంబుల సంగరాంగణంబునం బొరిగొని మహావిజయలక్ష్మీ విరాజమానభుజుండగుచు నిరతిశయ కుతూహలంబున నిజస్వామిసన్నిధి కరుదేర తలంచెనంత నాదిత్యుండస్తమించె నప్పుడు॥ క॥ స్కందుని మహిమలు బలుమఱు । విందిం చుటకున్ ఖలుండౌ వేఁడుం నిజముగా । బొందెను శూరుండని మది । నందుచు మదివీరబాహుఁ డరిగె జయమున్॥ వ॥ ఇట్లరిగి నిరర్గళపరాక్రమధుర్యుండగు నవ్వీరబాహుండు మార్గంబున నద్భుతంబులు గ మంగొనుచుఁ బరిఘోల్లంఘనంబుఁ జేసి నిమిషమాత్రంబున లంకాపురంబు సేరిన॥ తే॥గీ॥ అచట వ్యాళీముఖుండు తదాగమంబు । శీఘ్రముగ నెఱిఁగి సహస్రశిరములలర । భాసురంబుగ ద్విసహస్రబాహు లొప్ప । తత్కృతంబైన పుత్త్రవధంబుఁ దలఁచి॥ క॥ ఉరురోషంబున నేవా । ఘ్రాస్యుండై యెదిర్చి వీరబాహునితోడన్ । వరశౌర్యుఁడు వ్యాళీకం । ధరుఁడిట్లనియె న్నితాంతదర్పంబెసఁగన్॥ చ॥ నిలునిలు మోరి యెచ్చటికి నీవిఁకఁ బోయెదు యుద్ధమత్సుతుం । గలన వధించి తీవటులఁ గావ మదంబు డుగన్ భవద్భుజా । బలమణఁగింతు నేఁడిపుడు భండనమందున మత్పరాక్రమో । జ్జ్వలతనుజాతమంచు ననివారణని ష్ఠురభావ లాడినన్॥ వ॥ వీరబాహుండు వానుఁ గనుచు నద్దానవుని కిట్లనియె సహస్రముఖంబులు ద్విసహస్రకరంబులునుం గల మహాకాయుండవీవు నేఁ డేకశిరస్కుండను సంగరాంగణంబున నీవలసిన నది చేయుమున నంతలోన వ్యాళీముఖుఁ డెసైన్యంబు లురువడించి యిరుదెసలఁ గప్పి యబ్బలుమగవి మీద విశిఖశరపరంపరలు గురిపించె నంత వీరబాహుండు ఖడ్గంబు చేకఁ బూని । యవియన్నియును విదళించె నాతఁడంబు యంత వ్యా



ళీముఖుండు సహస్రబాహు । ఖులవడఁ చె తద్భుజాంతర కులఘుపటిమ ॥ తే॥గీ॥ అసురేంద్రుని బాహుసహస్ర మపుడు । వీరబాహుండు నిశితాసి ధారఁ గునిసె । మఱియు నితరకరంబుల మనుజభోజి । క్రుద్ధుఁడై పర్వతంబులు గొనిరయమున॥ తే॥గీ॥ వీరబాహుని మీదను వేగ వైవ । నవియు చూర్ణంబులై రాలెనతనిఁ దాఁకి । యంతనద్దైత్యు నితరబాహాసహస్ర । మద్భుతంబుగఁ దునుమాడె నలఘుపటిమ॥ వ॥ ఇట్లు కరంబు లన్నియు విదళితంబులైన నయ్యసురుండు శోకవిహ్వలుండగుచు తుండాసహస్రంబున మగుడి బంధింపం దొడరిన వీరబాహుం డనివార్యశౌర్యంబున తత్తుండాసహస్రంబును గరవాలంబునం దునుమాడి సంగరాంగణంబు నెత్తురు నెరపె నంతయు క॥ దానవసంఘము నీగతి । మానితశౌర్యుండు సమరమండలివిగత । ప్రాణులఁ జేసి పయోనిధి మీసుగ లంఘించి గంధమాదననగమున్ ॥

—:*వీరబాహుఁడు శూరుని వృత్తాంతము కుమారస్వామికిఁ జెప్పుట*:—

తే॥గీ॥ చేరి యవ్వీరబాహుండు శీఘ్ర మంత । పూర్వరూపంబునను కాంగిపురమునకును । వచ్చి రవ్విధఁ గనుగొన వనజభవుఁడు । హరియు నింద్రియు నాదిగా నఖిలసురలు॥ వ॥ మఱియు నష్టాదికలక్షగణవర్యులును ప్రహృష్టాంతరంగులగుచుఁ బ్రణామస్తోత్రంబుల నాతనికి ప్రియం బొనర్పుచు కృతాంజలులై రయ్యవసరంబున వీరబాహుండు వారల నాలింగనసంభాషణంబుల నాదరింపుచు వారలకు తద్వృత్తాంతం బంతయు విశేషించి యింద్రునకుఁ దెలిపి సకలబృందారకసమేతుండగుచు నిందుకళాధరు నందను మందిరంబునకుం జని ॥ క॥ సురసేనావిభుఁ డగుహు । చరణాంబుజయుగళమునకు సాష్టాంగనతుల్ । విరచించి ముకుళితంబులఁ । గరముల్ గొనియా దెస్వప్తి కారుండె నుమముల్ ॥ వ॥ నిజస్వామిచేత కృతానుజ్ఞుండై ॥ తే॥గీ॥ వీరబాహుండు సహోదరు వినయమొప్ప । దనుజవృత్తాంత మంతయు తగవచించె । దేవ మీరానతిచ్చిన తెఱఁగు శూర । వస్తుఁ గోడను జెప్పితి బహువిధముల ॥ క॥ వినడయ్యె యించుకేనియు । దనుజుఁడు నీయాజ్ఞ మీఱె తద్దయు నదిగాకను సేనలఁ బురికొల్పెను । దనపై నిశితాస్త్రశస్త్రతతులుఁ గురియన్ ॥ క॥ నీకరుణచేత దనుజానీకంబును దునిమి యాజినిస్థుల మహిమల్ । నీకడకు జేరఁ గంటిని । బ్రాకటగుణరత్నహార భర్గకుమారా ॥ వ॥ అనిపలికి వినయనమ్రుండై దండనిలిచిన వీరబాహుం గనుంగొని షణ్ముఖుం డిట్లనియె॥ క॥ మూర్తులకు గాసిఁ బొందితి । నీకంటెను స్వామికార్యనిపుణుఁడు గలఁడే । లోకంబున నని యంతట । లోకేశ రమేశ దివిజలోకేశ్వరులన్ ॥ వ॥ మఱియు నెల్ల దివిజాలం గనుంగొని దేవసేనావిభుం డిట్లనియె ॥ క॥ అంగీకరింపఁడయ్యెన । భంగమదోన్నతిని శూరపద్ముఁడు మత్సా । క్షిం గరుణింతనికేటికి । సంగరమున నేక బాహుశౌర్య మెసంగన్ ॥ వ॥ మీరందఱు గనుంగొనుచుండ భ్రాతృపుత్త్రమిత్త్రబాంధవసమేతంబుగా శూరపద్ముని జంపి బరిమార్చెదనని శపథంబు పలికిన సుబ్రహ్మణ్యుని వచనంబులు విని హరిబ్రహ్మాది సకలదివిజులు సంతోషభరితాంతరంగులై రంతయు॥ తే॥గీ॥ సకలదానవవిధ్వంస నిపుణుఁడైన । వీరబాహుని చరితంబు వీనులలర । విని మహీసురపుంగవుల్ విస్మ

యంబుల గొందిరాత్మను నిర్భరానందములగుచు ॥ వ॥ మఱియు సూతుండు శౌనకాదులం జూచి శ్లక్ష్ణరసాయనంబుగ నింక జెప్పెద సావధానంబుగ వినుం డని యిట్లనియె ॥ క॥ అంతట శూరుఁడు పుత్త్రుని । యంతిమదశ నాలకించి యసురావళిచే । సంతాపమొందె నలినిభ । కుంతలయగు నట్టి పద్మకోమలితోడన్ ॥ వ॥ ఇవ్విధంబున పుత్త్రవియోగసంజాయమానవేదనాదోధూయమానమానసుండగు శూరపద్మునకు మంత్రివర్యుండగు ధర్మకోపుఁడత్యంతశాంతవచనంబుల నూరడింపుచు నిట్లనియె ॥ క॥ అతులైశ్వర్యయశోభృత । మతిశాలివి శౌర్యనిధివి మహనీయజయా । న్వితుఁడ వురుతంత్రవిదుఁడవు । హితనష్టుఁడువోలె నేల ఖేదమునొందన్ ॥ క॥ నీవిట్లు శోక మొందిన । నీవేల్పులు సెన్నుఁ జూచి యుప్పొంగు నకరే । కావున శోకము విడువుము । భావంబున దూతసేయుపని కిం తేలా ॥ క॥ వరశౌర్య రిపుమారున । కరయఁగ సాయుజ్య మల్పమగుఁగాకున్నన్ । దురమునను దూతచే న । య్యరివీరమదాపహారి హతుఁ డెట్టులగున్ ॥ వ॥ అని యిట్లు మంత్రిచేత బోధితుండై దానవేంద్రుండు పార్శ్వవర్తులగు దనుజులం గని యద్దూతయిప్పుడున్న వాఁడో చనియెనొ తెలియుం డని వారందఱు నసురులకు పరాభవంబుగావించి దూతవోయిన తెఱంగతనికి విన్నవించిన । తే॥గీ॥ అంత నబ్జజాతోడితే నసురవరుఁడు । దూతననిపిన నతఁడు దోడ్తోడ నరిగి । స్కందుసన్నిధి నుండె జంగమలభవుని । విబుధులను గాంచి పెసవచ్చి విన్నవించె ॥ క॥ శూరుఁడు పనిచిద్వార్తయు । వారిజగర్భాదివిబుధవర్గము సెల్లన్ । సారెకు మదిగోపించియు । వారణము స్వాండవిభుని పనరుహాగర్భున్ ॥ తే॥గీ॥ దూతముఖమున రావించి ప్రీతిఁ జేసి । పట్టణంబును బూర్వంబు పగిది మెఱయ । శీఘ్రము రచింపు మనవుడు జెలంగెసలంగ । నతఁడు నిర్మించి మునుపటియట్లు పురిని ॥ తే॥గీ॥ ఆత్మసన్నిధికరుదేర నతనిఁ బనిచె । బహువుగ రొమ్ముసర్చి శూరుఁడు భటులతోడ । పండమున కంత వారల జాండమునకు । నవలనలుప వీడ్కొని వచ్చి రాత్మణంబ ॥ వ॥ అంత మున్ను పనిచిన దూత యరుదెంచి రత్నసింహాసనారూఢుండైన శూరపద్ముంగని కరంబులు మొగిడ్చి వినయాన్వితు లగుచు నిట్లనిరి ॥ తే॥గీ॥ దేవ మీయాజ్ఞ నటఁబోయి తెలిసి సకల । మిపుడు వచ్చితి మెంతయు నీశసుతుఁడు । కాంతినగరంబున వసించి సకలభూత । వితతిద్విసహస్రవాహినుల్ వేడ్కఁగొలువ ॥ వ॥ మఱియు మహాబలులను సేనాపతుల నష్టోత్తరశతంబును నమేయపరాక్రములగు నవసంఖ్యాధికలక్షవీరనరులును పరిచర్యాపరులై హరిబ్రహ్మాదిసురలు పరివేష్టించియుండు రమ్యమౌ మహాసన్నిధానంబున ॥ తే॥గీ॥ సాహసమునంగ సుగరస్థలమునందు । తారకునిఁ ద్రుంచి నీమవర్తనము నరయ । వీరబాహుని నమ్మహావిభుఁడు బనుప । నతఁడు పనుదెంచి యిచ్చటి కతుల మహిమ ॥ వ॥ నిశ్శంకుండగుచు బహుపరాక్రమంబుగ మెఱసి అంతఃపురాధిపతియగువ్యాళీముఖుని కృతాంతపురాభిముఖునిం గావించి యక్షయబలులగు రాక్షసుల నసేకులం బొరిగొని సుందరంబైన యప్పురం బంతయు నిర్మూలంబు చేసి మేటివీరుండగు వజ్రబాహునిం గీటణంగించి భవదీయబలాబ్ధులంబు లరసి చయ్యన మరలి యతనిసన్నిధిం జేరి యిచటివృత్తాంతం బంతయు విన్నవించిన ॥ క॥ హరవందనుఁ డమర్షంబున । హరిముఖ్యసుపర్వగణము నారసి శూరుం । బరిమార్తు నేపె యనవుఁడు । సురతరకాతూహలంబు నొందిరి దివిజుల్ ।



—*శూరుఁడాప్తులతో నాలోచించుట:*—

వ॥ అని యివ్విధంబున దూతపలుకులట్టియ్యఁ జెవులకు ములుకు లగుచు నులికిపడి శూరపద్ముండు నిజకుమారవర్గంబును సోదరుండగు సింహవక్త్రుని సకలసేనాధిపులను, మంత్రకోవిదులైన మంత్రివరులును, మర్మజ్ఞులును, రావించి విచారపరుండగుచు వారలకిట్లనియె ॥ తే॥గీ॥ వింటిరే యిప్పుడీవార్త విధిహరిముఖ । దివిజసందోహములు మహాదేవుఁ జేరి । శూరపద్ముండు వేధించు సారెమమ్ము । బ్రోవుమనుచును బహుభయంబునను వేడ ॥ వ॥ అప్పరమేశ్వరుండు ప్రసన్నుండై నిలింపులవచనంబు లాలించి కుమారుం గాంచి సేనాసమేతంబుగా నబ్బాలునిం బంచిన నతండునను దెంచి కాంతినగరంబునకు హరిబ్రహ్మాదిదేవగణసహితుండై మనతోడ నెదిరి యుద్ధంబు సేయనిశ్చయించి సన్నద్ధుండై యున్నవాఁడని పలికి వెండియు నిట్లనియె ॥ క॥ తారకుని దునిమి నప్పుడ । వారింపనౌ వాని మదము వసుధ శిశువుతో । శూరుఁడు సరిపోరెను నా । సారెనపయశంబు బొందఁజాలక యుంటిన్ ॥ వ॥ ఇతఃపరంబెద్ది కార్యంబు చెప్పుండనిన శూరపద్మునకు మయూరుం డిట్లనియె ॥ క॥ తారకునిహంతు జాతని । నీరితిన్ బాలుఁడంచు నెంచగ నగునే । ఘోరాజి వ్యూహ వి। దారుని మదిదూతయనుచు దలఁపఁగ నగునే ॥ క॥బలమంతయు హతమయ్యెను । దలఁపవు తన్మహిమ యిదియు తగునే నీకుం । బలునూటలేల నీక నీ । తలంపెట్లను నట్ల నడపు దానవనాథా ॥ వ॥ అనిపలికి యతండూరకుండె నంత దుర్గుణుం డిట్లనియె ॥ క॥ బాలుని భూతగణంబుల । దూలింపఁగ నీకు తగదు దోర్బలమెసఁగన్ । బాలుని గర్వమణంపఁగ । జాలమునకు సైన్యపతుల ననుపమఁ కీశా ॥ వ॥ అనిన యతని వాక్యంబులు విని యనంతరంబ ధర్మకోపుండిట్లనియె ॥ క॥ దానవనాథ భవత్సుతులైన హిరణ్యాగ్నివక్త్రుల య్యిరువురలో । యొనుగ నొక్కఁడచాలఁడె । వానిం గూల్చుటకు నాహవంబున కడిమిన్ ॥ క॥ బాలుఁడు గావున తారకుఁ । డాలంబున నతనిచేత నపహతుడయ్యెం । జాలక ప్రత్యస్త్రవిధా । నాలోచనకలన దానవాన్వయతిలకా ॥ వ॥ మఱియుం గ్రౌంచుం డగస్త్యశాపంబు వలన విదళితుండయ్యె వజ్రబాహుండును సంగరంబున సాధనంబులైన రథశరాసనాదు లేమరి దూతచేత వృథానిహతుండయ్యె దీని నేమిగొంత యగు సర్వరంబుగ హరిబ్రహ్మాదినిఖిలదేవసైన్యంబులతోడ నబ్బాలు జయించుటకు మనదెసలంగల సేనాధిపతులఁ బనుపనగునని పలికియూరకుండె నయ్యవసరంబున కాలజిత్తుం డిట్లనియె ॥ క॥ హరివిధిపురందరాదుల । సురలను బూర్వంబు గెలిచి కుంభద్రత్వాధిం । బరగిన నీకిపు డేటికి । కరము విచారంబు వైరిగంధేభహరీ ॥ వ॥ అక్కుమారుని మీద సైన్యంబులనేని బనుపుమొండె కాదేని నన్నుం బనుపు మిప్పుడేను గదలి నీమనంబునకు సంతసంబుగ నఖర్వగర్వ ధూర్వహుండగు నయ్యర్భకునిదర్పం బణంచెదనని పలుకు నెడ శౌర్యప్రచండుండను ఖాఁడసురులం గూర్చి యిట్లనియె ॥ క॥ డింభకు నొక్కని సంగర । కుంభినిభూతములతోడఁ గూల్చుటకై యెంచిం । తాంభోధి మునుఁగ నగునే । గంభీరత మాని దనుజగణసారులా ॥ వ॥ అంత నతండు శూరునిం గని ॥ తే॥గీ॥ అతనికి సహాయమై వచ్చు నఖిలభూత । గణముల జయించి యర్భకుఁగడిమి మెఱయ । నేను దోతెంతు నీదుసన్నిధికి నిపుడు । ననుమతి నొసఁగు దనుజేంద్రయనుచుబలికె ॥ వ॥ అంత నలుండను గండుండు చెప్పిన విధంబున నిట్లనియె ॥ ఆ॥ వె॥

చింత సేయఁజనునె యింతయు నీమది। నర్భకునకునిట్లు నసురవర్య। యిమ్ముగా కనుజ్ఞ నిలభూతతతిఁ గూల్చి। బాలుఁ బట్టితెత్తు హితిధిమెఱయ॥ వ॥ అంత సింహాండను వాఁడిట్లనియె॥ క॥ సురపతికి సహాయుండై। యరుదెంచిన బాలు నతని యాహవకేళిన్। స్ఫురదురుచిరభుజాప్రతాప। స్ఫురణన్ గెల్చుటకు చింత బొందఁగ నేలా॥ ఆ॥వె॥ కమలజాండములను గలయోధులందఱు। నతని కొగి సహాయులైన యేమి। వానిగర్వమెల్ల వారించి వెసబలు। గెలిచి వత్తు నాకు సెలవొసంగు॥ వ॥ అని యివ్విధంబున మంత్రులు సేనాధిపతులు నుబలికిన విని యనంతరంబ భానుకోపుం డిట్లనియె॥ తే॥గీ॥ తారకాశ్రించులను మహోదారబలుల। నాజిఁ గూల్చిన యపుడు విన్నవుప వైతి। బాలుఁడాతను దొడ్డగఁ బ్రస్తుతించె। దేల భవదీయబలముల నెఱుఁగఁకకట॥ వ॥ బహూక్తులింకేటి కతనిజయించుటకు నాకనుజ్ఞనొసంగు మనిన నంత హిరణ్యుండిట్లనియె॥ క॥ బాలుని దర్పమణంపఁగ। చాలవిచారమును బొందఁజనునే యాహా। యీలాగైనను నగరే। వాలాయము జనులు దైత్యవంశాధీశా॥ తే॥గీ॥ భానుకోపుని బనుపుము బాలుమీద। నతని బంపిన జయమగు నట్లుగాని నన్ను బొమ్మన్నఁ బోయి సైన్యముల తోడ। నర్భకుని నాజి నిరసించి యరుగఁదెంతు॥ వ॥ అంత నగ్నిముఖుండు జనకుం గనుంగొని యిట్లనియె॥ ఆ॥వె॥ తండ్రి వినుము నీకు తమ్ముని తారకు। నర్భకుండు దునిమె నాజిలోన। వాని దూతవచ్చి వడినన్నుఁ దనుజాని। వ్రజబాహుఁ దునిమి వైచెఁ గడిమి॥ వ॥ తద్గర్వంబే నెట్లు సహింపఁజాలు వాఁడ నాకనుజ్ఞ నొసంగుము త్రికరణంబుగా సైన్యంబులతోడ వానిం బరిమార్చికొని కాని నీసముఖంబున కెట్లు రానేర్తు మున్ను మహాపరాక్రమసంపన్నుండనై బలిసద్మనివాసుల జయించుట నీ వెఱుంగవే బ్రహ్మగత్తంబులగు కవచకార్ముకనానాదివ్యాయుధంబులు నాకుం గలవు గావున నన్ను రణంబునకు నియోగింప నగునని పలికె నిత్తెఱంగున నందఱు బలుకు నవసరంబున సర్వార్థవిదుండగు సింహావక్త్రుండు వారల నందఱ నివారించి శూరపద్మునిం జూచి తథ్యంబులయిన వాక్యంబుల నిట్లనియె॥

## —:*సింహవక్త్రుఁడన్నకు నీతిచెప్పుట*:—

క॥ శాశంకమౌళి తనయుఁడు। లీలామహిమాద్భుత బాహుశేయుఁ ద్రిలోకీ। పాలకు దానవనాయక। బాలుం డనిమదినిఁ దలపఁ బాఁడియె నీకున్॥ క॥ పరమేశుఁగా నీకు నెవ్వఁడు। పరికింప నతండ కాదె బాలుం డితఁడున్। బరగు తదాజ్ఞను జగముల। కరయఁగ నుత్పత్తి లయము లనవరతంబున్॥ క॥ విశ్వేశుఁ డతఁడొసంగిన। యైశ్వర్యం బనుభవించి యతిగర్వమునన్। విశ్వమున నూరకుండక। శశ్వద్బాధలను బెట్ట జనునే సురులన్॥ వ॥ నీవు బ్రహ్మేంద్రాదుల బాధించుటయు నింద్రతనయుం జెఱనిడి విడువకుండుటయు మొదలైన వృత్తాంతంబులువిని భగవంతుండగు శంభుసంభవుండు దేవతలయందు దయాళుండగుచు మనల జయించుటకు కాంతిపురంబును శేరి యచటికి నందికేశ్వరగణంబులలోన నధికుండైన యమ్మహాబలుని బనిచిన నతనియందు దూతబుద్ధిం జేసి తన్మహామహిమం బెఱుంగ వైతి మఱియు నీకీశ్వరుం డష్టోత్తరశతయుగంబు లాయువొసంగె నదియును సన్నిహితంబయ్యె శక్త్యాయుధంబున మరణంబొసంగె నదిగావున శక్తిధరుండై సుకుమారుం



డగు కుమారుండు సనుదెంచె నిటు ఘటనాఘటనసమర్థుండైన మహాదేవు మాయనెఱుంగవైతివి తాదృశబుద్ధి నీకేల ప్రబలంబయ్యె వివేకవిశారదుండవై॥ క॥ బందీగృహ సంస్థితులగు। బృందారకవరుల విడిచి ప్రియమొప్పఁగ న। య్యిందుకళాధరసుతునకు। వందనమొనరించి యాతనివచనమువలెన్॥ ఆ॥వె॥ నిర్భయుండవగుచు నిఖిలభోగంబులు। బొందియుండు మాత్మపురము నందు। పుత్రమిత్ర బంధుపోషణ పరుఁడవై। దానవేంద్ర ధీరధైర్యసాంద్ర॥ వ॥ అని యథార్థంబుగా సింహవక్త్రుం డాడిన వచనంబులు విని దోషాచరేంద్రుండు రోషఘూర్ణితరక్తలోచనుండును, విస్ఫురదధరవదనభాసమానుండును, ప్రవర్తస్వేదకణసంవృతగాత్రుండును నగుచు నిట్లనియె॥ క॥ భ్రాంతుండ వేమి పచించెదొ। కింతయును మదిలజ్జఁ దొలంగి యెదుటనునీవ। త్యంతము భూతముల శిశువ్వింతగఁ బొగడెదవు వంది విధమున నాతోన్॥ క॥ బాలునకు మ్రొక్కమనియెదు। నీలక్షణమెల్లఁ దెలిసె నిలువుము కుమతీ। నాలావు బలము దొలఁగెనె। నీలగళుం డొసఁగు వరము నీ వెఱుఁగవొకో॥ క॥ చను మెందైనను నాయెదుఁ। దను నీవుండంగ వలదు తద్దయు ననుదున్॥ వినితూరుని కఠినోక్తుల। నసుజాఁడు సింహాస్యుఁ డప్పు డతిఖిన్నుండై॥ క॥ ఏ నెంత హితము చెప్పిన। వీనులఁ జేర్పం డితండు విపరీతముగా। మానసమునఁ దలపోయును। మానుగ తదభీష్ట సరణిమున్ బలుకఁదగున్॥ అని నిశ్చయించి యతండిట్లనియె॥ క॥ నానాదివ్యాయుధములు। దానవవర నాకుగలవు తథ్యంబుగ నీ। వానతి యిచ్చిన నిక్షణ। మేనుం భూతములతోడ నీశుకుమారున్॥ వ॥ ఆహవంబున విహతుం జేసి భవత్సన్నిధికరుదెంచెదనని పలికి సింహముఖుండు సమరసంభ్రమవిజృంభితభ్రుకుటీకరాళుండయ్యె నంత॥ క॥ శూరుఁడు విని సింహాస్యున। కీరీతి ప్రసన్నబుద్ధి కింతయు ముదమింపారఁగ ననుజునితోడను। పారతరోక్తులను బలికె సభలో నెలమిన్॥ క॥ నాధైర్యము నాబలమును। శోధింప దలంచి యనిన దూష్యలివి వృథా। క్రోధముఁ జేసితి నీపై। సాధుతరంబగును నీమనవి జగతిన్॥ క॥ బాలకుని కొలుకు నిత్తరి। నాలంబున కరుగనీకు నర్హంబగునే। బాలుం డిటు వచ్చినచో। నాలాగున నిమ్ము బిలుకు నతని జయింపన్॥ వ॥ కావున నిప్పుడు గృహంబున కరుగుమని తమ్ముని వీడ్కొలిపి యచ్చట నుండు నందఱిని బనిచి శూరపద్ముం డంతఃపురంబునకుం జనియె నంత నారాత్రి చనిన మఱునాఁడు॥

## కుమారస్వామి జైత్రయాత్రకు వెడలుట

మ॥ చెలువున్ మీఱను మారకుమారుఁడు మణిసింహాసనాసీనుఁడై। జలజాతోద్భవముఖ్యవాదిదివిషత్సంఘంబు సేవింపఁగా। నలరన్వీరగణంబు ద్రోల నవసంఖ్యాధిక్యలక్షోన్నతిం। గొలువై వేడుక వీరబాహుసమరాగ్రుం గాంచి భవ్యంబుగన్॥ ఆ॥వె॥ రథము దెమ్ము వేగ రణమునకరుగఁగ। వలయు నసుదు స్వామివచన మపుడు। వేడ్క నాలకించి వీరబాహుఁడు నెప్పఁ। బవను తోడనతఁడు పటిమమెఱయ॥ వ॥ శక్వరంబుగఁ జని నానారత్నవిచిత్రితంబగు రథం బాయత్తంబు సేసి తెచ్చి సన్నిధికిఁ జని వీరబాహుండు విజ్ఞాపనం బొనర్ప కుమారుండు సింహాసనంబు డిగ్గి రథంబధిరోహించె నంత॥ క॥ కమలాసన కమలేశ। ప్రముఖామరసంఘమెల్ల భాసురలీలం। దమతమ వాహనముల పైఁ। గ్రమమెఱ

ప్పఁగ నెక్కి రంబికాసుతు నాజ్ఞన్ ॥ క॥ గరు డారూఢుం డచ్యుతు । హరిపద్మజుఁ డంచ నెక్కి నమరేంద్రుండున్ । గరమలరవిమానంబును । నరదంబులపై జెలంగి రలసైన్యపతుల్ ॥ వ॥ ఇట్లుసమరసన్నాహసముత్సాహ భరితులై వాహినీ ద్విసహస్రంబులగు భూతగణంబులతోడ ప్రళయార్ణవకల్లోలమాలికాఘోషంబుల ననుకరింపుచు బృందారకదుందుభులును కర్కశకాహళీకాపటహడిండిమాదిఘోషంబులు మొరయ, సురలు విరులవర్షంబులు గురియ, బిట్టుగ నట్టహాసంబులు సెలంగ, నభంగవిక్రమంబుల పారావారతీరంబు చేరఁ గదలిరి ॥ ఆ॥ వె॥ అపుడు బహుళ తాంగహయసింధురపదాతి । చరణధుతపరాగచయము చేర । పంకిలత్వమొంది పాథోధి దాటంగ నలవియయ్యె నిఖిలబలములకును ॥ వ॥ ఇట్లు షణ్ముఖుండు సేనలతోడ నంభోనిధి దాటి పురియుత్తరద్వారపరిసరంబున విడిచి నప్పుడు ॥ క॥ హరివిధులు శంభునందను । చరణంబులకొరిగి యనిరి జగదీశ మహా । కరుణామతి విను దానవు । పురము నిపుడు నీవు చేరఁ బోల దధీశా ॥ తే॥ గీ॥ ఇచట భూరుణ్ణగో నిది యొకఁ డిగినాఁడు । హోరి కరుదెంచునప్పుడు శూరపద్ము । గర్వ మణఁగింపు మనవుడు క్రౌంచభేది । హరివిధులు జేయు ప్రార్థన నాలకించి ॥ వ॥ ఈక్షణంబ విశ్వకర్మ రావించి యొకపురంబు నిర్మింపు మనవుడు నతండు నానారత్నగోపురప్రాకార మంటపపరిశోభితంబును, వివిధవిచిత్ర గృహాలంకృతరాజవీథిమనోహరంబును, సకలవిభవాభిరామంబును, హేమనిర్మితంబగుట హేమాఖ్యంబునగు నగరంబు నిర్మించి విజ్ఞాపనంబు గావించిన కుమారుండు దానిం గనుంగొని సంతోషించి రథంబుడిగ్గి యందొక్క దివ్యభవనంబున ప్రవేశించెనంత హరిబ్రహ్మాద్యఖిలసేనాపతులును ప్రత్యేకంబ యథార్హస్థానంబుల నివసించి రంతయు ॥ ఆ॥ వె॥ శివకుమారు గొలుచు సేనాపతులపేర । లెన్నరింతుఁ జెవుల కింపుగాను । వినుఁడు శౌనకాది విబుధపుంగవులార సావధానచిత్తు లగుచు నిపుడు ॥ వ॥ అని సూతుండిట్లనియె నమ్మహావీరులు శుభ్రుండును, మేఘమాలియు స్వేతుండును, కరాళుండును పాత్రకుండును, పరిఘు నేమియు హంతవహుండును పుష్పదంతుడును, రుద్రాకారుండును, హరుండును మణిజిత్తుండును, కేతుమాలియు వక్త్రిండును, బ్రహ్మకేశుండును, నధిపతియును, కళింగుండును, ఘోరుండును, నచ్యుతుండును, బలుండును, కాలుండును, చిత్రసేనుండును, భూరినాముండును, సుశీలకుండును, మాజయుండును, మానషంతుండును, సింహుండును, నుత్తరసింహుండును, పదిష్టుండును, జయుండును, ఘత్తకుండును, మత్తంగుండును, చండుండును, మహాబలుండును, నీలవక్త్రిండును, శుభావహుండును, నందాభరణసఖుండును, కాకపాదుండును, పింగళుండును, సమాయుండును, మాయుండును, ఖరుండును, నికుంభుండును, కుంభుండును, శంఖుండును, పాలకుండును, విశిఖుండును, శతతాళుండును, హయగ్రీవుండును, నాయుతాక్షుండును, సహస్రబాహుండును, వసంతుడును, ఛాయుండును, మంగకేశుండును, సోమనాముండును, వజ్రమాలియు, నజముఖుండును బలియు, శరభుండును, క్రౌంచుండును, శార్ఙకుండును, కంధుండును, మేఘుండును, విజయుండును, విద్రుముండును, కఠినుండును, దండవ్యాఘ్రుండును, మహాభీరుండును, కాలపాశుండును, నిష్ఠురుండును, దశముఖుండును, కుముదుండును, భీముండును, ధనంజయుండును, వృషభరూపుండును, శుచిముఖుండును, ననలకేశుండును, ననలవక్త్రిండును, మంతుండును, సున్నత్తుండును, నందియు, నాత్రేభవుండును, వాయువేగుండును, మహాతేజుండును, జ్వాలాకేశుండును, భానుకంపుండును, ఖతంగుండును, శుద్ధుండును, నసేకప్రభుండును, శితుండును, నిందునాశుండును, కుమారియు, నత్రియు, నసురకాలుండును, హరికేశుండును, జ్వాలాకేశుండును, వీరందరష్టోత్తరశతసంఖ్యం బరగుదురు ॥ ఉ॥ అంతమున హరిముఖ్యాదివి జాలి నవాధికలక్షవీరుల । తత్క్షణము షణ్ముఖుండు నదండ భజింప నాతుల్ ఘటింపు చున్ వింతచెలంగు భాసురనవీనమణీమయభద్రపీఠిపై । సంతస మొప్ప నుండె గిరిజాప్రియసూనుఁడు వైభవోన్నతిన్ ॥ ఉ॥ నారదమౌని యంత కదనప్రియుఁ డౌటను వేగవచ్చియా । కూరునిగాంచి నీగురువు శుక్రుఁడు మత్స్యముఁ డెన్నఁ గాన నీ । కారయ నేమముం గలుగ నాప్తతమంబగు నొండుమాటనీ । తోరహిఁ దెల్పవచ్చితిని దోయధిదాటి పరాక్రమోన్నతిన్ ॥ తే॥ గీ॥ శంభుసూనుడు నీతోడ సమరమునకు । వచ్చె నతనికి భయపడ వలదు మదిని । సంగరమొనర్ప నీకును జయమునగ్గలంగ । లితమొనర్చెదనని తెల్పి తపసి చనియె ॥ క॥ శూరుఁడు తదీయవచనము । పారెకు విని యాలిగి నాతు సమర మొనర్పం । భారమెుకో యని చెంతను । ఘోరాఘోరులను జూచి గొబ్బున మీరల్ ॥

## భానుకోపుఁ డనికరుగుట.

చ॥ జలనిధి తోడితెండనినఁ జయ్యన వారలు పోయి వాని నా । జ్వలగతి తోడితేర నటువారధి గన్గొని శూరుఁ డిట్లనుం । దలఁ పఁగ నస్మదాజ్ఞ నుపధయిన నర్భకు భూతసైన్యమి । వ్వాలువిడువంగవచ్చునె లవంబు వివేకము లేక నీమదిన్ ॥ వ॥ అనిన సముద్రుండు శూరపద్మున కిట్లనియె ॥ క॥ ఏలా నాపయి కోపము । బాలుని వారించు నట్టి పటిమయు నాకుం । జాలునె యతఁడు సురేశుఁడు । దూలితి తద్భూతసైన్య ధుతధూళితతిన్ ॥ తే॥ గీ॥ అనుఁడు వనరాశి వచనంబు లాలకించి । యరిగె షణ్ముఖు మీద నయ్యసురమౌళి । యంతలో దూత లఖిలవృత్తాంత మరసి । వేగచనుదెంచి పలికిరి వివరముగను ॥ సీ॥ దనుజాధీశ్వర బాహాశౌర్యమిరవొందఁ ఖ్యాతిఁ జొప్పట్టియంబునిధిం దాటి సమస్తభూతతతితోఁ బొల్పొంద నక్కాల్రించభే । దనుఁడేతెంచి పురాంతికంబున విచిత్రం బొప్ప భాస్వత్పురం । బును నిర్మించి హరీంద్రముఖ్యదివిషత్పుంజంబు సేవింపఁగన్ ॥ వ॥ సకలవిభవంబుల జెలంగుచు నీతోడయుద్ధంబునకు సన్నద్ధుండై యున్నవాఁడని విన్నవించిన వారల వచనంబులు విని వీరబాహునివలన దగ్ధంబైన లంకాపురంబును గనుంగొనుచు శూరపద్ముండు కోపభీషణాకారుండయ్యె కనుగవకెంపుసొంపారసాత్యుణంబ నిజాత్మజుండగు భానుకోపుం దోడితెమ్మని దూతంబనిచిన వార లరిగి తద్వృత్తాంతం బతని కెఱిఁగించిన ॥ క॥ బలము లసంఖ్యంబులు తను । గొలువఁగ రథమెక్కి భానుకోపుఁడు శౌర్య । జ్వలితన్ శీఘ్రము శూరుని । నిలయద్వారంబునందు నిలిపి రథంబున్ ॥ వ॥ ఆస్థానంబున రత్నసింహాసనాసీనుండైన శూరపద్ముని సన్నిధికి జని నమస్కారంబుఁ జేసి చెంత నిలిచిన ॥ క॥ శూరుండు సుతునిఁ గనుగొని । వారక వృత్తాంతమెల్ల వచియింప మహా । దారుఁ డల భానుకోపుఁడు । పారెకు నాలించి దనుజచంద్రున కనియెన్ ॥ క॥ జనక చని యాక్షణంబున । ఘనసాహసమొప్ప భూతగణముల నెల్లం । దునుమాడి కలన బాలునిగొని తెతు

న్నీదు కడపఁ గుడుకం జెపఁగన్ ॥ వ॥ అనిన తనూజాని వచనంబులు విని సంతుష్టహృదయుండై దైవజ్ఞుండు ఏతనిం బనిచెనని సూతుండు చెప్పినవిని శౌనకాదులు కుతూహలభరితులై తరువాత వృత్తాంతంబెట్లయ్యెనని యడుగుటయు ॥ ఉ॥ రాజిత శైలధామ సురరాజముఖామరపూజ్య యామినీ। రాజకళావతంస నగరాజసుతా పరిరంభలోల గో। రాజవరాధిరూఢ ఫణిరాజసముజ్జ్వలభూష వాహినీ। రాజలసన్మకుట రతిరాజవిభంజన భక్తరంజనా ॥ క॥ సవనాశనహృత్తామస। నవనాంచచ్చంచరీకసత్ప్రకాశా। సవనాశకృతినాట్యో। త్సవ నానాదురితదూర సకలాధార ॥ పంచచామరం ॥ ధరాధరాత్మజామనోజ్ఞ నామసన్నిభా। సురాసురార్చితాంఘ్రిపద్మ సోమసోమశేఖరా। చరాచరాదివిశ్వపోషసారపారపాప్రసం। హరాహరాత్రయీశిఖావిహారహారనిర్మలా ॥

గద్య॥ ఇది శ్రీమదిందుధరసుందరపాదారవిందాస్పదహృదయకల్పపత్ర సకలసుకవి
జనానుగ్రహపాత్ర సుగుణస్తోత్రపవిత్రచరిత్ర కాశ్యపగోత్ర సోమా
…ల్లనార్యపౌత్ర శంకరామాత్యలక్ష్మాంబికాతనయ వినయవి
ధేయ బాలసరస్వతీనామాంక వేంకటాచలకవి ప్ర
ణీతంబైన శ్రీస్కాందంబను మహాపురాణాం
తర్గత శివరహస్య ఖండంబున వీరమహేంద్ర
కాండమందుఁ బ్రథమాశ్వాసము
సర్వము సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ



